# ప్రతి నీటి బొట్టును వినియోగిద్దాం సమృద్ధిగా దిగుబడులు సాధిద్దాం





గత 40 సంవత్సరాలుగా ఎన్నడూ లేనంత కరవు పరిస్థితులను రాష్ట్రం ఎదుర్కొంటున్నది. తీవ్ర వర్షాభావ పరిస్థితులవల్ల, అడవులు అంతరిస్తుండడం వల్ల, విచక్షణా రహిత వినియోగం వల్ల భూగర్భ జల మట్టాలు అంతకంతకూ తగ్గి పోతున్నాయి. ఈ స్థితిలో తక్కువ నీటితో ఎక్కువ భూమి సాగు చేసి, అతి ఎక్కువ దిగుబడి సాధించాల్సిన ఆవశ్యకత ఎంతో ఉంది.

సేద్యపు రంగంలో అధిక ఉత్పాదకత సాధించడం ప్రధానమైన అంశం. రైతాంగానికి ఆధునిక సాంకేతిక పరిజ్ఞానం అందుబాటులో ఉన్నప్పటికీ సేద్యపు నీరు అతి ముఖ్యమైన వనరు. అయితే ఉన్న నీటిని సమర్థవంతంగా వినియోగించుకుని అధిక ఉత్పత్తులు సాధించటానికి నీటిని పొదుపుగా, ప్రణాళికా బద్ధంగా, శాస్త్రీయంగా వినియోగించుకొని మంచి దిగుబడులు సాధించే విధానమే "డ్రిప్ఇరిగేషన్".

రాష్ట్ర ప్రభుత్వం రూపొందించిన మైక్రో ఇరిగేషన్ పథకానికి ఇదే ఆయువు పట్టు. భూగర్భ జలాలను గరిష్ట స్థాయిలో వినియోగించుకునే మేలైన పద్ధతుల్లో డ్రిప్ ఇరిగేషన్, మైక్రోస్ప్రేయర్లు, స్ప్రింక్లర్లు వంటివి రైతులకు అందుబాటులోకి రావడంతో ఉద్యాన పంటలకు ప్రాధాన్యత పెరిగింది.

నీటి వినియోగంపై రాష్ట్రప్రభుత్వం ఈ నెల 5 నుండి 14 వరకు రాష్ట్రవ్యాప్తంగా జలచైతన్య కార్యక్రమాన్ని చేపట్టి ఒక ప్రజాఉద్యమంగా అమలు చేసింది. నీటిని పొదుపుగా ఎలా వాడుకోవాలో గ్రామ గ్రామాన ప్రజల భాగస్వామ్యంతో తెలియపరిచింది.

అదే స్ఫూర్తి రైతులలో కూడా రావాలని సేద్యపు రంగంలో మైక్రో ఇరిగేషన్ విధానాన్ని ప్రతిష్టాత్మకంగా రూపొందించింది. ఎంపిక చేసిన కొన్ని మండలాల్లో ప్రయోగాత్మకంగా ఈ విధానాన్ని అమలు పర్చాలని నిర్ణయించింది.

**ప్రాజెక్టు స్వరూపం :**

- ప్రాజెక్టు విలువ మొత్తం 1,120 కోట్ల రూపాయలు
- రాష్ట్రంలో గుర్తించబడిన కొన్ని మండలాల్లో అన్ని వర్గాల రైతులకు ప్రాతినిధ్యం. అయితే బోరు, విద్యుత్ సౌకర్యం కలిగి ఉండాలి.
- 50 శాతం సబ్సిడీ కాగా మిగిలిన 50 శాతం రైతు సొంతంగా కాని, బ్యాంక్ ద్వారా రుణం రూపంలో కాని భరించాలి.
- ప్రసిద్ధి చెందిన అన్ని డ్రిప్ తయారీ కంపెనీల వారు ఇందులో పాల్గొంటున్నారు.
- అమలులో ఉన్న మండలాల్లో డ్రిప్ కంపెనీల డీలర్ నెట్‌వర్క్ స్థాపిస్తారు.
- 5 సంవత్సరాల పాటు డ్రిప్ కంపెనీల వారు మేలైన రకాల వినియోగం, మొక్కలు నాటే విధానం, నీటి పారుదల, ఫెర్టిలైజేషన్ వంటి అంశాలలో రైతులకు సహకరిస్తారు.
- ఉద్యానవన పంటలకే కాకుండా మల్బరి, చెరకు, అన్ని వ్యవసాయ పంటలకు మైక్రోఇరిగేషన్ సౌకర్యం ఉంటుంది.

**మైక్రోఇరిగేషన్ పద్ధతులు :**

సన్నని ప్లాస్టిక్ గొట్టాల ద్వారా నీటిని తీసుకొని వచ్చి మొక్కల వేళ్ళ వద్ద డ్రిప్పర్ల ద్వారా బొట్లు బొట్లుగా నీరు, ఎరువు అందించే విధానమే "మైక్రోఇరిగేషన్-ఫెర్టిగేషన్" అంటారు.

**ప్రాజెక్టు పరిధి :**

రాష్ట్రంలో ఎంపిక చేసిన మండలాల్లో మొదటి దశలో 2.5 లక్షల హెక్టార్లలో ఈ పథకాన్ని అమలు చేస్తారు.

ఇప్పటికే 22 జిల్లాలకు సంబంధించి ప్రాజెక్టు రిపోర్టు కూడా తయారు చేయడం జరిగింది. మొదటి దశ 2003 నుండి 2005 వరకు అమలులో ఉంటుంది.

**మైక్రోఇరిగేషన్ వల్ల లాభాలు:**

- 50% వరకు సాగు నీరు ఆదా అవుతుంది.
- నీటిని దాదాపు రెండు నుంచి మూడింతల విస్తీర్ణమైన భూమికి అందించవచ్చు.
- మొక్కలు / చెట్లు ఏపుగా పెరిగి, త్వరితంగా పక్వానికి వచ్చి అధిక దిగుబడులను సాధించవచ్చు.
- మొక్కలకు నీరు నేరుగా అందించడం వల్ల ఉపరితలం నుండి నీరు వృథా అయ్యే అవకాశం వుండదు.
- కరెంటు వినియోగంలో దాదాపు 40-45% పొదుపు చేయవచ్చు.
- పోషక పదార్థాల వినియోగ సామర్థ్యం పెరిగి (80%-90%) రసాయనిక ఎరువుల పొదుపు.
- నేలను చదును చేయటం, గట్లు కట్టటం, కాలువలు తవ్వటం, బోదెలు చేయ్యటం నీటిని పారగట్టటం మొదలైన పనులు ఉండవు.
- ఎరువులు వేయడానికి అయ్యే ఖర్చు ఆదా.
- కలుపు మొక్కల సమస్య బాగా తగ్గిపోయి వాటి నిర్మూలనకు అయ్యే కూలీల ఖర్చులో కూడా ఆదా.
- లవణాలు కలిసివున్న నీటిని కూడా ఉపయోగించుకోవచ్చు.
- దీని వల్ల భూసారానికి మరియు భూసమతుల్యతకు ఎటువంటి హాని కలగదు.
- చీడ పీడల బెడద తక్కువగా వుంటుంది.
- దిగుబడి నాణ్యత కూడా పెరుగుతుంది.

సేద్యపు రంగంలో ఎన్నోమార్పులు వస్తున్నాయి. ఉద్యాన, వాణిజ్య పంటలకు ప్రాధాన్యత పెరుగుతోంది. ప్రస్తుత వర్షాభావ పరిస్థితుల్లో రైతు ఆధునిక సేద్యపు పద్ధతులు అలవర్చుకోవాలి. ప్రభుత్వం అందిస్తున్న సహాయాన్ని అందుకొని సలహాలను పాటించి సేద్యపు రంగాన్ని మరింత ముందుకు తీసుకెళ్ళాలి. మైనర్ ఇరిగేషన్‌లో మరెన్నో అద్భుతాలు సాధించి ఆదర్శంగా నిలవాలి.



బంగారు గని కన్నా జలమే మిన్న

జారీ చేయువారు : సమాచార పౌరసంబంధాల శాఖ

'హాసం'
హాస్య-సంగీత పత్రిక
Also available on net - www.haasam.com

# ఇవీ సంగతులు

42

# హాస్యం - సంగీతం



**ముఖచిత్రం**
'నిన్నే ఇష్టపడ్డాను'తో
తరుణ్, శ్రీదేవి





'సెంటర్ స్ప్రెడ్'లో
'సీతయ్య'
సినిమా పాటల పుస్తకం
కలర్‌లో






'హాసం' పత్రికలో గానగంధర్వులైన ఆంధ్ర వాగ్గేయకారులనుగూర్చి తెలియ జేయడంలో తనికెళ్ళ భరణి గారి కలం చిలికే సుధలలో ఓలలాడుతున్నాం. ఎం. చిత్తరంజన్ గారు 'లలిత సంగీతం'లో ఒక్కో గీతాన్ని, రచయితల్ని పరిచయం చేయడం ఎంతైనా ముదావహం... ఆచార్య తిరుమల గారి 'నవ్వుటద్దాలు'లో సాహిత్య గుభాళింపులతో అప్పటి ఆణిముత్యాలు గూర్చి తెలపడం అభినందనీయం. ఇన్ని మాటలింకేల, 'ఓ! హాస రాజవూ' ప్రతి పేజీ నిత్య నూతనవే. మహదాశయంతో సాగుతున్న 'హాసం'కు ధన్యవాదాలు.

**-మహేంద్రాడ చలం, టెక్కలి.**

'హాసం'కు నేను 15 సంచికలనుండి విడువకుండా చదువుతూ యున్నాను. హాస్యంతో హాయి గొలుపుతూ పాత సినీ(సం)గీతాలతో హృదయాలను రంజిస్తూ పత్రిక చాలా చాలా చాలా బాగుంటోంది. ఘంటసాల జీవితచరిత్ర ఇంకా కొందరి సినీ ప్రముఖుల జీవిత విశేషాలను, అనుభవాలను ఈ పత్రిక ద్వారా తెలుసుకొంటూ యున్నాము. 16-31 మే సంచికలోని 'సిరివెన్నెల' గూర్చి, 'వసుంధరా దాస్' గూర్చి, పి.లీల గూర్చి, చెంచులక్ష్మి పాటల గురించి చాలా విపులంగా వ్రాశారు. ఇంకా కథలు, సీరియల్స్ చాలా బాగుంటున్నాయి. ప్రముఖ గాయనీ గాయకుల గూర్చి కూడా తెలుపుతున్నందులకు నా ధన్యవాదాలు. ప్రతి సంచికను భద్రంగా దాచుకొనే విధంగా మలచి మాకు అందిస్తున్నందులకు మీకు ఎంతగానో ఋణపడి ఉంటున్నాం.

**-వై. రాజానాయుడు, పెద్దచెన్నయ్యగారిపల్లె, చిత్తూరు.**

'హాసం' 40 వ సంచిక మిత్రుని యింట్లో చూసి, అదే ఊపులో ముందటి 39 సంచికలూ చదివాను. అద్భుతం. విమర్శలకు 'తావు' లేకుండా నచ్చనివాటికి 'చోటు' లేకుండా చేస్తూ పత్రిక నడపడం ఒక రికార్డు అయ్యుండాలి.

**-గంటి దాశరథి కృష్ణ, అమలాపురం.**

కిశోర్‌కుమార్ పై సీరియల్ ముగిసినందుకు బాధగా ఉంది. కాని ఒక ఉత్తరాది గాయకుడికి అంత గొప్ప ప్రాముఖ్యత ఇచ్చి మాకు ఆనందాన్ని కలిగించినందుకు మా అభినందనలు. ప్రముఖ గాయకులు, హిందీ సంగీత ప్రపంచంలో ఉద్దండులు రఫీ, హేమంత్‌కుమార్, కిశోర్, ముఖేష్ లపై పోస్టల్ స్టాంప్స్ విడుదలైనట్లు మీ ఎడిటోరియల్ ద్వారా తెలుసుకుని చాలా ఆనందించాము.

**-రామచంద్రరావు, కడప**

హాస్యం, సంగీతం మేళవింపుగా పాత కొత్తల మేటి కలయికగా రూపొంది వెలువడుతున్న 'హాసం' పత్రిక మాలాంటి సంగీతాభిమానుల్ని ఎంతో రంజింపచేస్తున్నది. ప్రతి శీర్షిక, ప్రతి వ్యాసం కూడా ఎంతో బాగుంటున్నాయి. 'హాసం' పత్రిక వదికాలాల పాటు ఇదేవిధంగా కొనసాగాలని కోరుకుంటూ -

**-పి.సిహెచ్.కోటయ్య, ప్రధాన కార్యదర్శి**
**ఘంటసాల కళాసమితి, అద్దంకి**

16-31 మే సంచికలో సిరివెన్నెల సీతారామశాస్త్రి గారి గురించి, గీత రచయిత కులశేఖర్ గారు వ్రాసిన మల్లెల వాసంతం, హేమంతుల చేమంతం, సిరివెన్నెల గీతం అన్న వ్యాసం చాలా బాగుంది. అతి తక్కువ మాటల్లో శాస్త్రిగారి గురించి చాలా చక్కగా వివరించారు ఆయన. శాస్త్రిగారి పాట చెవిన పడితే మనసు పింఛమారబోనుకుంటుంది. ఇది నిజం. సీతారామశాస్త్రిగారి కొన్ని పాటలు వింటుంటే మనసుకి హాయి కలిగి బాధల్ని మరపింప చేస్తుంది. కులశేఖర్ గారికి, ప్రచురించిన 'హాసం'కు మా కృతజ్ఞతలు.

**-వరదా సాయికుమార్, పర్లాకిమిడి, ఒరిస్సా.**

16-31 నాటి సంచిక చూచిన తర్వాత అన్ని పనులకు ఫుల్‌స్టాప్ పెట్టి లేఖ రాయించిన ఘనత ఏమయినా ఉన్నదంటే అది నిస్సందేహంగా 'హాసం' పత్రికకే చెందుతుంది. ఆచార్య తిరుమల గారు 'నవ్వుటద్దాలు" పేరుతో అందించే తెలుగు పద్యాల సొంపులు వర్ణించటం ఎవరి తరం? ఎప్పుడో టీనేజీలో చదివిన చదువుల్రావు నా మళ్లీ ప్రత్యక్షమయి నవ్విస్తూనే వున్నాడు. ఇక సంగీతంతోనూ రాగాలతోనూ కాస్తో కూస్తో పరిచయం కలిగిందంటే అది "ఈ పాట నేర్చుకుందాం" అన్న శ్రీ చిత్తరంజన్‌గారి చలువే. గత పదకొండు సంచికల నుండి బాపు గారి విశ్వరూపం పత్రికకే తలమానికం అన్నా ఆశ్చర్యం కాదు. కిశోర్ జీవనఝరి ముగిసి లతా మంగేష్కర్ ఝరి ప్రారంభం అవుతూవున్నదంటే చాలా ఆనందంగా వుంది. హాసం ప్రతి పుటా ఒక సానపట్టిన వజ్రమే.

**-ఆయికమలమ్మ, ఆలూరు.**

1-15 జూన్ హాసంలో పత్రికలో కడియాల సోమేశ్వర శర్మగారి(హైదరాబాద్) ఉత్తరం చదివాను.

శర్మగారూ! మే 16-31 హాసం సంచికలోని నా కథ అమెరికా పెళ్ళికొడుకు మీకు నచ్చలేదనీ, అవసరం లేకపోయినా ఆంగ్లపదాలను వుపయోగించామనీ మీరు చిరాకు పడ్డారు. కథ మీకు నచ్చకపోవడం, ఇంగ్లీషు మాటలను వుపయోగించడం మీకు బాధగా తోచడం వరకూ, మీ వ్యక్తిగత అభిప్రాయం. కాని వేరే పత్రికలో సాధారణ ప్రచురణకు నోచుకోని కథ అన్నారే అది మాత్రం నిజం కాదు. మీరలా అనడం న్యాయమూ కాదు. ఎందుకంటే మేము రాసిన కథ ప్రతి పాఠకుణ్ణి మెప్పించకపోవచ్చు కాని 'హాసం' ఎడిటర్ మాత్రం బాగుండకపోయినా ప్రచురించరు కదా? వారిని కించపరచడం కాదా? మీరీ ఉత్తరాన్ని కాస్త సున్నితంగా రాసివుంటే మీ విమర్శను గౌరవంగా స్వీకరించేవాళ్ళం. మీరు మాకు మార్గదర్శకులు కావాలి కదా? మీ పాఠక విమర్శకులే మా లోపాలను సరిదిద్దగల పుణ్యమూర్తులు. దయచేసి మీరు ఈ ఉత్తరాన్ని కూడా సీరియస్‌గా తీసుకోవద్దు. అదిగో మళ్ళీ... ఇంగ్లీషు పదం..... సీరియస్ అంటే తెలుగులో తీవ్రవమా?... తెలుగు కూడా సరిగారాని దౌర్భాగ్యులం. ఏం చేయమంటారు చెప్పండి. ఇలా మమ్మల్ని వదిలేయండి.

**-ఎ. అన్నపూర్ణ, హైదరాబాద్.**

మే 1-15 సంచికలో వేటూరి శీర్షిక 'కొమ్మకొమ్మకో సన్నాయి' లో 'మనసుకవి' ఆత్రేయ వ్యాసం మమ్మల్ని ఎంతగానో ఆకట్టుకుంది. చంద్రబోస్‌తో ఇంటర్వ్యూ చాలాబావుంది. "లలిత సంగీతం"లో కూడా ఎచ్.ఎమ్.వి. వారు క్యాసెట్లు విడుదల చేస్తే లలిత సంగీతాభిమానులం చాలా ఆనందిస్తాం. చాలా విషయాలలో విజయం సాధించిన మా(మన) హాసానికి, 'రాజా' గారికి ఇది పెద్ద కష్టమైన పనేవికాదు. దయచేసి లలిత సంగీతంను క్యాసెట్లుగా తీసుకువచ్చె ప్రక్రియ మన హాసం ద్వారా జరగాలని కోరుతున్నాం ముందుముందు "హాసం" మమ్మల్ని మరింత ఆనందింప జేస్తుందని ఆశిస్తూ

**-తంగుడు కృష్ణారావు, కరవంజ, శ్రీకాకుళం.**

'క్రమశిక్షణ, విషయజ్ఞానం ఉంటే పత్రికలు వదికాలాలు బతుకుతాయని రుజువు చేస్తున్నది.' అంటూ ఆంధ్రజ్యోతి నుండి ప్రశంసలందుకున్న 'హాసం' కు అభినందనలు. రెండునెలలుగా మండువేసవిలో అల్లాడిపోతున్న పాఠకులను చల్లటి హాస్యవుజల్లులతో సేదదీర్చింది హాసం. 1-15 జూన్ సంచికలో 'పతి పత్ని ఔర్ అది' కథలో రచయిత్రి కథనడిపిన తీరు కళ్లఎదుట ఆ సంఘటన జరుగుతున్నట్టుగా అనిపించి కుర్చీలో కాళ్లు పైకి పెట్టుకుని కూచుని ఊపిరి బిగబెట్టి చదివించి నవ్వించింది.

**- గొల్లమూడి పద్మజ, హైదరాబాద్**

లతా మంగేష్కర్ గురించి ప్రముఖ నేపథ్య గాయకులు శ్రీ డా॥ పి.బి.శ్రీనివాస్‌గారు అక్షరబద్ధం చేసిన 'సప్తస్వరసుందరి లతా మంగేష్కర్' జీవిత చరిత్ర సీరియల్ ప్రారంభం నాకెంతో ఆనందాన్ని ఇచ్చింది. కోయిల స్వర చిరునామా లత. పదాలకుపదనిసలు నేర్పిన స్వరం ఆమె స్వంతం. భారతీయ పాటకు పట్టుచీర కట్టి సగౌరవంగా సంగీత ప్రపంచంలో నిలిపిన లతా మంగేష్కర్ వయసు మీదపడుతున్నా స్వరం మాత్రం కోయిలలా కమ్మని రాగాలను అలుపెరుగక ఆలపిస్తూనే వుంది. శ్రీ పి.బి. శ్రీనివాస్ గార్కి హాసం నిర్వాహకులకు మా కళాభినందనాలు.

**-దోవారి నాగేశ్వరరావు, వేకనూరు,**

సంపుటి : 2 సంచిక:18

16-30 జూన్ 2003

పేజీలు: 68 + 8

విడి ప్రతి : రూ. 10-00

సంవత్సర చందా : రూ. 200

విదేశాలలో (ఎయిర్‌మెయిల్): $50

జీవిత చందా : రూ. 2000

విదేశాలలో (ఎయిర్‌మెయిల్) : $400

మేనేజింగ్ ఎడిటర్
ఎమ్బీయస్ ప్రసాద్

ఎడిటర్
రాజా

రిఫరెన్స్ కర్టెసీ
డా॥ కె.వి.రావు
జె.మధుసూదన శర్మ

HAASAMHAASYASANGEETHAPATHRIKA
Flat No. 502, Sri Balaji Nilayam
13-1-212, Motinagar,
Hyderabad-500 018
Ph: 2383 1388 / 5557 0215
email: haasammag@hotmail.com

Printed and Published by:
**K.I.Varaprasad Reddy**
on behalf of Hummus Infoway (P) Ltd.,
502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018
Fax: 040-23541713

**Printed at:** Kalajyothi Process Ltd.,
1-1-60/5, RTC X Roads,
Musheerabad, Hyderabad-20,

**Published at:** 502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018

**Editor: RAJA**

Marketed by:
Margadarsi Marketing Pvt Ltd.,
6-3-570, Eeenadu Compound
Somajiguda, Hyderabad-82

The one and only Magazine devoted to Humour & Music



# హాసం

## హాస్య-సంగీత పత్రిక

42

గతపక్షం జూన్ 9 న రవీంద్రభారతి ఆవరణలో జరిగిన ఘంటసాల విగ్రహావిష్కరణ సభలో ముఖ్యమంత్రి కురిపించిన వరాలవర్షంలో తడిసి ఘంటసాల అభిమానులు ఉక్కిరిబిక్కిరయారు. నిజానికి చాలా రోజుల తర్వాత ఆ రోజే ప్రకృతి కాస్త శాంతించి, వాతావరణం చల్లబడి, కాద్దిగా జల్లులు కురిశాయి. ఆహ్లాదమయమైన వాతావరణానికి తోడు ఒక కళాకారుడిపట్ల ప్రభుత్వం కనబరుస్తున్న గౌరవాభిమానాలు సభికులను ఆనందపరవశులను చేశాయి.

ఏదేళ్ల క్రితం లలితాకళాతోరణంలో తాను స్థాపించిన విగ్రహాన్ని రవీంద్రభారతికి తరలించాలని శ్రీ ఎస్.పి.బాలసుబ్రహ్మణ్యం ముఖ్యమంత్రిగారిని కోరడం, ఆయన వెంటనే సరేననడం పాఠకులకు తెలిసిన విషయమే. ఘంటసాలపై స్టాంపు విడుదల సందర్భం కాబట్టి, ఏదో ఎమోషన్‌లో ఒప్పేసుకున్నారు గానీ ఆ తరువాత ఆచరణలో కాలయాపన జరుగుతుందేమోనన్న భయాలను వమ్ము చేస్తూ నాలుగునెలలలోనే ఆ విగ్రహం నగరం నడిబొడ్డుకు, కళామతల్లి నిత్యం నర్తించే వేదికకు తరలివచ్చింది.

వ్యవహారం ఇంతటితో ముగిస్తే ఆశ్చర్యం లేకపోవును. కానీ ముఖ్యమంత్రి కాస్త..కాదు, కాదు.. బాగా ముందుకు వెళ్లారు. రాష్ట్రప్రభుత్వం ప్రతిఏటా ఇచ్చే నంది అవార్డులలో ఉత్తమగాయకుని అవార్డుని ఘంటసాల పేరిట ఇవ్వటం జరుగుతుందన్నారు.ప్రభుత్వ సంగీతకళాశాలలో లలిత సంగీతంపై ఒక ప్రత్యేక కోర్సు ప్రవేశపెడుతుందన్నారు. భాగ్యనగరంలో ఒక రోడ్డుకు ఘంటసాల పేరును పెడతామన్నారు. అంతేకాదు ప్రతి సంవత్సరం ఘంటసాల జయంతిని డిసెంబరు 4 న రాష్ట్రప్రభుత్వం ఆధ్వర్యంలో నిర్వహించనున్నట్టు ప్రకటించారు.

ముఖ్యమంత్రి ప్రకటనలు వినగానే ఇవన్నీ నిజమేనా? ఒక కళాకారుడిపట్ల ప్రభుత్వం ఇంతటి ఆదరణ చూపడమా? అని కళ్లు నలుముకుని చూడబోతూండగానే ప్రకటనల పట్ల సభలో చెలరేగిన హర్షధ్వానాలు, 'థాంక్యూ సార్','సీయమ్ జిందాబాద్' అన్న కేకలు మిన్ను ముట్టడంతో ఇదంతా వాస్తవమేనని రూఢి అయింది. అది ఎన్నికల సభకాదు. ఓట్లబ్యాంక్‌పై కన్నువేసి ఆచరణసాధ్యం కాని వరాలు గుప్పించే రాజకీయసభ కాదు. ఉత్తుత్తి వాగ్దానాలకు మురిసిపోయి చప్పట్లు కురిపించే అమాయక ప్రజలచే నిండిన సభ కాదు. ప్రజాభిమానాన్ని సంపాదించుకున్న కళాకారుడిపట్ల, ప్రజాభీష్టంతో ఎన్నుకోబడ్డ ప్రజాప్రతినిధి అర్పిస్తున్న ఘనమైన నివాళికి వెలువడుతున్న ప్రజామోదం అది. ఆ విషయాన్ని అంగీకరిస్తూండగానే ప్రజాభిమానాన్ని సంపాదించుకున్న కళాకారుడు మరి ఘంటసాల ఒక్కరేనా అన్న సందేహం వస్తుంది వెంటనే!

ప్రతి కళాకారుడూ అంతో ఇంతో ప్రజాభిమానాన్ని చూరగొన్నవాడే. లేకపోతే రంగంలో నిలదొక్కు కోనేలేడు. ఉద్యోగిని, వ్యాపారస్తుడిని ఇష్టంలేకపోయినా భరిస్తారు కానీ తమకు నచ్చని కళాకారుడిని నిర్దాక్షిణ్యంగా తీసి పక్కన పెట్టేస్తారు ప్రజలు. ఇందులో సిఫార్సులకు, మొహమాటాలకు తావు లేదు. ప్రజాభిమానాన్ని పొందిన కళాకారులెందరికో జరగని ఈ స్థాయి సత్కారం ఘంటసాలకు ఎందుకు జరుగుతోందన్న ప్రశ్న ఉదయిస్తోంది ఇక్కడ. అదీ మరణించిన మూడు దశాబ్దాలయినా జనాలకు ఆయనపై ఇంతటి ప్రేమాభిమానాలా? ఏమిటీ మిస్టరీ?

దీనికి ప్రతిభతో బాటు, వ్యక్తిగతమైన ఇమేజి కూడా ఘంటసాలకు తోడ్పడిందని చెప్పుకోవాలి. నిరాడంబరజీవితం, వినయం, పరోపకార స్వభావం, సాటి గాయకులపట్ల, తోటి సంగీతదర్శకులపట్ల నెరపిన స్నేహభావం, బీదసాదలపట్ల ఔదార్యం, పెద్దలపట్ల గౌరవం, వృత్తిలో క్రమశిక్షణ, దేశభక్తి - ఇవన్నీ మరింతగా తెలుస్తున్నకొద్దీ ప్రజలకు ఆయనపై మరింత భక్తిభావం పుట్టుకొస్తోంది. 'భక్తిపాటలు పాడితే ఘంటసాలే పాడాలి, పద్యంకానీ, శ్లోకం గానీ, దండకం గానీ, భగవద్గీతగానీ ఘంటసాలే పాడాలి' అన్నది చిన్నప్పటినుండీ ప్రతి తెలుగువాడి మెదడులో పడిపోయిన ఓ ముద్ర. 'నమో వెంకటేశా' అనే పాట చెవులపడుతూంటే వెంకటేశుడిపై భక్తి మాట అలావుంచి ఘంటసాలపై భక్తి పుట్టుకొస్తుంది. అందువల్ల బాల్యం నుండీ ఓ ఆరాధనా భావం ఏర్పడుతుంది. కానీ పెరిగి, జ్ఞానం వస్తున్నకొద్దీ చిన్నప్పటి ఇమేజి కరిగిపోవడం సహజం. గాంధీగారిలో కూడా లోపాలు కనబడడం మొదలుపెడతాయి. కానీ ఘంటసాల విషయంలో ఈ హీరోవర్షిప్ చెడకుండా ఉండడానికి కారణం - ఆయన గురించి వెలుగులోకి వస్తున్న మరిన్ని విశేషాలు.

ఆయన తిండికి లేక కష్టపడిన రోజుల్ని మర్చిపోలేదు. దాచివేయలేదు. నిర్మొగమాటంగా చెప్పుకున్నాడు. గురువులను, ఉపకారం చేసినవారిని మరువలేదు. అహంకరించలేదు. కయ్యాలకు దిగలేదు. దర్శకనిర్మాతలతో పేచీలకు దిగలేదు. బాధ కలిగినా, కష్టం కలిగినా ఓర్చుకున్నాడు. ముందులో తృణీకరించిన వారే పిలిచి పెద్దపీట వేసిన సందర్భాలలో మీసం మెలివేయలేదు. ధనార్జనకై కాక మనసుకు నచ్చిన పనులెన్నో చేశాడు. మంచి అనుకున్నదానికీ, అనుకున్నవారికి సాయం చేశాడు.

ఈనాటి కళాకారులందరూ గుర్తించవలసిన విషయం ఇదే! తక్కిన రంగాలతో పోలిస్తే కళారంగంలో ఉన్నతస్థానానికి చేరడం సులువు. ఒక్క సినిమా హిట్ అయితే స్టార్ స్టేటస్ వచ్చేస్తుంది. కానీ నిలదొక్కుకోవడం చాలా కష్టం. బయటి కారణాలు కొన్నయితే అంతర్గత కారణాలు కొన్ని, అహంకారానికి, అసూయకు బలయి కళను ధ్వంసం చేసుకున్న వారెందరో కనబడతారు. ఘంటసాల వారిని స్ఫూర్తిగా తీసుకుని ప్రజల మనసులో శాశ్వతస్థానాన్ని పొందదలచిన కళాకారులందరూ కళాపరమైన ప్రతిభతో బాటు, వ్యక్తిగతమైన సల్లక్షణాలను కూడా సంతరించుకోవాలని 'హాసం' అభిలషిస్తోంది.

# "నమోనమః" (నాటిక)

- దివాకరబాబు
ప్రముఖ సినీ రచయిత





దాదాపు 15 సంవత్సరాల తర్వాత మళ్ళీ నాటిక రాసాను.
మా అబ్బాయి చి॥చైతన్య 'నాన్నా... ఒక నాటిక
రాయకూడదు వేస్తాం అని అడిగాడు.
అప్పటికే మనసులో రూపుదిద్దు కుంటూన్న
ఓ కథ వస్తువు ఇది. వెంటనే రాసిచ్చాను.
ఇందులో 4 పురుష పాత్రలు, 1 స్త్రీ పాత్ర వున్నాయి.
పురుష పాత్రల వయసు 25 సంవత్సరాలు,
స్త్రీ పాత్ర వయసు 19 సంవత్సరాలు...
25 సంవత్సరాలు పైబడిన వయసు వాళ్ళయినా
పురుష పాత్రల్ని పోషించవచ్చు
కానీ స్త్రీ పాత్ర మాత్రం ఖచ్చితంగా 19 సంవత్సరాలే..

- దివాకరబాబు

తెరలోంచి టి.వి. న్యూస్ రీడర్ వాయిస్

OBV : ఫ్లాష్ న్యూస్

హైదరాబాద్ నుంచి ముంబాయికి వెళ్లవలసిన విమానం టేకాఫ్ అయిన కొద్ది నిముషాలలో సాంకేతిక లోపం వల్ల కుప్పకూలిపోయిందని తెలియజేయడానికి విచారిస్తున్నాం. ప్రయాణికులు ఎవరూ ప్రాణాలతో వుండి వుండకపోవచ్చునని విమానాశ్రయ అధికారులు భావిస్తున్నారు. విమానం ఎక్కడ కూలిపోయింది తెలుసుకోవడానికి విమానశ్రయ అధికారులు తీవ్రంగా గాలిస్తున్నారు.

Back ground లో విషాదకరమైన సంగీతం.

తెర తొలగింది.
అదొక దట్టమైన అడవి.
ఒక టీనేజ్ అమ్మాయి పేరాచూట్ తో చెట్టుకు తగులుకొని వేలాడుతుంది.
పక్షుల కిలకిలలు
దూరం నుంచి పులి అరుపులు
ఆ అమ్మాయి స్పృహలో లేదు.
అడవి జంతువుల అరుపులకి స్పృహలోకి వచ్చింది.
తను ఎక్కడ వుందో, బ్రతికుందో, లేదో తెలియని స్థితిలో Panic అయి పిచ్చి, పిచ్చిగా కేకలు వేస్తుంది.

$OBV_1$ : హలో....

$OBV_2$ : ఎవరది..

$OBV_1$ : .......

$OBV_2$ : నన్ను రక్షించండి.

అంటూ అరుస్తూ ఇద్దరు కుర్రాళ్ళు చెరో వైపు నుంచి వచ్చారు. అరుస్తున్న అమ్మాయిని చూసి

ఇద్దరు : స్టాపిట్..

ఆ అమ్మాయి అరవడం ఆపింది

కళా : ఎవరు నువ్వు? ఎందుకలా అరుస్తున్నావ్?

ప్రజ : ముందు ఈ బెల్ట్ విప్పండి.

పేరాచూట్ వంక చూస్తూ

కళా : పేరాచూట్

సైంటి : విమానం లోంచి దూకావా?

అంటూ బెల్ట్ విప్పారు.

ప్రజ : అవును! ముప్పై వేల అడుగుల ఎత్తులో విమానంలో ముంబాయికి వెళ్తున్నాను. అంతలో పైలట్ విమానం కూలిపోబోతోందని చెప్పాడు. అరుపులు, కేకలు, ఏడుపులు అంతా panic అయిపోయారు. ఎయిర్‌హోస్టెస్ నాకో పారాచూట్ తగిలించి కిందకి తోసేసింది. అన్‌కాన్షస్ అయిపోయాను. స్పృహ వచ్చేసరికి ఇక్కడున్నాను.

కళా : అరె! నేనూ ఆ విమానంలోంచే దూకాను.

సైంటి : నేనూ అదే విమానంలోంచి దూకాను.

ప్రజ : ఓహ్! బ్యాడ్‌లక్!

కళా : అవును. విమానం కూలిపోవడం బ్యాడ్ లక్కే!

ప్రజ : విమానం కూలిపోవడం కాదు! నాతో పాటు మీ ఇద్దరు కూడా బ్రతకడం బ్యాడ్ లక్!

కళా : ఏంటి?

సైంటి : ఏంటేంటి?

కళా : మేం బ్రతకడం బ్యాడ్ లక్కా?

సైంటి : మేం ఇద్దరం బ్రతకడం బ్యాడ్ లక్కా?

ప్రజ : అవును మరి! నేనొక్కదాన్నే బ్రతికుంటే అంత ఘోర ప్రమాదం నుండి బయటపడ్డ ఏకైక వ్యక్తిగా నా పేరు అన్ని పేపర్లలోనూ ఫ్రంట్ పేజీలో పడేది. అంతేకాదు టీవీల్లో ఇంటర్వ్యూలు ఒకటేంటి అన్ని ఛానల్స్‌లోనూ, వరల్డ్ వైడ్ పబ్లిసిటీ.. అసలు గిన్నిస్ బుక్‌లోకెక్కినా ఆశ్చర్యంలేదు. ఛ Really I missed a great chance and publicity!

కళా : అంత పేరు పిచ్చున్న నీ పేరేంటో?

ప్రజ (గర్వంగా) :ప్రతిభావంతుల జగదీశ్వరి!

సైంటి : వాట్?

ప్రజ : ప్రతిభావంతుల జగదీశ్వరి!

కళా : అంటే మీ ఇంట్లో వాళ్ళకి ప్రతిభ వంతులవారీగా వస్తుందా?

ప్రజ : జోకా?! తరతరాలుగా వస్తోంది!

సైంటి : ప్రతిభావంతుల జగదీశ్వరీ!

ఇంతకీ నువ్వు ముంబాయి ఎందుకు వెళ్తున్నట్టు?

ప్రజ : లండన్ వెళ్లే ఫ్లైట్ క్యాచ్ చేయడానికి..

కళా : లండన్ ఎందుకు?

ప్రజ : లండన్‌లో జరిగే మిస్ యూనివర్స్ పోటీల్లో పాల్గొనడానికి. ఆ ఛాన్స్ ఎలాగూ మిస్సయింది. పబ్లిసిటీ వచ్చే ఛాన్స్ మీరు బతకడం వల్ల మిస్ అయ్యింది. ఛ! అనవసరంగా బ్రతికారు!

కళా : అనవసరంగా కాదు! నీలాంటి అందాలసుందరిని చూసే అదృష్టం ఉండబట్టి బతికాం!

ప్రజ : ఐతే ఓకే!

కళా : అందాల పోటీల్లో పాల్గొనుంటే మాత్రం ఆ కిరీటం నీకే దక్కేది!

ప్రజ : ఐ నో ఇట్! మరి నువ్వు...

కళా : నేను గద్యాన్ని - నేను పద్యాన్ని
నేను చిత్రాన్ని - నేను నృత్యాన్ని
నేను అభినవ సంగీతాన్ని
నేను అభినయ కిరీటాన్ని
అన్ని కళల ఆకారం దాల్చిన కళాకారుణ్ణి

అంటూనే ఏదో కాలికి తగిలిపడ్డాడు.

సైంటి : (కళాకారుడ్ని లేపుతూ)-అందుకేనా ఇన్ని వికారాలు!

ప్రజ : ఇంతకీ విమానంలో నువ్వెక్కడికెళ్తున్నావ్?

కళా : అమెరికాలో జరిగే తానా ధానా సభలకి

ప్రజ : ఓహో... నీ పేరేంటి?

సైంటి : ఐసాక్ న్యూటన్

ప్రజ : అబద్ధం!

సైంటి : గ్రహం బెల్

కళా : ఇది పచ్చి అబద్ధం!

సైంటి : కొలంబస్, అల్బర్ట్ ఐన్‌స్టీన్, క్రిస్టఫర్ లూథర్..

కళా : వాళ్ళందరూ ప్రపంచ ప్రసిద్ధ సైంటిస్టులు, అద్భుతాలు కనిపెట్టిన మేధావులు. వాళ్ళకీ నీకూ ఎట్టి పరిస్థితుల్లోనూ సంబంధం లేదు.

సైంటి : వుంది! ఎ.కె.కాకీమాన్ తెల్సా!

కళా : తెలీదు... వాడెవడు?

సైంటి : ఎ.కె.కాకీమాన్ కూడా ప్రపంచ ప్రసిద్ధ సైంటిస్టు. మహా మేధావి!

ప్రజ : ఐసీ!

సైంటి :యస్! యూ కెన్ సీ, బికాజ్..ఆ మేధావి మీ కళ్ళ ముందే వున్నాడు.

ప్రజ, కళాకారుడు నవ్వారు.

సైంటి : హలో, ఏమైంది అలా నవ్వుతున్నారు. స్టాపిట్..!



అని గట్టిగా అరిచాడు.

ఇద్దరూ నవ్వడం ఆపారు.

కళా :సో..! నువ్వు సైంటిస్టువన్నమాట!

సైంటి : యస్

ప్రజ : ఫేస్ చూస్తే బస్టాండ్‌లో జేబులు కొట్టేవాడిలా వుంది.

సైంటిస్టు సీరియస్‌గా ప్రజ మీదకి వెళ్ళి -

సైంటి : సైంటిస్టులంతే..!

అని సీరియస్‌గా తిరిగి వెళ్ళాడు.

ప్రజ : అది సర్లే... ఇంతకీ ఏం కనిపెట్టావో చెప్పు...

సైంటి : (వెళ్ళేవాడు ఠక్కున ఆగి)ఏం కనిబెడదామన్నా - దాన్ని ఎవడో ఒకడు నా కన్నా ముందే కనిపెట్టేశాడు. సో.., ప్రస్తుతం నేను ఏం కనిబెడదామా అన్నది కనిపెట్టే ప్రయత్నంలో వున్నాను. ఇండియాలో వుంటే ఐడియాస్ సరిగ్గా రావట్లేదని అమెరికా వెళ్తున్నాను. యూ సీ మిస్..

ప్రజ : ప్రతిభావంతుల జగదీశ్వరి!

సైంటి : ప్రతిభావంతుల జగదీశ్వరీ.. నేను సడన్‌గా ఎప్పుడో అప్పుడు ప్రపంచ మేధావుల లిస్ట్‌లో చేరిపోతా...

అంటూ కూర్చున్నవాడు పడబోతే కళాకారుడు లేపి -

కళా : అంత స్టిల్ యిస్తే ఇంతే!

సైంటి : నేను సడన్‌గా ఎప్పుడో అప్పుడు ప్రపంచ మేధావుల లిస్ట్‌లో చేరిపోతా. అప్పుడు, నాతో నీకు ఇంటర్వ్యూ దొరకదు. సేఫ్‌సైడ్ ఆటోగ్రాఫ్ ఇప్పుడే తీసుకుంటే బెటరు..పెన్ వుందా ఆర్టిస్టూ...

కళా : అదే వుంటే, ప్రతిభావంతుల జగదీశ్వరి అందాన్ని వర్ణిస్తూ... ఆరొందల పేజీల కవిత్వాన్ని రాసేవాణ్ణి, అందమైన బొమ్మ గీసేవాణ్ణి.
(అమ్మాయి గర్వంగా ఫీలయ్యింది.) బైదిబై, మిస్..ప్రతిభావంతుల జగదీశ్వరీ! మిమ్మల్ని అందరూ పూర్తిపేరుతో పిలుస్తుంటారా?

ప్రజ : యస్!

కళా : నాకు ఇంకోలా పిలవాలనిపిస్తుంది.

ప్రజ : ఏంటది?

కళా : ఇప్పుడే అది కనిపెట్టా!

సైంటి : నో! ఐ అబ్జెక్ట్! కొత్తవి కనిపెట్టడం సైంటిస్టుల డ్యూటీ!

ప్రజ : అతనితో ఏంటి? నువ్వు చెప్పు!

కళా : నీ ఇంటిపేరులోని మొదటి అక్షరం ఏంటి?

ప్రజ : 'ప్ర'!

కళా : నీ ఒంటిపేరులోని మొదటి అక్షరం?

ప్రజ : 'జ'!




కళా : వెరసి 'ప్ర...జ'. నిన్ను 'ప్రజ' అని పిలిస్తే నీకేమన్నా అభ్యంతరమా?

ప్రజ : ఓహ్! ఫెంటాస్టిక్! 'ప్ర..జ' - చాలా బావుంది. థాంక్యూ!

సైంటి : ఉన్న పేరునే కుదించి చెప్పావ్. ఇందులో నువ్వు కనిపెట్టిందేంటో.

ప్రజ : ఓకే సైంటిస్ట్! ఈ అడవిలోంచి బయటపడే మార్గాన్ని కనిపెట్టే ఛాన్స్ నీ కిచ్చేశాం. కనిపెట్టేసేయ్.

సైంటి : ఓ యస్! కనిపెట్టేందుకే మా అమ్మ నన్ను కని పెట్టింది.

కళా : ఛా!

సైంటి : ఛ కాదు! జాగ్రత్తగా నా వెనక రండి. అడవిలో పులులూ, ఎలుగుబంట్లు, సింహాలు ఉంటాయి.

కళా : ఆహా! ఇదెప్పుడు కనిపెట్టార్రో!

ప్రజ : ...చందమామ చదివి..

సైంట (ప్రజ వైపు సీరియస్‌గా చూసి) "నా వెనక రండి"

నెమ్మదిగా ఒక వైపుకు వెళ్తున్నారు.

ఎండుటాకుల్లో ఏదో ఈడ్చుకు వస్తున్న చప్పుడు.

సైంటి : ఆగండి! ఆ సౌండు విన్నారా?

విన్నారు. చప్పుడు దగ్గరవుతోంది.

కళా : ఆ సౌండ్ ఇటువైపే వస్తున్నట్టుంది.

ప్రజ : ఏమై ఉంటుంది?

మేధ : పులేమో!

ప్రజ : అమ్మో! (అంటూ వెనక్కి నక్కింది)

కళా : ఏంటి ప్రజా! వెనకాల ఉంటే పులి నిన్నేం చేయదనుకుంటున్నావా?

ప్రజ : అవును, ఆకలిగా ఉన్న పులి ముందు ఆ సైంటిస్టు మేధావిని తింటుంది. తరవాత, నిన్ను చంపి పిల్లలకి పెడుతుంది.

కళా : గోరు ముద్దల టైప్‌లోనా..?

ప్రజ : అవును. ఆకలి తీరిపోయాక అప్పుడు నన్నేం చేయదుగా... (ఆగి) ఆ ఆకుల చప్పుడు దగ్గరవుతోంది.

కళా : అమ్మో దగ్గరకొస్తోంది!

ముగ్గురూ: అమ్మో పులి!

నర : పులి కాదు - సింహం- నరసింహం!

ముగ్గురూ : మనిషి!

నర : నో! మనిషిని కాను -'కాస్ట్‌లీ' మనిషిని. బైదిబై.. ఇక్కడెక్కడన్నా ఫైవ్‌స్టార్ హోటల్ ఉందా?

సైంటి : ఫైవ్‌స్టార్ హోటల్ కాదు కదా...ఫైవ్‌స్టార్ చాక్లెట్ కూడా దొరకదు.

నర : షటప్! హాయిగా నవ్వుతున్నారు. మీరు పేదవాళ్లా?

కళా : ఏం డబ్బున్నవాళ్ళకి నవ్వు రాదా?

సైంటి : ..కొనుక్కుంటే వస్తుంది.

నర : అధిక ప్రసంగం.

కళా : అది సరే, అడవినుంచి వస్తున్నారు కదా! అటేమైనా ఊరుందా?

నర : తెలీదు

మేధ : మరి అడవిలోకి ఎలా వచ్చారు?

కళా : ఆకాశంలోంచి ఊడిపడ్డారా?

నర : ఎగ్జాక్ట్‌లీ! నేనూ, నా వైఫూ, హనీమూన్‌కి ఏరోప్లేనులో వెళ్తున్నాం -ఎగ్జిక్యూటివ్ క్లాసులో. అంతలో విమానం కూలిపోబోయింది. నాకు పేరాచూట్ ఇచ్చారు. పెళ్ళాన్నీ, సూట్‌కేస్‌నీ పట్టుకుని దూకబోయాను. కానీ పేరాచూట్ అంత బరువును మోయలేదు కాబట్టి - నాతో పాటు ఏదో ఒకదాన్నే తీసుకెళ్ళాలన్నారు. సూట్‌కేస్‌నిండా క్యాష్ వుంది.
సూట్‌కేసా - పెళ్ళామా

సూట్‌కేసా - పెళ్ళామా అని
కొన్ని క్షణాలు ఆలోచించాను.
పెళ్ళాం పోతే ఇంకో పెళ్ళాన్ని తెచ్చుకోవచ్చు. కానీ డబ్బుపోతే - మళ్ళీ సంపాదించడం కష్టం. అందుకే పెళ్ళాన్ని వదిలేసి సూట్‌కేస్‌తో దూకేసాను.

ప్రజ : అదేంటి...? నీ వైఫ్‌కి ఇంకో పేరాచూట్ ఇచ్చి వుంటారు కదా!?

నర : ఇచ్చారో, చచ్చారో నాకు తెలీదు. ఐ యామ్ సేఫ్..దట్స్ ఇనఫ్!

ప్రజ : అంటే నువ్వు కూడా విమానంలోంచే పడ్డావన్నమాట!

నర : అంటే - మీరు కూడానా!

ముగ్గురూ: యస్..!

ప్రజ : ఐ యామ్ ప్రజ!

షేక్‌హాండ్ ఇచ్చింది.
నరసింహం ఇవ్వలేదు.

సైంటి : ఐ యామ్‌సైంటిస్ట్

కళా : నేను కళాకారుణ్ణి

నర : వాటే వండర్! ధనవంతుణ్ణి కాబట్టి నేను బ్రతికాను - మీరెలా బ్రతికారు?

సైంటి : సైంటిస్టుని కాబట్టి నేను బ్రతికాను.

ప్రజ : అందాలకే అందాన్ని కాబట్టి నేను బ్రతికాను.

కళా : కళాకారుణ్ణి కాబట్టి నేచురల్‌గా నేనూ బ్రతకాను.

ప్రజ : ఎవరు ఎలా బ్రతికినా ముందు ఇక్కడ నుంచి క్షేమంగా వెళ్లేనే...లేకపోతే ఇంత బ్రతుకూ వృథా

కళా : బ్రతుకు వృథా... చావు వృథా
నింగి వృథా... నేల వృథా
పగలు వృథా... రాత్రి వృథా
నేను వృథా

సైంటి : ఇది కరెక్ట్! ఇక్కడితో ఆపు.

ప్రజ : ఇప్పుడీ కారడవిలో కవితలు చెప్పడం అంత అవసరమా?

కళా : 'కారడవిలో కవిత' - ఆహా!
ఎంత బావుంది! ఇదే నా టైటిల్
కొత్త పాయింట్... దీంతో సిటీకి వెళ్ళగానే ఓ కళాత్మకమైన సినిమా తీస్తా. దానికి కథ, మాటలు, పాటలు, బొమ్మలు, డ్యాన్సు, కెమెరా, స్క్రీన్‌ప్లే, సంగీతం, దర్శకత్వం - అన్నీ నేనే - నేనొక్కడినే...

సైంటి : చూసేది కూడా నువ్వొక్కడివే!

నర : నేనొకడ్ని ఇక్కడ వున్నాను కదా, మీలో మీరే ఏంటి మాటలు?

సైంటి : మీకు తోడు డబ్బుందిగా!

నర : డబ్బు తోడు లేకుండా ఎవ్వరూ బ్రతకలేరు.

సైంటి : ఈ అడవిలో జంతువులు బ్రతకట్లే?

నర : నాన్సెన్స్! అందుకే అవి జంతువులు. అదే డబ్బుంటే - హాయిగా మనుషుల్లా వుండేవి.

సైంటి : అహా! నేనొక గొప్ప విషయం కనిపెట్టా!

ప్రజ : అ... ఏంటో

సైంటి : ఈ డబ్బుంటే...

అని నరసింహ సూట్‌కేస్ పట్టుకోబోయాడు.

నర : డోంట్ టచ్... ఇప్పుడు చెప్పు.

సైంటిస్టు సూట్‌కేస్ వంక, నరసింహం వంక చూసి

సైంటి : డబ్బుంటే...(అని సూట్‌కేస్ వైపు చూసి అని నరసింహం వంక చూసి) జంతువులు కూడా మనుషులుగా మారిపోతాయన్నమాట

అని ప్రజ దగ్గరికి వస్తాడు.

కళా : (వ్యంగ్యంగా)ఓహ్ వాటే డిస్కవరీ!

సైంటి : (పొగడ్తగా ఫీలయి) మరి సైంటిస్టు అంటే అర్థమయ్యిందా? అలా కనిపెట్టేస్తుంటాడన్నమాట!

ప్రజ : ఓకే.. ముందు ఇక్కడ్నుంచి వెళ్ళే మార్గం కనిపెట్టు.

సైంటి : కనిపెడతా... డెఫినిట్‌గా కనిపెడతా...

అంటూ ఆలోచిస్తున్నాడు. ఆలోచిస్తూ "యస్"
ప్రజ, నరసింహం సైంటిస్టు దగ్గర వచ్చి

ఇద్దరూ : చెప్పు...

అని అడిగారు.
సైంటిస్టు ఐడియా రాలేదని తల విదిలించాడు.

కళా : నేను కనిపెట్టా...

సైంటిస్టు, కళాకారుడు దగ్గరికి వచ్చి

సైంటి : అదే నాకు మండేది. కొత్తవి...

అని అంటుండగా

ప్రజ : నువ్వాగు... అతన్ని చెప్పనీ

సైంటి : అది కాదు.. నేను..

అని అంటుండగా నరసింహం వచ్చి సైంటిస్టును లాగేసి

నర : (కళాకారుడితో) నువ్వు చెప్పు

కళా : మనం తలో దిక్కుకి వెళదాం...ఎవరో ఒకళ్ళకి ఏదో వూరు కనిపిస్తుంది. మళ్ళీ వెనక్కి వచ్చి అందరం కలిసి ఆ వూరు వెళ్ళిపోదాం.

ప్రజ : ఓకే

నర : బాగుంది.

-(ఇంకావుంది)

## పాఠకులకు వినమ్రంగా...

"రంగస్థలం నుంచి వచ్చిన సినీ రచయితలెందరో మళ్ళీ నాటకాలుగాని నాటికలు గాని రాయడం లేదు. కనీసం మీరైనా రాస్తే బావుంటుందేమో!?" అని కనిపించినప్పుడల్లా శ్రీ దివాకరబాబు గారిని అడుగుతూ వచ్చింది 'హాసం'.

'తప్పకుండా మంచి నాటిక రాస్తానం'టూ హామీ యిస్తున్న దివాకరబాబు ఓరోజు సడన్‌గా యస్వీ కృష్ణారెడ్డిగారి ప్రెస్‌మీట్‌లో కలిసినప్పుడు ఓ లైన్ చెప్పారు. "చాలాబావుంది, ఈ లైను మీద మాకు నమ్మకం ఉంది. దయచేసి రాసిన వెంటనే పంపించండి. ప్రచురిస్తాం" అంటూ స్క్రిప్ట్ చూడకుండానే ప్రకటించింది 'హాసం'.

"ఆల్రెడీ రాసేశాను....." అంటూ ఆ మర్నాడే స్క్రిప్టు పంపారాయన.

అదే ఈ 'నమోనమః' నాటిక.

ఈ సంచిక ప్రింటింగ్‌కి వెళ్ళబోతుండగా అమలాపురం నుంచి ఫోన్ చేశారు దివాకరబాబు.

"మన 'నమోనమః' నాటికని తొలిప్రదర్శనగా- ఇక్కడ అమలాపురం చెన్నమల్లేశ్వరా కళాపరిషత్ వారు గత 28 ఏళ్ళుగా నిర్వహిస్తున్న అఖిల భారత తెలుగు నాటికల పోటీల్లో- జూన్ 10 వతేదిన సాహిత్యపీఠం- హైదరాబాద్ వారు ప్రదర్శించటం జరిగింది. ద్వితీయ ఉత్తమ ప్రదర్శన, ఉత్తమరచన, ఉత్తమనటి (కుమారి దీప్తి వాజ్‌పేయ్) అవార్డులను గెలుచుకుంది" అని.

చక్కటి వ్యంగ్య వైభవంతో కూడిన ఈ నాటిక పై 'హాసం' కు గల నమ్మకం ఇంత తొందరగా బుజువైనందుకు సంతోషిస్తూ రచయిత దివాకరబాబుగారిని, ప్రదర్శించిన కళాకారులందరినీ పేరుపేరునా అభినందిస్తూ పాఠకులకు వినమ్రంగా అందిస్తోంది

-'హాసం'

అలనాటి ఆణిముత్యాల గురించి
నేటి తరానికి అనువైన శైలిలో తెలిపే

క్లాసిక్స్ రీటోల్డ్

# నవ్వుటద్దాలు

## వినోద కాలక్షేపం

- ఆచార్య తిరుమల




మేధావులకి కాలం చాలదు. సామాన్యులకి కాలం గడవదు; అటు-ఇటూ కాని వాళ్లకి కాలం వృధా అయిపోతూ వుంటుంది. కాలాన్ని సద్వినియోగం చేసుకునే వాళ్లు చాలా తక్కువమంది వుంటారు.

కావ్య శాస్త్ర వినోదేన కాలో గచ్ఛతి ధీమతాం
వ్యసనేన చ మూర్ఖాణాం నిద్రయా కలహేన వా!!

అనే శ్లోకం - బుద్ధిమంతులకి కావ్య శాస్త్ర చర్చలతోను, మూర్ఖులకి పేకాట, తాగుడు, వ్యభిచారం వంటి వ్యసనాలతో గాని, నిద్రచే గాని, పోట్లాటచే గానీ కాలం గడుస్తుందని తెలియజేస్తూ వుంది.

ఇప్పుడైతే, అందరి చేతులకి వాచీలుంటున్నాయి గాని ఎవ్వరికీ కాలం విలువ తెలియదు. చాలా మందికి వాచీ ఒక అలంకారం మాత్రమే. పూర్వం, మేధావుల్లా సామాన్య ప్రజానీకం కూడా కాలాన్ని వృధా చేసేవారు కారు. కర్తవ్య నిష్ఠ వుండేది. తోచక వెధవ పనులు చెయ్యటమనేది తక్కువ. ఖాళీ సమయాల్లో ఊరి రచ్చబండ దగ్గర జేరి పొడుపు కథల రూపంలో ఒకరి తెలివినొకరు పరీక్షించుకునేవారు. గెలుపు వోటములు రెండూ వినోదాత్మకంగానే కాదు ఆనందదాయకంగా వుండేవి. ఈ విధానం సర్వే సర్వత్రా వ్యాపించి వుంది.

పొడుపు కథల్ని సంస్కృతంలో ప్రహేళికలని, ఇంగ్లీషులో Riddles అనీ, హిందీలో పహేళీ లేదా చుట్‌కులే (చుట్ = దాచటం; కులే = విప్పటం) అనీ, ఉర్దూలో లతీఫా అనీ అంటారు. ఇవి గేయ రూపంలో గాని, పద్య రూపంలో గాని వచనంగా గానీ వుండవచ్చు.

ఈ పొడుపు కథల విధానం నుండే మేధావుల చిత్ర, బంధ, గర్భ కవిత్వాదులు, సమస్యా పూరణలు పుట్టాయంటే అతిశయోక్తి కాదు. పొడుపు కథ అంటే జ్ఞానం ఉదయించే కథ అని మా మిత్రులు జి.శంకరరావు గారు నిర్వచించారు. వారి నిర్ణయం శిరోధార్యంగా ఉంది. చమత్కార గర్భిత పద్యరూప పొడుపు కథల్ని కొన్నిటిని పరిచయం చేస్తాను.

మనుజుని యాకార మహిమకు మొదలేది?
నగవైరి వైరికి నగరమేది?
రాముడు గాచిన రాక్షస పక్షేది?
శిబి కర్ణు లర్థించు చెలువ మేది?
పంచ బాణుని వింట బరగిన రుచియేది?
గిరిజాపతి భుజించు గిన్నె ఏది?
నయనాంగ రక్షకు నయమొప్పు చెలువేది?
చెలగి మానము గాచు చెట్టదేది?
అన్నిటికి జూడ రెండేసి యక్షరములు
ఆదు లుడుపంగ తుదలెల్ల నాదులగును
నమ్మతిగ జెప్ప భావజ్ఞ చక్రవర్తి
చెప్పలేకున్న నగుదు నే చిన్ని నగవు!!

ఈ పద్యంలో తమాషా ఏమిటంటే - పైన వేసిన ప్రశ్నలన్నిటికి రెండేసి

అక్షరాల సమాధానాలుండి, ప్రతి సమాధానానికి గల రెండో అక్షరం తర్వాత వచ్చే సమాధానానికి మొదటి అక్షరం అవుతుంది. పై ప్రశ్నలకి సమాధానాలిలా వుంటాయి. చూడండి.

తల, లంక, కాకి, కీర్తి, తీపు, పురె, రెప్ప, పత్తి, .

'తల' చివరి అక్షరం 'ల' తర్వాతి సమాధానానికి మొదటి అక్షరం కావాలి కాబట్టి నగవైరి వైరి నగరం 'లంక' అయ్యింది. ఇలాగే మిగిలిన సమాధానాలు కూడా వుంటాయి. గుర్తించండి.

(నగవైరి వైరి = రావణుడు, రాక్షస పక్షి = కాకాసురుడు, పంచబాణుడు = మన్మథుడు, గిరిజాపతి = శివుడు, నయనాంగం = కన్ను)

ఇలాంటివే మరో రెండు పద్యాలు మనవి చేస్తాను. చూడండి:

**అసమాన కోదండు డైన రాజెవ్వండు?**
**రాజు పేరిట గల్గు రత్నమేది?**
**రత్నంబు పేరిట రంజిల్లు ఋతువేది?**
**ఋతువు పేరిట గల్గు రుద్రుడెవరు?**
**రుద్రిని పేరిట రూఢిల్లు జగమేది?**
**జగము పేరిట గల జంతువేది?**
**జంతువు పేరిట జన్మించు పక్షేది?**
**పక్షి పేరిట గల వృక్షమేది?**
**అన్నిటికి జూడ మూడేసి యక్షరములు**
**ఆదులుడుపంగ తుదలెల్ల నాదులగును**
**సమ్మతిగ జెప్ప భావజ్ఞ చక్రవర్తి**
**చెప్పలేకున్న నగదు నే చిన్ని నవ్వు!!**

ఈ పద్యంలోని ప్రశ్నలన్నిటికి మూడేసి అక్షరాల సమాధానాలుంటాయి. ఒక సమాధానంలో చివరి అక్షరం రెండో సమాధానానికి మొదటి అక్షరమవుతుందనే నిబంధన మామూలే. ఇప్పుడీ పద్యంలోని ప్రశ్నలకి సమాధానాలిలా వుంటాయి: - శ్రీరామ -మౌక్తిక - కర్కశ - శంభువు - వసుధ - ధేనువు - వాయసం - సంపంగె. ఇక్కడ ఒక్క విషయం గ్రహించాలి. "తుదలెల్ల నాదు"లు కావాలంటే చివరి హల్లుకి సంబంధించిన గుణింతాక్షరమేదైనా గ్రహించవచ్చునని తెలుసుకోవాలి. అలాగే, యీ పద్యంలో రత్నం పేరిట గల ఋతువు గ్రీష్మం. గ్రీష్మాన్ని కర్కశ ఋతువంటారు కాబట్టి ఆ ప్రశ్నకి సమాధానం దారి విడిచి వెదుక్కోవలసి వస్తుంది.

ఇటువంటిదే మరో పద్యం చూడండి:-

**నక్షత్ర వీధికి నాథుండు ఎవ్వడు?**
**రంగైన గుడిలోన లింగమేది?**
**వాహనంబులమీద వన్నెకు పేరేది?**
**దేవతా ఋషులకు తిండి ఏది?**
**నరకాసురుని గన్న నాతి నామంబేది?**
**పొలతి చక్కదనంబు పొల్పునేది?**
**తల్లికి కడబుట్టు తనయుని పైనేమి?**
**బింబంబు గప్పెడు పేరదేది?**
**అన్నిటికి జూడ రెండేసి యక్షరములు**
**ఆదు లుడుపంగ తుదలెల్ల నాదులగును-!!**

ఈ ప్రశ్నలకి క్రమంగా సమాధానాలిలా వుంటాయి.

శశి - శిల - లక్క - కంద - ధర - రంభ - భ్రమ - మబ్బు.

ఈ క్రింద పరిచయం చేయబోయే పద్యాల్లోని ప్రశ్నలకు పై పద్యాల్లో లాగ ముక్తాక్షర గ్రస్త విధానం ఉండదు కానీ సమాధానాలు మూడక్షరాలవైనా, ఐదక్షరాలవైనా, అవి ఎటునుండి చదివినా ఒకేలా ఉంటాయి. సమాధానాల్లో పాదభ్రమక విన్యాసాలు, కట్టుబాటులు కనిపిస్తాయి. చూడండి:-

**శ్రీరామునకు సీత చెలగి యెచ్చటనుండు?**
**ఆ రాముడేటికి నడవి కేగె?**
**ఏగిన మారీచు డేది దాల్చుచు వచ్చె?**
**నెనగి దైత్యుని రాముడెచట జంపె?**
**సుగ్రీవు డా రాము జూచి ఏమని పల్కె?**
**వాలి రాముని చేత నేల చచ్చె?**
**లంక నేరీతిని పొంక మడంచెను?**
**ప్రజల నేటికతడు ప్రబలజేసె?**
**అన్నిటికి జూడ మూడేసి యక్షరములు**
**ఈవ లావల జూడంగ నేక విధము**
**సమ్మతిగ జెప్ప భావజ్ఞ చక్రవర్తి**
**చెప్పలేకున్న నగదు నే చిన్ని నగవు!!**

ఈ ప్రశ్నలకి సమాధానాలు క్రమంగా ఇలా ఉంటాయి -

1. డాకడా (ఎడమ భాగమున), 2. కైకకై, 3. మెకమె (మృగరూపం), 4. నేలనే, 5.సంతసం, 6. కనక (రాముని చూడక), 7. కలంక, 8.కేళికే. ఇది రామాయణానికి సంబంధించిన పొడుపు కథా విధానమని గ్రహించారు కదూ! మరో పద్యం చూడండి:

**ఏమి చేయక వృథా ఏమిటి నీరేగును?**
**భూపాలు డేటికి బుట్టువాండు?**
**తుంగ ముస్తెలె ప్రీతి తొలకాడు వేనికి?**
**సభవారి నవ్వించు జాణ ఎవడు?**
**కలహంస విహరించు కాసార మెయ్యది?**
**వీరు డెద్దానిచే విజయమందు?**
**లజ్జ యెవ్వరి కమూల్యాపుటలంకారము?**
**దేవాంగులకు దేన జీవనంబు?**
**అన్నిటికి జూడనైదేసి యక్షరములు**
**ఒనర నిరుదెస చదివిన నొక్కరీతి**
**చెప్పగలిగిన నేనిత్తు చిన్ని మాడ**
**చెప్పలేకున్న నగదు నే చిన్ని నగవు!!**

ఈ పద్యంలోని ప్రశ్నలకి సమాధానాలు వరుసగా -

1. కట్టకట్టక, 2.కేళికాళికే, 3.కోటికోటికి, 4.వికటకవి, 5.సురసరసు, 6.చేతనతచే, 7.కులస్త్రీలకు, 8.నేతచేతనే.

మరో చమత్కార పద్యం చూడండి. ఇందులో రెండేసి ప్రశ్నలకి ఒక్కటే సమాధానం ఉంటుంది.

**రజక కవాటముల్ రహిదప్పి యుండుట**
**కేమి హేతువొ దాని నెరుగవలయు**
**ఇల్లును శేముషి హీనమై యుండుట**



కేమి హేతువో దాని నెరుగవలయు
పాలిచ్చు మొదవును పక్షియు హీనమై
యేమిట నుండునో ఎరుగవలయు
సస్యంబు కుమ్మరి సంతోష వర్జమై
యేమిట నుండునో ఎరుగవలయు
దీని యర్థంబు జెప్పిన దేశికులకు
నెలలు పంౘ్రెండు గడువిత్తు నేర్పుతోడ!

ఈ ప్రశ్నలకి సమాధానాలు చెప్పటానికి పన్నెండు నెలలు గడువు పెట్టాడంటే ఎంత ఆలోచన కావాలో అర్థం చేసుకోండి. ఇప్పుడా సమాధానాలెలా వుంటాయో చూడండి:

1. రజక (చాకలి), కవాటముల్ (తలుపులు) రహితప్పివుండటానికి కారణం -ఉతకలేక (ఉతక అంటే తలుపులకు పెట్టే అడ్డ గడియ)

2. ఇల్లు -శేషువు (పాము) హీనమై వుండటానికి కారణం -కప్పలేక

3. పాలిచ్చే ఆవు -కొంగ - చేపలేక -హీనమైవుంటాయి.

4. సస్యం-కుమ్మరి-వానలేక -సంతోషం ఉండదు.

మరో మహాద్భుతమైన పద్యంతో ఈ వ్యాసం ముగిస్తాను. ఈ పద్యంలోని ప్రతి పాదానికి గల మూడు అక్షరాల సమాధాన పదం -మూడేసి పదాల ఏక పదంగా వుంటుంది. అంటే మొదటి రెండక్షరాలతో ఒక పదం. చివరి రెండక్షరాలతో ఒక పదం. మొదటి చివరి అక్షరాలతో ఒక పదం ఉంటాయి. ఇంక, ఆ సవాల్ ఎలా వుంటుందో చూడండి :-

ఆద్యంత మధ్య మాంతాది మధ్యంబులో
తేటి రక్కసి రాజు తెలియతల్లి
ఆద్యంత మధ్య మంతాది మధ్యంబులో
శివు నిల్లు వరిచేను క్షీర ధార
ఆద్యంత మధ్య మంతాది మధ్యంబులో
భార్యయు ఖడ్గంబు బరగచెట్టు
ఆద్యంత మధ్య మంతాది మధ్యంబులో
మూరు వన్నెయు నీటె మంటజోడు
అన్నిటికి జూడ మూడేసి యక్షరములు
మొదలు తుదలను, నడి తుద, మొదలు నడుమ
ప్రాణ రక్షణ తలలందు పాదపముల
పరికరములందు నీ యర్థ మరయ వలయు!!

సమాధానాలిలా వుంటాయి. గుర్తించండి:-

మొదటి పదంలో 1,3 అక్షరాలు కలిపితే తుమ్మెద అని, 2,3 అక్షరాలతో రాక్షసరాజు 1,2 కలిపితే తల్లి అని రావాలి.

ఆ సమాధానం : అంబలి. ఈ పదంలో 1,3 అక్షరాలు కలిపి తే 'అళి' (తుమ్మెద), 2+3 = బలి, 1+2= అంబ (తల్లి).

రెండో పదంలో శివుని ఇల్లు వరిచేను, క్షీరధార రావాలి.

ఆ పదం - గుమ్మడి. దీనిలో గుడి, మడి, గుమ్మ పదాలు ఉన్నాయి.

మూడో పదంలో భార్య, ఖడ్గం, చెట్టు రావాలి.

ఆ పదం ఆవాలు. దీనిలో ఆలు, వాలు, అవ - పదాలున్నాయి.

ఈ విధంగా సమాధానాలు వెదికి పట్టుకోటానికి చాలా పరిశ్రమ కావాలి. ఇదో రకమైన అభ్యాసం.

ఈ వ్యాసంలో ఉదహరించిన పద్యాలన్నిటికి అరటిపండు వొలిచి చేతిలో పెట్టినట్టు సమాధానాలు కూడా యివ్వటం జరిగింది. అందువల్ల 'ఓస్! ఇంతేనా!' అని తేలిగ్గా చూడకండి. సమాధానాలు చెప్పకుండా యీ పద్యాలిచ్చి మేధావుల మెదళ్లకు మేత వేయండి. అప్పుడు పొందే ఆనందమే వేరు. సరేనా! ■

---

### కర్ణాటక రాగాలను అధ్యయనం చేసిన తొలి ఉత్తరాది కళాకారుడు

# ఉస్తాదోంకా ఉస్తాద్ - ఉస్తాద్ కరీమ్‌ఖాన్

ఉస్తాద్ అబ్దుల్ కరీమ్‌ఖాన్‌ను పండిట్ భీమ్‌సేన్‌జోషి గురువుకు గురువుగా పరిచయం చేస్తే, జవాహర్‌లాల్ నెహ్రూ అనే వ్యక్తి రాజీవ్‌గాంధీకి తాతగారు అన్నట్టుగా ఉంటుందేమో! 1937లో కాలం చేసిన ఈ మహాగాయకుడి మరణవార్త విన్న రవీంద్రనాథ్ ఠాకుర్ సంతాపం ప్రకటిస్తూ "ఆయన పాడినదంతా సంగీతమే" అన్నారట. మరొక గొప్పగాయకుడు ఫయ్యాజ్‌ఖాన్ "హిందూస్తాన్ సే సుర్ మర్‌గయా" (భారతదేశపు స్వరమే మరణించింది) అన్నారట.



కరీమ్‌ఖాన్ (1872-1937) గొప్పగాయకుడే కాక జగత్ప్రసిద్ధమైన కిరానా ఘరానా (సంప్రదాయాని)కి వ్యవస్థాపకుడు కూడా. కురుక్షేత్ర సమీపంలో ఉన్న కిరానా ఆయన జన్మస్థలం. బరోడా సంస్థానంలో కొన్నాళ్లు గడిపిన ఈ విద్వాంసుడు మహారాష్ట్రలో స్థిరపడి ఎందరో శిష్యులను తయారుచేశాడు. ఆయన శిష్యవర్గంలో ప్రసిద్ధులైన సురేశ్‌బాబూ మానే, హీరాబాయి బడోదేకర్, వారివద్ద శిక్షణ పొందిన ప్రభా అత్రే తదితరులూ ఉన్నారు. రోషనారా బేగం కూడా ఒక శిష్యురాలు. ఖాన్‌సాహెబుగారి మరొక శిష్యుడైన సవాయీ గంధర్వ (రాంభాయీ కుందగోళ్‌కర్) వద్ద గంగూబాయి హంగల్, బసవరాజ్ రాజ్‌గారు, ఫిరోజ్ దస్తూర్, భీమ్‌సేన్ జోషి వంటి దిగ్గజాలు సంగీతం నేర్చుకున్నారు.

కరీమ్‌ఖాన్‌కు మేనల్లుడి వరసయిన అబ్దుల్‌వహీద్‌ఖాన్ లాహోర్‌లోనే ఉండి ఇదేబానీలో బేగం అఖ్తర్ తదితరులకు సంగీతం నేర్పాడు. ఆయనవల్ల గొప్పగా ప్రభావితుడైన మరొక మహాగాయకుడు ఇందోర్‌కు చెందిన అమీర్‌ఖాన్ 'బైజూ బావ్రా' సినిమాలో తాన్‌సేన్‌కు పాడాడు.

మరొక విశేషమేమిటంటే కరీమ్‌ఖాన్ కర్ణాటక రాగాలను అధ్యయనం చేసిన తొలి ఉత్తరాది కళాకారుడు. ఖరహరప్రియ (ఆయన పాడిన 'రామ నీ సమానమెవరు' రికార్డు ఉంది), సావేరి, హంసధ్వని, ఆభోగి వంటి కర్ణాటక రాగాలు పాడారు. సరిగమలతో స్వరకల్పన చేశారు. రెండుపద్ధతుల మధ్య ఆ రోజుల్లోనే సమన్వయానికి ప్రయత్నించారు. ఎంతో పేరు గడించిన తరువాత కూడా దక్షిణాదికి వెళ్లి ఒక కర్ణాటక విద్వాంసుడి వద్ద వినమ్రతతో సంగీతం నేర్చుకున్నారు. జీవితమంతా సంగీతతపస్విగా గడిపారు.

కరీమ్‌ఖాన్ గారి శృతిబద్ధత ఎంత గొప్పదంటే ఆయన పాటబట్టి తంబూరా శృతి చేసుకునేవారట! నడివయసు దాటాక ఇచ్చిన రికార్డులలో ఆయన గొంతు కాస్త బలహీనంగా వినిపించి, గానం ప్రధానంగా హెచ్చు స్థాయి స్వరాలమీదనే సాగుతుంది. కాని ఆ మార్దవం, కల్పనాశక్తి, మనసును పరవశపరుస్తాయి. మనదేశంలో తొలిగా విడుదలయిన గ్రామఫోన్ రికార్డుల ద్వారా ఆయన సంగీతాన్ని ఎన్నోతరాల సంగీతాభిమానులు దేశమంతటా విని ఆనందించారు.

కరీమ్‌ఖాన్ అభిమానులను అలరించే వార్త ఒకటి ఈ మధ్యనే పత్రికలలో వచ్చింది. ఆయన తొట్టతొలిగా 1906 లో పాడిన దుర్లభమైన రికార్డులు దొరికాయని, అప్పటి సాంకేతిక పద్ధతుల్లో వాటి మీద ఒకపక్కనే రికార్డయి ఉందని దాని సారాంశం!

- డా. కొడవటిగంటి రోహిణీప్రసాద్

## జరిగిన కథ

అజయ్ అనే శ్రీమంతుడు, విజయ్ అనే పేదవాడు ఒక ఏడాదిపాటు తమ తమ స్థానాలను మార్చుకోవాలని నిశ్చయించుకుంటారు. అజయ్ స్థానంలో వచ్చిన విజయ్ మేనేజర్ భానోజీకి ముకుతాడు వేసి, అతను కాజేసిన నగలకోసం అతని కూతురు సరళతో ప్రేమ నటిస్తాడు. కానీ ఆమె తనంటే నిజంగా ఇష్టపడుతోందని తెలిసి ప్రేమిస్తాడు. విజయ్ స్థానంలో వచ్చిన అజయ్ చెల్లెలు మీనా కాపురం సరిదిద్దే ప్రయత్నంలో బ్యాంక్‌కు వెళ్లి తన సంతకాన్నే 'ఫోర్జరీ' చేసి డబ్బు తెస్తాడు. తోటి మెకానిక్ ప్రకాష్ చెల్లెలు పద్మను ప్రేమిస్తాడు. పద్మ అజయ్‌బాబు ఆఫీసులో పనిచేస్తూంటుంది. మీనా తండ్రి రామదాసు డబ్బు తీసుకుని వియ్యంకుడు పరంధామయ్య వద్దకు వెళతాడు. ఈ లోగా ఫోర్జరీ విషయం బయటపడుతుంది. పద్మకు దానిలో భాగం ఉందని భానోజీ ఆరోపించడంతో ఆమె తాళంచెవులు విసిరేసి వెళ్లిపోతుంది. భానోజీ వాటిని చేజిక్కించుకుని ఇనపపెట్టెలో ఉన్న కవరు తెరిచిచూసి అజయ్, విజయ్ ల ఒప్పందం గురించి తెలుసుకుంటాడు. అజయ్ జైలుపాలవుతాడు. విజయ్ పిక్నిక్‌నుండి తిరిగివచ్చాడు. -(ఇక చదవండి)

# అన్నపూర్ణావారి ఇద్దరు మిత్రులు



## సీరియల్ - నవల 12

**రచన : ముళ్లపూడి వెంకటరమణ**

**జ**రిగినదాని కాయన ఆనందంతో ఉక్కిరి బిక్కిరైపోతున్నాడని ఆయన చిరునవ్వే ప్రకటించింది. బాధపోయి, ఆయనమీద అసహ్యం వేసింది విజయ్‌కి. చిరాగ్గా తాళాలు అందుకొని బల్లమీద పడేసి తలపట్టుకు కూర్చున్నాడు.



తాళాలు తాను ఇస్తే అతను పుచ్చేసుకోవడంతో భానోజీగారి ముఖం ఛిన్నబోయింది.

"ఆఫీసులో అర్జెంటు కాగితాలున్నాయి. సంతకాలకు పంపించమంటారా?" అన్నాడు వినయవిధేయత లుట్టిపడేలా.

"భానోజీగారూ నా మనసేం బాగులేదు, తరవాత చూస్తా. మీరు వెళ్ళిరండి" అన్నాడు విజయ్ చిరాగ్గా.

పరివారం అంతా అవతలికి తప్పుకుంది. భానోజీగారు పళ్ళు పటపట కొరుక్కున్నాడు.

గది సర్దుతున్న వెంకన్న బల్లమీద తాళాలు చూడగానే ఏదో గుర్తుకొచ్చినట్టు అయ్యగారి దగ్గరకు వెళ్ళి సంజ్ఞలు చేయసాగాడు.



"దొరా తవరంట ఊరికి పోయినప్పుడు భానోజీదొర, సేషావతారం అల్మారా తెరిసి గంట్లో యావో కాయితాలు ఎత్తకపోయిర్రంట" అంది లచ్చి.

విజయ్‌కి వెంటనే, తనూ అజయ్ రాసుకున్న ఒప్పందం గుర్తుకొచ్చింది. దిగ్గునలేచి తాళాలు తీసుకొని అల్మారా దగ్గరకు పరుగెత్తాడు.

అనుకున్నంతా అయింది.



ఈ విచిత్ర పరిస్థితి స్వరూప స్వభావాలూ, దీని తక్షణ ఫలితాలూ, పర్యవసానాలు పరిపరి విధాల చీకాకు పరుస్తున్నాయి. అజయ్ ఏమనుకుంటాడన్నది పెద్ద ప్రశ్న అయిపోయింది. అతను నమ్ముతాడో నమ్మడో... తనకు దురుద్దేశాలనంటగట్టవచ్చు..సరళ వైఖరి ఎలా వుంటుందో...నిజం బయటపెట్టేస్తే, అజయ్ తన సొమ్మే తను తీసుకున్నాడని విశదపరిస్తే, శిక్ష ఎలా విధిస్తారో...అన్నిటినీ మించి తండ్రి, మీనా తన గురించి ఏమనుకుంటున్నారో అన్న ప్రశ్న మరీ బాధించింది. నేరం చేసింది తను కాకపోయినా, ప్రస్తుతానికి తనే అనుకుంటున్నారుగదా...

"బాబూ!"

విజయ్ వెనక్కి తిరిగి చూశాడు. చెల్లెలు మీనా!...అప్పుడేం చెప్పాలి?...



"అన్నయ్యా!" అనబోయి తమాయించుకుంది మీనా కూడా. ఆమె ఆశ్చర్యానికి అంతులేదు. మరీ ఇంత పోలికా! విజయ్ మొహం ఆమెకు చూపించలేదు. అటుతిరిగి నిలబడ్డాడు. గుండె రాయి చేసుకున్నాడు.

"ఎవరు నువ్వు" అన్నాడు అధికారస్వరంతో.

"మా అన్నయ్యను విడిపించలేరూ, ఈ విపత్తు నుండి మా అన్నయ్యను తప్పించలేరూ?" అంది మీనా, దీనంగా.

"ఎవరు మీ అన్నయ్య?" అన్నాడు విజయ్ కఠిన స్వరంతో.

"విజయ్‌కుమార్. అతను మీ తాలూకు చెక్కు..."



"అవును. పదివేల రూపాయల చెక్కు వెూనంచేసి మార్చాడు. అందుకు తగిన శిక్ష అనుభవిస్తాడు" అంటూ ముందు గదిలోకి పోబోయాడు విజయ్. ఇన్నాళ్లూ నటన కష్టం అనిపించలేదు కాని, ఈ క్షణంలో అసాధ్యంగా ఉంది.

"మీరు మా మీద దయ చూపించండి!" అంది మీనా, ఏడుస్తూ. "చేసిన తప్పు క్షమించండి. అన్నయ్య అపహరించిన సొమ్ము ఇదిగో, ఇచ్చేస్తున్నాను. నన్నొక చెల్లెలిగా భావించి, మా అన్నయ్య అపరాధాన్ని మన్నించండి - నా కున్నది ఒకే వొక అన్నయ్య"

అజయ్ గుండె చెరువయిపోయింది. చెరువుకు గండ్లు పడ్డాయి. 'నీకున్నది ఇద్దరన్నయ్యలు. ఇపుడు నీతో ఉన్నవాడే నాకన్నా గొప్ప అన్న. నా కన్నా నిజమైన అన్న'..అని ఘోషించ బోయింది కంఠం.



"అన్నయ్య మీదున్న అభిమానం కొద్దీ మీరలా కోరడం సహజమే కాని అతను నేరం చేశాడు.." అన్నాడు దాక్షిణ్యం కనిపించనివ్వని స్వరంతో.

మీనా బాధతో, ఆవేశంతో ఆ పరిస్థితులను విన్నవించుకుంది. "అన్నయ్య ఏ పరిస్థితుల్లో నేరం చేశాడో మీకు తెలియదు. చెల్లెలి శీలాన్ని శంకించి లోకులు కాకుల్లాగా పొడుస్తూవుంటే చూడలేక పోయాడు. అపవాదు భరించలేక, ఎక్కడ ఆత్మహత్య చేసుకుంటానో అని ఆరాటపడి పోయాడు. ఏదో ఒక విధంగా డబ్బు తెచ్చి అత్తింటికి పంపితేగాని మా యింటి పరువు దక్కదని ఈ పొరపాటు పని చేశాడు - ఔను అజయ్‌బాబూ.. ఈ పాపిష్టి చెల్లెలుకోసమే ఇంత ఘోరానికొడిగట్టాడు. నా సుఖం కోసం, నా కాపురం కోసం..."

విజయ్ ఈ ఘోషవింటూ నిలబడలేక పోయాడు. క్షోభ ఏ క్షణంలో నయినా తన హృదయాన్ని తన దేహాన్నంతటినీ శతసహస్ర శకలాలు పేలిపోయేలా వుంది..."



"మీకూ ఒక చెల్లెలుంటే మా పరిస్థితి అర్థమయేది..."

"మీనా!" అంటూ ఉద్వేగంగా వెనక్కు తిరగబోయాడు విజయ్. క్షణార్థంలో, దూరంగా గుమ్మం అవతల భానోజీ, గుమస్తా కనిపించారు. ఆవేశం నిగ్రహించుకున్నాడు. తల వంచుకుని వెనక్కు తిరిగాడు.

"క్షమించండి. ఇందులో నేను చెయ్యగలిగిందేమీ లేదు..." అన్నాడు. భానోజీ వింటున్నాడని తెలుసు...ఇంకా గట్టిగా మాట్లాడాలి. తను కిరాతకుడని భానోజీకి తెలియజెప్పాలి...

"నా పోలికలున్నంత మాత్రాన నన్ను దగా చెయ్యటం ఘోరమైన తప్పు. ఇవాళ ఇతన్ని శిక్షించకుండా వూరుకుంటే మా ప్రతిష్ఠకే భంగం. రేపు మరొకడు కూడా ఈ పనే చేస్తాడు" అన్నాడు కఠినంగా.



మీనా నిస్పృహతో కృంగిపోయింది "అంతేనా అజయ్‌బాబూ! మిమ్మల్ని చూడగానే మా అన్నయ్యేనని భ్రమ పడ్డాను. రూపంలో అంత పోలిక ఉన్నపుడు హృదయంలో మాత్రం ఆ పోలిక వుండదా అని ఆశపడ్డాను. ధనంతో గోడకట్టుకున్న మీ హృదయంలో రవ్వంత కూడా కరుణ లేదన్నమాట" అంది.

"మీరు అనవసరంగా ఉద్రేకపడి ఏవేవో అంటున్నారు. దయచేసి ఇక వెళ్ళండి" అన్నాడు విజయ్.



మీనాలో దుఃఖం, బాధ, క్రోధంగా, ఎదటివాడి మీద జుగుప్సగా మారాయి.

"మా అన్నయ్యని జెయిలునుండి విడిపించని సొమ్ము ఇంకా మాకెందుకు. పాపిష్టిడబ్బు, మీరే తీసుకోండి మీరే అనుభవించి, ఆనందించండి' అంటూ చేతిలో నోట్లకట్టలను బల్లమీద విసిరికొట్టి గిరుక్కున వెనుదిరిగి బయటకు వెళ్ళిపోయింది.

గుమ్మంలో నిలబడిన భానోజీ, బంటూ ఒత్తిగిలి ఆమెకు దారి యిచ్చారు.



"చూశావా శేషావతారం, చివరికి సొంత చెల్లెల్ని కూడా కాదనే స్థితికి వచ్చాడు" అన్నాడు భానోజీగారు తృప్తిగా నవ్వి. ఈ కొత్త అజయ్ తన అల్లుడు కావడానికి ఈ రూపేణా మరో అర్హతకనిపించింది.

"డబ్బుండీ డబ్బూ" అన్నాడు శేషావతారం.

"ఇక మన పథకానికి తిరుగులేదు" అన్నాడు భానోజీగారు సాలోచనగా.

*****

స్వతంత్రంగా ఆలోచించి నిర్ణయం చేయడం విజయ్‌కి సాధ్యపడలేదు, సాహసం చాలలేదు. తిన్నగా జెయిలుకు వెళ్ళాడు.

"అజయ్‌బాబూ, మనం వ్రాసుకున్న అగ్రిమెంట్ భానోజీ చేతుల్లో పడింది" అన్నాడు ఉపోద్ఘాతం ఏమీ లేకుండా, సూటిగా.

అజయ్ ఆశ్చర్యపోయాడు కొత్త పరిణామానికి.



"అవును అజయ్‌బాబూ. నేను లేనప్పుడు దొంగిలించాడు. ఈ రహస్యం తన గుప్పెట్లో పెట్టుకొని మీకేం అపకారం చేస్తాడోనని నాకు భయంగావుంది. ఈ విషయం అత్తయ్యకు తెలిస్తే ఎంత బాధ పడుతుందో, నన్నెంతగా అసహ్యించు కుంటుందో."

"ఇలాంటి పరిస్థితుల్లో ధైర్యాన్ని కోల్పోవడం పిరికితనం. అది నేను చేసేపని... నీ తెలివితేటలుపయోగించి భానోజీ నిజస్వరూపాన్ని బయటపెట్టు. వంచకుడిని వంచనతోనే ఎదుర్కోవాలి. బయల్దేరు" అన్నాడు అజయ్.

మిత్రుడి మనస్థైర్యం, ప్రశాంతమైన స్వరం, తనయందు చూపిన గురి అజయ్‌కి ఎనలేని ధైర్యాన్ని సమకూర్చిపెట్టాయి.



"అలాగే అజయ్, నా శాయశక్తులా ప్రయత్నిస్తాను" అన్నాడు.

"విష్‌యు ఆల్ సక్సెస్"

*****

అత్తయ్యకి ఏం చెప్పాలో ఎలా చెప్పి నమ్మించాలో ఆలోచించుకుంటూ విజయ్ బంగాళాకి చేరుకునేసరికే భానోజీగారు ఉత్సాహంగా ఎదురయ్యాడు- ఆందోళన అభినయిస్తూ.



"మీరేమైపోయారోనని పాపం అత్తయ్యగారు ఆందోళన పడుతున్నారు త్వరగా వెళ్ళండి" అన్నాడు.

విజయ్ రాగానే, అత్తయ్య ఆ గదిలోంచి లచ్చిని బయటికి పంపించింది.

అంతవరకూ నిండుకుండలా తొణక్కుండా ఉన్న ఆవిడ, తలుపులు మూసుకోగానే బావురుమంది ఒక్కసారిగా.

"ఇదేమిటిబాబూ, - అజయ్‌ని అరెస్టు చేసారట?"



"అవునత్తయ్యా-అనుకోకుండా జరిగిపోయింది" అన్నాడు విజయ్ అపరాధిలా తలవంచుకుని.

"అష్టయిశ్వర్యాలూ అనుభవించ వలసిన నా బిడ్డ ఇలా జైలు పాలయ్యాడా, అష్టకష్టాలు పడుతున్నాడా?" అందావిడ రుద్ధ కంఠంతో.

"ఆందోళనపడకం డత్తయ్యా!" అంటూ వుండగానే, అద్దాల తలుపుమీద నీడ కనపడింది. భానోజీగారిదని తొలిచూపులోనే పసిగట్టాడు విజయ్. అత్తయ్యని బాధించినా, భానోజీకి దొరక కూడదు. వంచకుడిని వంచించాలి. వజ్రం వజ్రేణ.. అన్నారు.



"కాదు విజయ్! నా బాబును వెంటనే విడుదల చేయించు. అంతవరకు నాకు మనశ్శాంతి వుండదు!" అంది అత్తయ్య.

"అత్తయ్యా, విడుదల చేయించడం వీలుపడదు!" అన్నాడు. విజయ్ కొంచెం గట్టిగా, చాలా కఠినంగా.

"అదేమిటి బాబూ, అలా అంటున్నావు?" అందావిడ అదరిపడి.

ఆవిడ కెలాగ తెలియజెయ్యడం - జరిగిన, జరుగుతున్న కథ? అవతల భానోజీ పొంచి వింటున్నాడు. చూస్తున్నాడేమో కూడా...

"నిజమే ఫోర్జరీచేసి పట్టుబడిన నేరస్థుడిని శిక్ష పడకుండా తప్పించడం సాధ్యంకాదు." అన్నాడు కర్కశంగా..

"నువ్వేనా విజయ్ ఆ మాటలంటున్నది!" అందావిడ నెమ్మదిగా.

"కేసు పోలీసుల చేతుల్లో వుంది. ఇప్పుడు నేను చెయ్యగలిందేమీ లేదు" అన్నాడు విజయ్ - ఇంకా పై స్థాయిలో. భానోజీకి బాగానే వినబడి వుండాలి... గోడమీద నీడ కదిలిపోయింది...

"ఛీ!కృతఘ్నుడా!" అంది అత్తయ్య క్రోధావేశంతో.

"స్నేహాన్ని మించిన బాంధవ్యం లేదని, నిన్ను చేరదీసినందుకిదా ప్రతిఫలం? నీడ యిచ్చిన వాళ్ళకే కీడు తలపెడతావా? నా బిడ్డకింత ద్రోహం చేస్తావా? హుఁ. అప్పుడే అనుకున్నాను. నువ్వు సరళతో కులుకుతూ తిరుగుతున్నప్పుడే అనుమానించాను. నీకేదో దుర్బుద్ధి పుట్టిందనీ, నువ్వు వాళ్ళతో



కలిసిపోతావనీ-"

"మీరనుకున్నది నిజమే. నేను సరళను ప్రేమించాను. పెళ్ళి చేసుకుంటాను"

"అంతవరకూ వచ్చావా!" అంది అత్తయ్య ఉద్విగ్నస్వరంతో.

"ఆ..."అంటూ చిరాకు కూడా ప్రదర్శించి గది బయటకు వెళ్ళిపోయాడు విజయ్.



హాలులోకి వచ్చేసరికి భానోజీగారు అప్పుడే వీధిలోంచి వస్తున్నట్లు కనబడాలని శాయశక్తులా నటిస్తున్నారు.

"భానోజీగారూ" అన్నాడు విజయ్ అధికార స్వరంతో.

"ఏమిటి అజయ్‌బాబూ!" అన్నాడాయన దోసిలి ఒగ్గి.

"వివాహానికి వెంటనే ముహూర్తం పెట్టించండి."

భానోజీగారుకూడా, ఈ అనుకోని "ముందడుగు"తో అదిరిపడ్డారు. కుర్రాడి ఎత్తులు చురుకుగా పడుతున్నాయి. ఆయనకి ఏమనాలో పాలుపోలేదు - విజయ్‌కి సరళనివ్వాలని నిశ్చయించుకున్నా!

"ఏ మలా సందేహిస్తున్నారు? సరళ మీతో చెప్పలేదూ?"

"చెప్పింది, చెప్పింది. కాని ఇంత వ్యవధి లేకుండా వివాహమంటే-"

"వ్యవధి లేకపోతే నిశ్చయ తాంబూలమైనా పుచ్చుకుందాం. నేననుకున్నది ఏమైనాసరే వెంటనే జరిగితీరాలి" అన్నాడు విజయ్.

పెళ్ళి ఖాయంచేసేముందు విజయ్‌తో కొంచెం తీరికగా మాట్లాడి తాను గడించిన "విజ్ఞానం" కొంచెం ప్రదర్శించాలని, ముందే అతన్ని అదుపులోకి తెచ్చుకోవాలని భానోజీగారు ఉబలాట పడ్డారుగాని, కుర్రగుర్రం మాంచి కారుమీద ఉంది. కళ్ళెం తగిలించడం సాధ్యంకాదు. లొంగడమే మంచిదని తీర్మానించుకున్నాడాయన.

"చూడండి పెద్ద పెద్ద వాళ్ళందరినీ ఆహ్వానిస్తున్నాను. ఏర్పాట్లన్నీ మన అంతస్థుకి తగినట్లుండాలి మావగారూ, జాగ్రత్త" అన్నాడు విజయ్ హెచ్చరికగా.



"చూస్తారుగా అజయ్‌బాబూ - అంతా దివ్యంగా జరిపించేస్తాను" అన్నాడు మావగారు. విజయం సాధించానన్న తృప్తితో, గర్వంతో, ఆనందంతో ఆయన ఒక్కసారి ఛాతీ విరిచి నిలబడి తనను తానే అభినందించుకున్నాడు. తరువాత తన మాజీ యజమాని చిత్రపటం దగ్గరకు వెళ్ళి అంజలి ఘటించాడు.

"అంతా మీ దయ. రేపు నా జీవితాశయం నెరవేరే శుభదినం" అని మనవిచేశాడు.



విజయ్ ధిక్కారంతో కృద్ధురాలైపోయిన అత్తయ్యకి లచ్చి వచ్చి పెళ్ళిమాట చెప్పగానే ఆవేశం పట్టశక్యం కాలేదు.

"ఇంత ఘోరకలా? నే బ్రతికివుండగానే, నా బిడ్డ అక్కడ జైల్లో మగ్గుతూవుంటే, వీడు పల్లకి ఎక్కి ఊరేగుతాడా? ఈ మోసం ఇంక జరగడానికి వీల్లేదు. వీడి సాహసానికి తగినశాస్తి నేనే చేస్తాను. పద పద" అంటూ లచ్చిని వెంటదీసుకుని ఆవిడ ముందుకు కదలింది.

-(ఇంకావుంది)



# అంతేరా బామ్మర్ది

ఆదివిష్ణు





## జరిగిన కథ

భాగ్యనగరంలోని ప్రముఖ పారిశ్రామికవేత్త బసవరాజు, జానకిల కూతురు ఉమ. కొడుకు మురళి. ఉమ, వేణుని ప్రేమిస్తోంది. వేణుకు నాగపూర్లో ఉద్యోగం వచ్చినా ఉమను విడిచి వెళ్లడం ఇష్టం లేక ఉద్యోగానికి వెళ్లనంటాడు. అతని బావ రంగనాథం తన బాల్యమిత్రుడు బసవరాజు కంపెనీలో ఉద్యోగం వేయిస్తానని హామీ ఇస్తాడు. తనే స్వయంగా వెళ్లి బసవరాజును కలిసి బావమరిది ఉద్యోగం కై అడుగుతానంటాడు. ఈ లోపుల బసవరాజు పేపర్లో వార్తలు చదివి ఖంగారుపడి బావమరిదికై ఉద్యోగాలకోసం వచ్చే ఫ్రెండ్స్‌ను కలవకూడదని నిశ్చయించుకుంటాడు. అందుకే అతన్ని కలవడానికి వచ్చిన రంగనాథాన్ని చూడ నిరాకరిస్తాడు. కానీ తరువాత బాధపడతాడు. ఆ సంగతి తెలియని రంగనాథం బసవరాజుపై మండిపడుతూంటాడు.

(ఇక చదవండి)

తక్షణం చేయవలసిన ఫోన్‌కి - ఇప్పుడొద్దు సార్ అని పాణి బ్రేకు ఎందుకు వేసేడో బసవరాజుకి అర్థం కాలేదు!

అంచేత -

కారణమేమిటని కళ్లతో పాణిని ప్రశ్నించేడు!

పాణి వివరిస్తున్నాడు -

"భూమ్మీద బతికే మనుషులంతా..."

"మనుషులు భూమ్మీదే బతుకుతారు మిస్టర్ పాణీ! ఇంకోచోట బతికే ఛాన్సు ఇప్పట్లో లేదు! నసపెట్టకుండా పాయింటు కొచ్చెయ్!!"

"శ్రీ రంగనాథం గారు బాగా సెన్సిటివ్ సార్!"

"తెలుసు!"

"ఈ పరిస్థితుల్లో శ్రీ రంగనాథం గారికి తమరు "ఇప్పుడే" ఫోన్ చేస్తే - ఆయన కోసం రెట్టింపయ్యే ప్రమాదముంది సార్! రెండు రోజులు ఓపిక పట్టండి సార్! అప్పటికి శ్రీ రంగనాథం గారి కోపం తగ్గే అవకాశముంటుంది సార్!"

"అంతవరకు నేను కిటికీతోనే కాలక్షేపం చేయాలి మిస్టర్ పాణీ!"

"ఈ పరిస్థితుల్లో మనకి కిటికీలే శ్రీరామరక్ష సార్!"

బసవరాజుకి కిటికీల పాయింటు బొత్తిగా నచ్చలేదు! అంత మాత్రాన - పాణి సలహాని తీసిపారేయాలని కూడా లేదు. అంచేత అతను జేబులోంచి రూపాయి బిళ్ల తీసి టాస్ వేసేడు!

బొమ్మ పడింది!

"మిస్టర్ పాణీ! బొమ్మే పడింది!"

"వండ్రఫుల్ సార్! మీకెప్పుడూ బొమ్మలే పడుతుంటాయి!"

"అంచేత ఈ రెండు రోజులూ కిటికీలతోనే కాలక్షేపం చేయాలి! ఆ తర్వాతే ఫోను!"

"చాలా గొప్ప కరెక్టు నిర్ణయం సార్!"

* * *

లవర్స్ పార్క్! లవ్‌లీ పార్కు!

లవర్స్ హోటల్ మాదిరి లవర్స్ పార్కు కూడా హైదరాబాదులోనే వుందని చెప్పినప్పుడు - అవునా అని ఆశ్చర్యపోకూడదు!

హైదరాబాద్‌లో అదెక్కడుందని అడ్రస్సు అస్సలడక్కూడదు!

ఏఏ పార్కులకు లవర్స్ పార్కులని ముద్దుపేరు పెట్టుకున్నారో - స్థానిక లవర్సుకి బాగా తెలుసు!

ఆ పార్కుల్లో ఒక పార్కులో వేణూ ఉమా కూచుని వున్నారు. వేణు ఉమతో అంటున్నాడు-

"మా బావ మీ నాన్నగారి ఆఫీసుకి వెళ్లడం వరకు కరెక్టే! అక్కడేం గొడవ జరిగిందో ఏమో - మా బావ శివాలు తొక్కుతూ ఇంటికి వచ్చి తన గదిలోకి వెళ్లి తలుపులు బిడాయించుకున్నాడు!"

"ఇంతకీ మీ బావగారు మా నాన్నని కలుసుకున్నారా లేదా?"

"ఏమడుగుతావులే! మా బావని తన ఆఫీసు గదిలోకి పంపించవద్దని మీ నాన్నగారు ఒక మనిషిని కాపలా పెట్టేరుట!"

ఉమ నొచ్చుకుంటో అన్నది-

"అప్పుడప్పుడు మా నాన్న తిక్క తిక్కగా ప్రవర్తిస్తుంటాడు!"

"మా బావ ఎల్లప్పుడూ తిక్కగానే ప్రవర్తిస్తుంటాడు! అంధుకే మన ప్రేమ విషయం మా బావకు చెప్పలేదు. మన విషయంలో ఆయన జోక్యం కల్పించుకుంటే - మనకి పెళ్లి కాదని నాకు బాగా తెలుసు!"




"మన పెళ్లి మాట అటుంచు! మా ఆఫీసులో నీ ఉద్యోగమ్మాటేమిటి?"

"స్వయంగా నేనే రంగంలోకి దిగబోతున్నాను!"

* * *

బసవరాజుగారి ఆఫీసు గది!

బసవరాజు కిటికీ దగ్గిరే నిలబడి వున్నాడు!

ఇవాళ రంగనాథంతో ఫోన్లో మాట్లాడవలసిన రోజు!

ఆ ముహూర్తం ఉదయం తొమ్మిదిన్నరకి పెట్టుకున్నాడు!

తొమ్మిదీ ఇరవై అయిదు వరకూ వర్జ్యం వున్నందువల్ల - మరో అయిదు నిమిషాలు ఆలస్యం చేసి మాటాడితే అన్నీ సవ్యంగా తగలడతాయనే ఆశతో బసవరాజు కిటికీ విడిచిపెట్టడం లేదు!

గోడ గడియారం టంగున గంట కొట్టింది!

ఆ గదిలోనే వుండి తన చూపుని గోడ గడియారానికి అంకితం చేసిన పాణి - బసవరాజుని హెచ్చరించేడు -

"సార్! నైన్ థర్టీ!"

ఆ హెచ్చరికతో - బసవరాజు కిటికీ వదిలేసి ఫోన్ తీసుకున్నాడు. డయల్ చేసేడు.

- రంగనాథమింట్లో ఫోన్ మోగింది.

ముస్తాబవుతున్న వేణు - ముస్తాబవుతూనే ఫోన్ తీసుకున్నాడు.

"హల్లో" అన్నాడు బసవరాజు.

"యస్ ప్లీజ్-" అన్నాడు వేణు.

"ఇది మా సింగినాదం ఇల్లేనా?"

"కాదండి! రంగనాథం గారిల్లు!"

"వున్నాడా?"

"ఎవరండీ?"

"సింగినాదం!"

"ఇది రంగనాథం గారిల్లండీ!"

"వాడ్ని నేను సింగినాదమనే పిలుస్తాను! వున్నాడా?"

"వున్నారండి!"

"ఒకసారి పిలు!"

"పిలిచినా రాలేరండి!"

బసవరాజు ఆత్రంగా అడిగేడు -



"ఏమైంది?"
"అలిగేరండి!" అన్నాడు వేణు.
"అలిగేడా?"
"సారీ! అనారోగ్యమండీ!"
"ఎప్పట్నుంచీ?"
"రెండు రోజుల్నుంచీ!"
"ఇంతకీ నువ్వెవరు?"
"రంగనాథం గారి బామ్మర్దినండి! మీరెవరండి?"
"బసవరాజుని..."
"నమస్కారం సార్! రెండు రోజుల క్రితం మా బావ నా పని మీదే మీ ఆఫీసుకొచ్చేరండి!"
"నీ పని మీదా?"
"మీ ఆఫీసులో నాకో ఉద్యోగం.."
ఆ మాట వినగానే బసవరాజు ఫోన్ పెట్టేసి తలపట్టుక్కూచున్నాడు! ఆ భంగిమతోనే పాణితో అంటున్నాడు -
"మనం ఊహించినట్టే జరిగింది మిస్టర్ పాణీ?"
"అనుకున్నాను సార్!"
"సింగినాదం - వాళ్ల బామ్మర్ది ఉద్యోగం కోసమే వచ్చేడు!"
"అర్థం పడింది నేను గనక నా చెంప ఛెళ్లుమనిపించేడు! ఆయన తమర్ని డైరెక్టుగా కలుసుకుని వుంటే - అడక్కండి సర్! ఊహించడానికి భయమేస్తోంది!"
"దీన్ని బట్టి నీకేం తెలుస్తోంది మిస్టర్ పాణీ? అచ్చెప్పునాకు!"
"పేపరు వార్తలు మనపాలిట భగవద్గీతలు సర్!"
"..అని నువ్వంటున్నావా?"
"అంత పవిత్రమైన మాటలు నేనెందుకంటాను సర్? శ్రీశ్రీశ్రీ వేణుగోపాలాచార్యులు సంస్కృతంలో సెలవిచ్చేరు సార్!"
"ఏవని యిచ్చేరు? అచ్చెప్పు నాకు!"
కృష్ణ పరమాత్మ గీత బోధిస్తున్న బాణీలో - పాణి సంస్కృత శ్లోకం ఒకటి చదివేడు!
అతను చదివిన శ్లోకాన్ని - కళ్లు మూసుకుని చేతులు జోడించి పారవశ్యంతో విన్నాడు బసవరాజు! ఆ తర్వాత అన్నాడు-
"ఆహా! ఏమన్నాడయ్యా మహానుభావుడు!"
"బాగా అర్థమైందా సార్!"
"కొంచెం అర్థమైనట్టే వుంది!"







"సంస్కృతం కదా సదా సర్! తెలుక్కి కొంచెం దగ్గర్లో వుంటుంది!"
"శ్రీశ్రీశ్రీ వేణుగోపాలాచార్యులు...!"
సరిగ్గా ఆ మాటమీదే - ఆఫీసుబోయ్ ఒక విజిటింగ్ కార్డు తీసుకొచ్చి బసవరాజుకిచ్చేడు!
బసవరాజు ఆ విజిటింగ్ కార్డుని గట్టిగా చదివేడు -
"వేణుగోపాల్! ఎం.ఎ., ఎంబిఎ, రమ్మను!"
ఆఫీసు బోయ్ వెళ్ళిపోయేడు! పాణి అంటున్నాడు -
"శ్రీశ్రీశ్రీవేణుగోపాలాచార్యుల వారి గురించి ముచ్చటించుకుంటుంటే - వేణుగోపాలుడు రావడం విచిత్రంగా వుంది సార్"
ఆ గదిలోకి వేణు అడుగుపెడుతూనే - ఎంతో వినయంగా 'గుడ్ మార్నింగ్ సర్!' అన్నాడు.
వేణుని చూసి - బసవరాజు ఎంతో ముచ్చటపడిపోతూ అన్నాడు -
"ప్లీజ్ బి సీటెడ్!"
వేణు ఒద్దికగా కూచుని 'థేంక్స్' అన్నాడు.
"మీ కంపెనీ గురించి నేను చాలా విన్నానండి" అని కూడా అన్నాడు.
"వినే వుంటారు! ముఖ్యంగా మీలాంటి సంస్కృత పండితులు"-
బసవరాజుగారి మాటకి పాణి అడ్డం పడ్డాడు -
"వారు వీరు కాదు సార్!"
"ఏమిటో? వారే వీరనుకున్నాను! చెప్పండి మిస్టర్ వేణూ - నేను మీకేం చేయగలను?"
"మీ కంపెనీలో నాకు తగిన ఉద్యోగం లభిస్తే - అయ్ విల్ బి గ్రేట్ ఫుల్ టు యు! ఇది నా బయోడేటా. ఇవి నా సర్టిఫికెట్లు!"
"అయ్ సీ! ఉద్యోగం కోసం వచ్చేరన్నమాట!"
"అవునండీ!"
"కాసేపు మా విజిటర్స్ లాంజిలో కూచోండి. ఈలోగా మీ పేపర్సు పరిశీలిస్తాను!"
వేణు నమస్కరించి ఆ గదినుంచి బయటపడ్డాడు!
బసవరాజు - వేణు యిచ్చిన కాగితాలు చూస్తున్నాడు!

* * *

రంగనాథం ఇల్లు!
ఆ ఇంటో రంగనాథం గోడల్నీ కుర్చీలను కాల్తో తన్నుకుంటూ శివతాండవం చేస్తున్నాడు!
మాటల్లో నిప్పుల వర్షం కురిపిస్తున్నాడు!
అన్నపూర్ణమ్మ చోద్యం చూస్తోంది!
"ఉద్యోగం! బోడి ఉద్యోగం? వెళ్లగా వెళ్లగా ఆ బసివి దగ్గిరికే వెళ్లాలా? వాడు నీచుడే! పరమనీచుడు! ఆ బోడి కంపెనీకి వేణుని ఎందుకు పంపించేవ్? మాటాడవే?"
"నన్నంటారేమిటి? హారతిచ్చి నేను పంపలేదు! శపథం చేసి వాడంతట వాడే వెళ్లేడు!"
ఆ మాట వినగానే రంగనాథం ఫ్లవర్ వాజ్ పగలకొట్టేడు!
"శపథం! బోడి శపథం! అదేమైనా ఇంద్రపదవా? దేవేంద్రుని సీటా? ఈ బోడి ఉద్యోగం కంటే నాగపూరు ఉద్యోగమే ఎన్నో రెట్లు బెటరు! వెళ్లిపొమ్మను - నాగపూరు!"

"మనల్ని విడిచి వుండలేనంటున్నాడుగా! ఆ మాటకొస్తే వాడ్ని విడిచి మీరు మాత్రం వుండగలరా? ఈ ఊళ్లోనే ఉద్యోగం చేయమని మీరే అన్నారుగా!"

"అన్నానే! అన్నాను! తొందరపడి అన్నాను! బుద్ధి గడ్డితిని అన్నాను! ప్రాణమిత్రుడూ వంకాయ్‌ స్నేహితుడూ - పెద్ద ఉద్ధరించేస్తాడని - బేవార్సు ఆలోచన కడుపులో పెట్టుకుని తప్పుడు కూత కూసేను! బసివిగాడి అసలు రంగు తెలిసిపోయింది గదా? ఇంకా ఏ మొహం పెట్టుకుని వాడి బోడి కంపెనీలో ఉద్యోగం చేస్తాం? అసలు వేణుకి అక్కడ ఉద్యోగం దొరకద్దూ? మీ బావనే గెంటి పారేసింతర్వాత - నువ్వొక లెక్కా అని పెడతాడే - గడ్డి!"

ఆ మాటకి అన్నపూర్ణమ్మ ఓర్చుకోలేక అన్నది-

"అట్లా ఎందుకనుకోవాలి? వాడి చదువుసంధ్యలు చూచి ఉద్యోగం ఇవ్వచ్చుగా?"

రంగనాధం కుర్చీని తన్ని అన్నాడు -

"అఖ్ఖర్లేదు! అవమానం నాకు జరిగినా నా బామ్మర్దికి జరిగినా ఒక్కటే ! నా తలకొట్టేసి వాడి మెళ్లో దండ వేస్తే సంతోషిస్తాననుకున్నావా? అది ఈ జన్మలో జరగదు! పదండిపోదాం! అందరం కట్టగట్టుకుని నాగపూరే వెళ్లిపోదాం! దేశభక్తి ముఖ్యంగానీ - ఊరుభక్తి ఎవడిక్కావాలి? ఉన్న ఊళ్లో ఛీ కొట్టించుకుని పరమాన్నం భోంచేసే కంటే - పొరుగూర్లో మంచీ మర్యాదల్తో పచ్చడి మెతుకులు కతికి కడుపు నింపుకోడం బెటరు! ఏం తింటున్నామో ముఖ్యం కాదే పిచ్చి మొహమా? ఎట్లా బతుకున్నాం? అది ముఖ్యం! అదే ముఖ్యం! ఏమిటర్థమైందా?"




"అర్థమైందిలెండి! బాగా అర్థమైంది! రండి భోంచేద్దుగారుగాని"

అని అన్నపూర్ణమ్మ వంట గదివేపు కదిలింది!

"ఆగక్కడ!" రంగనాధం అరిచేడు!

అన్నపూర్ణమ్మ ఆగిపోయింది!

"అవమానంతో బాగా కడుపు నిండిపోయింది! ఆ వడ్డింపు చాలునాకు! నువ్వు ప్రత్యేకించి నాకేం వడ్డించక్కర్లేదు!"

"చాల్లే ఊరుకోండి!"

"నిన్ను తగలెయ్య! నేను నిజమే చెప్తున్నాను! నాకిప్పుడు అన్నం నీళ్లూ సయించవు! అంచేత నువ్వు వంటగదిలోకి అడుగుపెట్టేవంటే - అడ్డంగా నరుకుతా! ఆ తర్వాత నిన్ను కూరొండుకుని తింటా! మా ఇంటా వంటా నాన్‌వెజిటేరియన్ తిళ్ళు తెలీవు! నన్ను మాంసాహారిని చెయ్యొద్దు! తర్వాత నీ యిష్టం!"

అని ఒక్క గెంతు గెంతి మంచమ్మీద పడ్డాడు!

అన్నపూర్ణమ్మ కళ్లొత్తుకుంటోంది!

(ఇంకావుంది)

# లలిత సంగీతం



ప్రముఖ గాయకుడు, స్వరకర్త
లలిత సంగీత విద్వాంసుడు,
వాగ్గేయకారుడు

**ఎం.చిత్తరంజన్**

సమర్పిస్తున్న శీర్షిక ఇది.
ఫోన్ నెం. 040-27402993

## సాగరరాజా మెల్లగ పోవా

సాగరరాజా మెల్లగ పోవా
చిన్నదోయీ నా హృదయనావ
1. చూడవోయీ నావలోకి
నీరు పోరాదోయీ
సాగరరాజా మెల్లగపోవా - చిన్నదోయీ నా హృదయనావ॥
2. గాలి రేగి వీచెను నాల్గువైపుల అంధకారమాయెనే
దారి తోచదే ధృవతార వెలుగులోన
నావ నడుపుము నీలోన
సాగర రాజా మెల్లగ పోవా - చిన్నదోయీ నా హృదయనావ॥

| | | |
|---|---|---|
| రచన | : | డా॥బాలాంత్రపు రజనీకాంతరావు |
| సంగీతం | : | ఎం.చిత్తరంజన్ |
| గాయని | : | శ్రీమతి శాంత |
| రాగం | : | శంకరాభరణం (మిశ్ర) |
| | - | 'సి' మేజర్‌స్కేల్ (పాశ్చాత్య సం॥) |
| | - | బిలావల్ (హిందుస్తాని సం॥) |
| తాళం | : | చతురశ్ర ఏక (కర్ణాటక సం॥) |
| | - | కహరువా (హిందుస్తాని సం॥) |
| | - | 2/4 రిథమ్ (పాశ్చాత్య సం॥) |
| ఆరోహణ | : | స రి గ మ ప ద ని స |
| అవరోహణ | : | స ని ద ప మ గ రి స |



షడ్జమం, చతుశృతి రిషభం, అంతరగాంధారం, శుద్ధమధ్యమం, పంచమం, చతుశృతి దైవతం, కాకలి నిషాదం యీ రాగంలోని స్వరాలు.

ఇవేకాక శుద్ధ రిషభం, ప్రతి మధ్యమం, శుద్ధ దైవతం, కైశికి నిషాదం కూడా యీ పాటకు కూర్చబడిన బాణీలో ఉపయోగించబడినాయి. కర్ణాటక సంగీతంలో 29వ మేళకర్తగా 'ధీరశంకరాభరణం'గా పేర్కొనబడిన యీ రాగం హిందుస్తానిలో 'బిలావల్'గాను, పాశ్చాత్య సంగీతంలో 'సి' మేజర్ స్కేల్ గాను పిలువ బడుతుంది. పియానో (లేక హార్మోనియం)లోని రీడ్స్‌ను అనుసరించి సప్తస్వరాలను C, D, E, F, G, A, B గా వ్యవహరిస్తారు. పాశ్చాత్య సంగీతంలో అవన్నీ పియానోలోని తెల్లని రీడ్స్ (White reeds). నల్లని రీడ్స్ (Black reeds)ను కర్ణాటక సంగీతంలో అరశృతులుగా వ్యవహరిస్తారు. వైట్ రీడ్స్‌లో పలికే సి, డి, ఇ, ఎఫ్, జి, ఎ, బి స్వరాలే శంకరాభరణ రాగంలోని సరిగమపదని స్వరాలు. ఆ రాగాన్ని పాశ్చాత్య సంగీతంలో 'సి' మేజర్ స్కేల్ అని అంటారు.




సి స్వరాన్ని వైట్ 1(పాశ్చాత్య సం॥), 1వ శృతి (కర్ణాటక సం॥), సఫేద్ ఏక్ (హిందుస్తాని సం॥) శృతిగాను, అదే విధంగా డి ని రెండవ, ఇ ని మూడవ శృతులుగాను, ఆ విధంగా 7 శృతులు నిర్ణయించబడినాయి.

పాశ్చాత్య సంగీతం యొక్క ప్రభావం లలిత సంగీతంపై ప్రముఖంగా వుందన్నది నిర్వివాదాంశమే కాక, దాని వలన కలిగే ప్రయోజనాలు కూడా లలిత సంగీతానికి ఎంతగానో వున్నవని చెప్పవలసి వుంటుంది. ముఖ్యంగా భారతీయ సంగీతానికి ఆర్కెస్ట్రేషన్ పద్ధతులు పాశ్చాత్య సంగీతం నుండి స్వీకరించి హార్మోనైజేషన్ (Harmonisation), కార్డ్స్ (Chords), కౌంటర్స్ (Counters) మొదలగు వాటితో వాయిద్యాలను మేళవించడం లలిత



సంగీతంలో ప్రాముఖ్యతను సంతరించుకుంది. వాద్య సమ్మేళన సహకారం లలిత గీతం పాడడానికి ఎంతో దోహద కారిగా వుంటుంది. లలిత సంగీతం పాడే గాయనీ గాయకులకు కార్డ్స్, కౌంటర్స్ పాడే అవసరం ముఖ్యంగా బృంద గీతాలలో ఉంటుంది. Choir singing పేరుతో పాశ్చాత్య దేశాలలో బృందగీతాలు పాడడం పరిపాటి. ఈ అంశాలన్నీ లలిత సంగీతంలో భావ వ్యక్తీకరణకు, రసపోషణకు ఎంతగానో ఉపయోగపడతాయి. పాశ్చాత్య సంగీతపు స్కేల్స్‌లో (అనగా రాగాలలో) 'సి' మేజర్ స్కేల్ బాగా వాడుకలో వున్నది. ఎంతమందో భారతీయ సంగీత దర్శకులు ఆకాశవాణి, టి.వి., చలనచిత్రాలలో 'సి' మేజర్‌ను ఉపయోగించి కొంత నేటివిటిని జోడించుకుంటూ అద్భుతమైన బాణీలను అందించారు.

సాగరరాజును సంబోధిస్తున్నట్లు సాగే యీ గీతం అనంత కాల సాగరంలో జీవుని ప్రయాణాన్ని సూచిస్తుంది. ఆటుపోట్లతో సాగే సముద్రం వలె ఒడిదుడుకులు ఏర్పడితే మానవుని జీవితం అల్లకల్లోలమవుతుంది. అందుకే నావలోనికి నీరు రాని విధంగా మెల్లగా ప్రవహించమని సాగరునికి వేడికోలు. ధృవతార వెలుగులో నావను నడిపి గమ్యం చేర్చమని

పరమాత్ముని ప్రార్థించే జీవుని మనస్థితిని సూచించే విధంగా శ్రీ రజని గారు ఈ గీతంలో అంతర్లీనమైన ఆత్మ పరిదేవనాన్ని చిత్రించారు. విశ్వకవి రవీంద్రుని గేయానికి అనుసరణ యీ గీతం. లలిత సంగీతం డిప్లొమా కోర్సు (2 సంవత్సరాలు)కు నేను రూపొందించిన సిలబస్ (పాఠ్య ప్రణాళిక)లో పాశ్చాత్య సంగీతం అధ్యాయంలో "సాగరరాజా మెల్లగ పోవా" అనే యీ గీతాన్ని చేర్చడం జరిగింది. ఆకాశవాణిలో యీ పాటను నా సంగీత నిర్వహణలో శ్రీమతి శాంత గానం చేసింది.

## పాశ్చాత్య సంగీత శైలి/సి మేజర్ స్కేల్ ఆధారంగా కొన్ని చిత్ర గీతాలు

### తెలుగు

| | పాట | చిత్రం | గానం | స్వరకర్త |
|---|---|---|---|---|
| 1. | మరచిపోరాదోయీ చేసిన బాసలు | మనోరమ | పి.సుశీల, తలత్ మహమూద్ | రమేష్‌నాయుడు |
| 2. | అందెను నేడే అందని జాబిల్లి | ఆత్మగౌరవం | పి.సుశీల | ఎస్.రాజేశ్వరరావు |
| 3. | అందాల ఓ చిలుక | లేత మనసులు | సుశీల, పి.బి.శ్రీనివాస్ | ఎం.ఎస్.విశ్వనాథన్ |
| 4. | నీటిలోన నింగిలోన | వివాహ బంధం | సుశీల, పి.బి.శ్రీనివాస్ | ఎం.బి.శ్రీనివాసన్ |
| 5. | చిన్నారి నీ చిరునవ్వు | పసిడి మనసులు | ఘంటసాల | అశ్వత్థామ |
| 6 | జోరుగా హుషారుగా షికారు పోదమా | భార్యాభర్తలు | ఘంటసాల | ఎస్.రాజేశ్వరరావు |

### హిందీ

| | పాట | చిత్రం | గానం | స్వరకర్త |
|---|---|---|---|---|
| 1. | దిల్‌దిల్‌సే కహ్‌రహాహై | పర్‌ఛాయీఁ(1952) | లతా, తలత్ | సి.రామచంద్ర |
| 2. | యాద్‌కియా దిల్‌నే కహాఁ హోతుమ్ | పతిత(1953) | లతా, హేమంత్ | శంకర్ జైకిషన్ |
| 3. | దిల్ తడప్ తడప్ కే కహ్ రహాహై | మధుమతి(1958) | లతా, ముకేష్ | సలిల్ చౌధురి |
| 4. | ధిర్‌ధిర్ ధిర్ ధిర్ బదరువాబర్‌సే | పరివార్(1956) | లతా, హేమంత్ | సలిల్ చౌధురి |
| 5. | జిందగి కైసీహై పహేలీ | ఆనంద్(1970) | మన్నాడే, బృందం | సలిల్ చౌధురి |
| 6. | హమ్‌మత్‌వాలే నౌజవాఁ | షరారత్(1959) | కిషోర్‌కుమార్ | శంకర్-జైకిషన్ |
| 7. | జీవన్‌కీ సఫర్‌మే రాహీ | మునీమ్‌జీ(1955) | కిషోర్ | ఎస్.డి.బర్మన్ |
| 8. | దిల్‌మె చుపాకే ప్యార్‌కా తూఫాన్ లే చలే | ఆన్(1952) | రఫీ | నౌషాద్ |
| 9. | ఆయేగా ఆనేవాలా | మహల్(1949) | లతా | ఖేమ్‌చంద్‌ప్రకాశ్ |

## హిందీ సినీ సంగీతంలో మలుపులు-మజిలీలు

హేమంత్, మజ్రూహ్‌ల కాంబినేషన్‌లో రూపుదిద్దుకున్న 'నాగిన్' చిత్రంతో పోలిస్తే తరువాత వచ్చిన 'మేరీ వినతి సునో భగవాన్' ఫ్లాఫ్ కిందే లెక్క హేమంత్‌కుమార్ స్వరపరిచిన 'దుర్గేష్ నందిని' చిత్రంలోని 'కహా లే చలే హో...' పాట మాత్రం హిట్ అయింది.

వి.శాంతారాం చిత్రం 'తుఫాన్ ఔర్‌దియా' కోసం వసంత్‌దేశాయ్ అద్భుతమైన సంగీతాన్నిచ్చారు. 'నిర్బల్‌సే లడాయ్ బల్వాన్ కీ', 'మేరీ ఛోటీసి బహెన్' పాటలు మంచి హిట్ అయ్యాయి.

కిశోర్, షంషాద్ లతో ఓ.పి.నయ్యర్ పాడించిన 'మేరీ నీందోఁ మేఁ తుమ్' (నయా అందాజ్) ఓ మంచి పాట. 'హమ్ సబ్ చోర్‌హై' చిత్రంలోని 'హమ్నే దేఖా'


'హమ్ సబ్ చోర్‌హై' లో నళినీజయవంత్, ప్రాణ్

పాట హిట్ కావటమే కాదు, ఓపి ఎంతో ప్రతిష్ఠాకరమైన (గురుదత్-రాజ్‌ఖోస్లాల కాంబినేషన్‌లో రూపుదిద్దుకున్న ) 'సి.ఐ.డి.' చిత్రం మ్యూజికల్‌గా సెన్సేషన్ సృష్టించింది. 'లేకే పెహలా పెహలా ప్యార్', 'ఆంఖో హీ ఆంఖో మేఁ', 'యే దిల్ హై ముష్కిల్', 'బూజ్ మేరా క్యా నామ్‌రే, కహాఁ పే నిగాహే', పాటలు ఇప్పటికీ పాప్యులరే. ఈ చిత్రంతో నయ్యర్ టాప్‌స్లాట్‌కి వచ్చారు.

బెంగాలీ దర్శకులకి దర్శకత్వం అప్పగించిన తన 'జాగ్తే రహో' కై ఆస్థాన సంగీతదర్శకులైన శంకర్-జైకిషన్‌లను పక్కకుబెట్టి సలీల్‌చౌధురిని సంగీత దర్శకునిగా రాజ్‌కపూర్ ఎన్నుకున్నారు. శైలేంద్ర రాసిన 'జిందగీ ఖ్వాబ్ హై', 'జాగో మోహన్ ప్యారే' పాటలు మంచి హిట్ అయ్యాయి. అయితే ఏ.వి.యం. సంస్థ ఫ్రాంక్ కాప్రా చిత్రం 'ఇట్ హేపెండ్ వన్ నైట్' ఆధారంగా రూపొందించిన 'చోరీ చోరీ' చిత్రం కోసం శంకర్-జైకిషన్‌లు మళ్లీ రాజ్‌కపూర్ కాంబినేషన్‌లో పని చేయటం జరిగింది. ఈ చిత్రం కోసం వీరు అజరామరమైన గీతాలను రూపొందించారు. 'పంఛీ బనూ ఉడ్తీ ఫిరూఁ', 'రసిక్ బల్మా', 'మన్ భావన్ కే ఘర్', 'ఆజా సనమ్ మధుర్ చాందినీ మేఁ హమ్', 'యే రాత్ భీగీ భీగీ', ' జహాఁ మై జాతీ హూఁ' ఈ చిత్రంలో హిట్ అయిన పాటలు. రాజ్ ఆత్మగా చెప్పుకోబడ్డ ముకేష్ ఈ చిత్రంలో పాడకపోయినప్పటికీ మన్నాడే ఆయనకు చక్కటి ప్రత్యామ్నాయంగా వచ్చారు.


'జాగ్తే రహో' చిత్రంలో ఓ సన్నివేశం


సలీల్‌చౌధురి

-(వచ్చే సంచికలో మరికొంత)







# సప్తస్వర సుందరి లతా మంగేష్కర్



ప్రఖ్యాత నేపథ్య గాయకుడు,
బహుభాషా కోవిదుడు, కవి, రచయిత
'కళైమామణి', 'గానకళా సార్వభౌమ' బిరుదాంకితులు
**డా॥ పి.బి.శ్రీనివాస్**
'హాసం' పాఠకుల కోసం
తన అభిమాన గాయని జీవిత చరిత్రను
అక్షరబద్ధం చేస్తున్న సీరియల్ ఇది

ఆదిలో కూతలతో నిండిన అదే హాలు, ప్రశంసా వాక్యాలతో దద్దరిల్లి పోయింది. దీనానాథ్‌కి కూతురిపైన గల ఆప్యాయతా, ఆమె ప్రతిభపై గల నమ్మకం పెరిగి దృఢపడి పోయాయి. ఆనాటి నుండి లత పేరు ఎల్లెడలా మారుమ్రోగసాగింది. తండ్రి కూతురికి తనే గురువై మరింత శ్రద్ధా దీక్షలతో సంగీత సాహిత్య మర్మాలు తెలియజేస్తూ, తను పాడుతూ ఆమెనూ పాడించి, తప్పులు ఏవైనా పొరపాటున పాడసూపితే సరిదిద్దుతూ లత భవిష్యత్తుకి సన్మార్గ దర్శకులయ్యారు. ఈనాటికీ లతా తన "బాబా"ని తలుచుకోకుండా ఏ పనీ తలపెట్టరు, ప్రారంభించరు. తండ్రిని మించిన తనయ అనడం కన్నా, తండ్రికి తగిన కూతురు అంటేనే ఆవిడ ఆమోదిస్తారు, సంతోషిస్తారు. తండ్రి తరువాత ఆమెకి కొందరు గొప్ప గురువులే లభించారు. కాని వాళ్లందరిలో కొందరే లతకి కొత్త విషయాలు నేర్పగలిగినవారు. వారందరూ ఆమెకి సదా మాన్యులే. సన్మాన్యులే. అయినా లతా ఎక్కువగా గౌరవించి, నమస్కరించే దైవసమగురువర్యులు, పరోక్ష దేశికులైన ఉత్తమ మార్గదర్శకులూ, నిర్దేశకులూ, పాటియాలా ఘరానాకే ప్రత్యేక ప్రతీకగా నేటికీ పరిగణించబడే ప్రసిద్ధ హిందుస్తానీ సంగీత విద్వాంసులు, స్వర కళాసాగరులు అనదగిన ఉస్తాద్ బడే గులాం ఆలీ ఖాన్ ది గ్రేట్.

"లత'ది అపస్వరమే ఎరుగని గళస్వరం' అని ఖాన్‌సాహెబ్ బడేగులాం ఆలీ లాంటి సంగీత మనీషి మెచ్చుకున్నారంటే, ఆమెది ఎంత వింతైన గొంతో మనం ఊహించుకోవచ్చు. లతా గానం గురించి ఎందరెందరో మహాగాయికా గాయక శ్రేష్ఠులు పరుపరి విధాల ప్రశంసించారు. మున్ముందు తరాలవారు కూడా ప్రశంసిస్తూనే వుంటారు అనేది నిస్సందేహం. బడే గులాం ఆలీని "ఠుమ్రీ స్పెషలిస్టు"ల లిస్టులో ఫస్టుగా పేర్కొంటారు, గాన మహా విద్వాంసులు కూడా. లత పాడిన మొదటి చిత్ర గీతం కూడా ఒక ఠుమ్రీయే కావడం, దైవ నిర్ణీతం. లతా మొదటి హిందీపాట స్వరపరిచిన సంగీత దర్శకుడుదత్తా దాల్‌జేకర్ లతా గురించి 'అదేం మాయో కాని, లతా పాడిన పాటలు, పదే పదే పాడకుండా వుండలేడు ఏ రసజ్ఞుడూ' అన్నాడు. ఆమె తల్లి "తను శోధనలని తట్టుకుని ఎంత బాధపడిందో ఆమె "కళ" అంతకంతకి పరిశుద్ధ స్వర్ణంగా రూపొందింది.'. అంది.

ఎంతోమంది చేత తరచూ ప్రశంసింపబడే గాయనీమణి లతా మంగేష్కర్ నాకు ప్రశంస అందించడం ఇక్కడ గుర్తుకు రావడం సహజమూ, సమంజసమూ కూడా. ఆ సన్నివేశం, ముంబై (అప్పటి బొంబాయి) నగరంలో హెచ్.ఎం.వి. సంస్థలో నేను రెండు హిందీ గీతాలూ, ఒక ఉర్దూ ఘజలూ పాడి రికార్డు చేయించిన సందర్భాన జరిగింది.

ప్రఖ్యాత గీతరచయిత, బహుముఖ ప్రజ్ఞాశాలి అయిన పద్మశ్రీ ప్రేంధవన్ నా చిరకాల మిత్రులు. ఇటీవలే పరమపదించారు. ఆయనచే లిరిక్కులు రాయించుకుని, నేను హెచ్.ఎం.వి.లో హిందీ ఉర్దూ పాటలు రికార్డు చేయించుకున్నాను. చాలా బాగా రికార్డయినాయి. ముఖ్యంగా 'యే ప్యార్ రంగ్ క్యా క్యా హంకో దిఖా రహా హై' అని సాగే ఒక ఘజలు చాలా బాగా కుదిరింది. మెడనొప్పి బాధపెడుతున్న సమయంలో కూడా, కదలక మెదలక (శ్రీమతి ఎస్.జానకిలా) సంగతులన్నీ కుమ్మరిస్తూ నేను పాడిన వైనం సౌండ్ ఇంజనీరు గారికి ఆశ్చర్యం కలిగించింది.

ఆయన మరునాటి ఉదయాన ఆ పాట లతాకి వినిపిస్తున్న వేళ, నేను తలుపు తోసుకుని లోపల ప్రవేశించడం గమనించిన ఆమె, 'ఇన్‌కోతో మైఁ ఖూబ్ జాన్‌తీ హూఁ' (ఈయన్ని నేను బాగా ఎఱుగుదును) అని ఆయనతో చెప్పి, మళ్లీ కళ్లు మూసుకుని తదేక ధ్యానంతో వింటూ వుండగా, ఒకానొక "శేర్"లో (Couplet) "సాకీ" అనే ఉర్దూ పదం నేను ఉచ్చరించిన విధానాన్ని గమనించిన ఆమె, వెంటనే, "వాహ్ శ్రీనివాస్ జీ, ఆప్‌నే ఉర్దూవాలోంసే జ్యాదా అచ్ఛా ప్రొనౌన్స్ కియా!" అని మెచ్చుకున్నపుడు నేను పొందిన ఆనందం ఏ శాయరూ (కవి) వర్ణించలేడు - ఉర్దూలో 'కాఫ్' అనబడే ఆ అక్షరోచ్చారణ అతి క్లిష్టమైనది. ఎవరైనా సరే ఆ అక్షరాన్ని ఏమాత్రం తేడాగా ఉచ్చరించినా, తప్పు పట్టేస్తారు ఉచ్చారణ ప్రామాణికులు. అది

## చిన్నారి లతా సంగీతప్రావీణ్యం



తండ్రి దీనానాథ్ రియాజ్ (సంగీతసాధన) చేసేటప్పుడు, తన శిష్యులకు నేర్పేటప్పుడు చిన్నారి లతా ఆ చుట్టుపట్లే తిరుగుతూ వింటూండేది.

ఓ రోజు దీనానాథ్ ఏదో పనిమీద బయటకు వెళుతూ శిష్యులకు పూరియా ధనశ్రీ రాగంలో అభ్యాసం చేయమని చెప్పి వెళ్లాడు. శిష్యుడు రాగాలాపన ప్రాక్టీసు చేస్తున్నాడు. లతాకు అప్పుడు ఐదేళ్లు. కాస్త దూరంగా ఆడుకుంటోంది. శిష్యుడు తప్పుపాడడం గమనించి, ఆట మానేసి, ఆ అబ్బాయి ఎక్కడ తప్పుపాడాడో పాడి వినిపించి సవరించింది. ఇంతలో బజారు పని ముగించుకుని వచ్చిన తండ్రి కంట బడింది ఈ దృశ్యం. విస్తుపోయాడు.

వెంటనే భార్యను పిలిచి, "ఇదిగో చూశావా, మనింట్లోనే సంగీతసరస్వతి ఉంది. మనకా విషయం తెలియనే లేదు.". అంటూ ఆనందాతిరేకంతో మర్నాటినుండే లతాకు సంగీతసాధన మొదలుపెట్టాడు. త్వరలోనే ఆమె తండ్రినుండి అఖండ జ్ఞానాన్ని అందిపుచ్చుకుంది.

## వారసత్వపు ఆస్తి - తంబూరా

లతాతండ్రి దీనానాథ్ కొంతకాలం భోగభాగ్యాలను అనుభవించినా, అంత్యదశలో దుర్భర దారిద్ర్యాన్ని అనుభవించాడు. హాస్పటల్లో సరైన చికిత్సకు డబ్బులేక 42 వ యేట మరణించడం జరిగింది.

మరణించడానికి కొన్ని రోజుల ముందు దీనానాథ్ భార్యను పిలిచి "మన బాంకు ఎక్కవుంటులో ఎంత డబ్బు ఉంది?" అని అడిగారు.



"నాలుగైదు రూపాయలు కాబోలు" అందామె దుఃఖాన్ని దిగమింగుతూ.

"మంచిదే, అంటే నా ఎక్కవుంటు ఇక్కడా ముగుస్తోందన్నమాట. మంగేషనాథుని చరణాలు చేరవలసిన సమయం ఆసన్నమయింది." అంటూ ఆయన 13 యేళ్ల చిన్నారి లతాను తన దగ్గరకి రప్పించుకున్నారు. "నేను నా జీవితకాలంలో లక్షలాది రూపాయలు ఆర్జించాను. కానీ ఏమీ మిగుల్చుకోలేకపోయాను. జీవిత చదరంగంలో ఓడిపోయి నిష్క్రమిస్తున్నాను. నీకు నేనివ్వగలిగే ఆస్తి ఏదైనా ఉందంటే ఇవే - ఈ తంబూరా, స్వయంగా నొటేషన్లు రాసుకున్న నా పాటల పుస్తకం. ఇవి నీ చెంత వుండగా, నన్ను మించిన ఆర్టిస్టువి కాగలవని నా నమ్మకం. జీవితంలో భద్రతాభావం అనేది లేకుండా నేను బతికాను. కానీ నీకా బాధలేదు. ఇవి ఆ లోటు తీరుస్తాయి. మంగేషనాథుడు నిన్నెపుడూ కనిపెట్టుకుని ఉంటాడు." అన్నాడాయన.

ఆయన మాటలు నిజమయ్యాయి. ఆ రెండే పెట్టుబడిగా లతా జీవితప్రయాణం ఆరంభించి ఎంతో ఎత్తుకి ఎదిగింది. దీనానాథ్ అంటే లతా తండ్రిట అని మనం అనుకునే స్థాయికి చేరుకుంది. అయితే దారిద్ర్యకారణంగా సరైన చికిత్స చేయించుకోలేకపోయిన తండ్రి అవస్థ ఆమె మరిచిపోలేదు. అందువల్లనే పేదలకై ఆమె పుణేలో తండ్రి పేర ఒక హాస్పటల్ కట్టించారు.

నిర్దుష్టంగా పలికినందుకు, ఆమె అందించిన మెప్పు నా ఉర్దూ భాషా కృషికి "భారతరత్న" బిరుదని నా ఫీలింగు

-'మహల్, బర్సాత్, అందాజ్' వంటి హిట్ చిత్రాలలో లత పాడిన అన్ని పాటలూ గొప్ప హిట్లే, ఆ పాటల కోసమే ఆ చిత్రాలని నేను పదే పదే చూశాను. నేర్చుకున్నాను. స్నేహితులందరికీ మక్కికి మక్కీగా పాడి వినిపించేవాడిని. అప్పటి



నా సన్నని మెత్తని వాయిస్సు 'లత' లాగే పాడేందుకు నాకు నాకెంతగానో సహకరించేది. ప్రశంసల తేనెజల్లులు కురిపించేవారు మిత్రులందరూ -

"అందాజ్"లో లత పాడిన రెండు సోలోలు పరమాద్భుతాలు. నౌషాద్ గారి ట్యూనింగూ, లత గారి రెండరింగూ ఆ రెండు పాటలకీ జీవం పోశాయి. "ఉన్‌కే సితంనె లూట్‌లియా", "తోడ్ దియా దిల్‌మేరా తూనే అరే బేవఫా" - అనే ఆ రెండు పాటల్నీ తలుచుకుంటే ఇప్పటికీ, నా ఒళ్ళు జలదరిస్తుంది. "తోడ్‌దియా" అనే పాట నా ప్రియతమ గీతం. "మాడ్యులేషన్" అనే ప్రత్యేకాంశాన్ని ఆ గీతంలో 'లత' అద్భుతంగా ప్రయోగించిన విధానం అనితర సాధ్యం - ఆహా! ఏం పాట, తేట తేనియూట, వెన్నెలబాట, మల్లెల సుగంధాల తోట! పాడుకునేవాణ్ని నాలోనే ప్రతీపూటా! నౌషాద్, సజ్జాద్‌లకే చెల్లింది, అలాంటి ట్యూన్లు కంపోజ్ చెయ్యడం.

నర్గీస్ దిలీప్‌కుమార్లు నటించిన పురాతన చిత్రం 'హల్‌చల్'లో(?) సజ్జాద్ స్వరపరిచిన "ఆజ్‌మేరే నసీబ్ ముఝ్‌కో రులారులా దియా" అని లత పాడిన పద్ధతి, రసజ్ఞతకీ, కళాభిజ్ఞతకీ ఉద్ధతి. స్వరాలని లత గళస్వరం ఊపిన ఊపులు, తీయదనాల 'తోపు'లు. అందాలందించి అందుకునే తూపులు! "ఆజ్‌మేరే" అనే పదానికి, గపగా గరిరిరీ అనే స్వరప్రయోగం, రిషభానికిచ్చిన ప్రాధాన్యం అనన్యసామాన్యం. లతనీ, సజ్జాద్‌నీ తప్పక చూడాలనీ, కలుసుకోవాలనీ, ఆనాడే నాలో అభిలాష అంకురించి, పుష్పించి, తదుపరి తగ్గ సమయాన ఫలించింది. "హేట్సాఫ్ టు మై గ్రేట్ లక్"!!

"లత" లక్‌కి సాటియే లేదని నాకనిపిస్తుంది, ప్రతిభకి తగిన ఘనవిజయాలు సాధించిన 'లత' హస్తరేఖలు పరిశీలించాలి అనే నా ఆశ కూడా వాహినీ స్టూడియోలో నెరవేరింది.

"నిదురపోరా తమ్ముడా" అనే లాలిపాట పాడేందుకో, మరో పాట పాడేందుకో జ్ఞాపకం లేదు గాని, వాహినీ స్టూడియోలోనే ఆ రికార్డింగు అని మాత్రం చాలా బాగా జ్ఞాపకం. ఆమె కుర్చీలో విరామసమయంలో కూర్చుని వుండగా నేను 'నమస్తేజీ' అని వందన సమర్పించగా, ఆమె కూర్చోండి అని ఆదరపూర్వకంగా ఆదేశించారు. కూర్చోమన్నందుకే, ఉబ్బిత బ్బిబ్బులై, మెల్లగా సంభాషణలోకి దిగాను. అంతకుముందే జెమినీ స్టూడియోలో 'బాలనాగమ్మ' చిత్రం బాపతు హిందీ డైరెక్ట్ ప్రొడక్షన్ "బహుత్ దిన్ హుయే"లో ఆమెతో ఒక పాటలో చిన్న హమ్మింగ్ పాడివున్నాననీ చెబుతూ, అలాఅలా ప్రసంగ వశాన" మీ చెయ్యి చూడాలని నా అభిలాష" అని సంకోచిస్తూనే అడిగాను.

ఏ మాత్రం అడ్డు చెప్పకుండా ఆమె సుహృదయతతో చేయిచాపి, అరచెయ్యి చూపించారు. హస్తరేఖాశాస్త్రంలో నాకు గల మిడిమిడి జ్ఞానంతోనే బాగా పరిశీలించి, ఒక ప్రత్యేక విషయం గమనించి, 'మీ విశిష్ట విజయాలకి ముఖ్య కారణాలు రెండు' అన్నాను చాలా నమ్మకంగా. ఆమె ప్రశ్నార్థకపు చూపు సారించారు. "మొదటి కారణం మీ అపారప్రజ్ఞా

### లతా వాయిస్ - పీపుల్స్ ఛాయిస్ (గీతరచయితలు)

"భూమికి ఒకే సూర్యుడు, ఒకే చంద్రుడు, ఒకే 'లత'!
- జావేద్ అక్తర్, గీత కర్త.

నేను రాసిన కవితలలో మార్పు చేసేందుకు ఎవ్వరినీ అనుమతించను. ఒకే ఒక లతని తప్ప-
- మజ్రూహ్ సుల్తాన్‌పురీ (ఉర్దూకవి)

"లత గళస్వరం ఒక సాంస్కృతిక మహాతిశయం. మనం ప్రతిరోజూ చవిచూసే ఆహారం! ఏ ఒక్కరోజైనా లతా పాట ఒకటైనా, ఒకసారైనా వినకుండా బ్రతకలేం! వుండలేం - చెవిటివాళ్లమైతే తప్ప!"
- గుల్జార్, కవి, దర్శకుడు.

సేకరణ - శ్రీని 'వాయిస్'

## టాక్సీవాలా ఔదార్యం

1942 ఏప్రిల్ 24 శుక్రవారం - లతా తండ్రి దీనానాథ్ ఆసుపత్రిలో మరణించారు. చేతిలో డబ్బులేదు. అయినా శవం ఇల్లు చేరాలిగా! అంబులెన్స్ గురించి చూడబోతే దొరకలేదు. టాక్సీవాళ్లను అడిగారు. శవాన్ని తీసుకెళ్లమన్నారు వాళ్లు. ఏం చేయాలో తోచని పరిస్థితిలో ఓ ముసలి టాక్సీవాలా వచ్చాడు.

"శవం ఎవరిది?" అని వాకబు చేయబోయాడు.

"ఎవరిదైతే నీకేం? అడిగినంత డబ్బు ఇస్తామంటున్నాంగా!" అన్నారు దీనానాథ్ కుటుంబసభ్యులు.

"అసలు..ఎవరిదో చెప్పడంలో తప్పులేదుగా" అన్నాడా చాదస్తుడు.

"ఓ గాయకుడిదిలే."

"గాయకుడా? ఆయన పేరేమిటో!?"

"మాస్టర్ దీనానాథ్"

"అంటే..బల్వంత్ సంగీత్ మండలి నడిపినాయన, దీనానాథ్ ఆయనేనా?"

"అవును. ఆయనే!"

"అయ్యోపాపం! ఆయన వల్ల నేను చాలా గడించాను. అంటే డైరక్టుగా ఆయన ఇచ్చాడని కాదు. ఆయన నాటకాలు ఆడే థియేటర్లకు చాలామందిని టాక్సీలో తీసుకెళ్లి నాలుగు డబ్బులు చేసుకున్నాను. గొప్ప కళాకారుడు. మహానుభావుడు. పాపం పోయాడా! మీరు నాకు డబ్బిచ్చినా ఇవ్వకపోయినా ఫర్వాలేదు కానీ ఆయన శవాన్ని నా టాక్సీలో తీసుకెళ్లడం నా భాగ్యంగా భావిస్తాను.రండి వెళదాం." అన్నాడా టాక్సీవాలా.

దీనానాథ్ భోగభాగ్యాలతో తులతూగే రోజుల్లో అతన్ని చుట్టూ వేళ్లాడుతూండే బంధుమిత్రగణంలోని వారెవ్వరూ ఆ రోజు కనబడలేదు. దీనానాథ్ చితి ముట్టించిన సాటినటుడు శ్రీపాద్ జోషి (కొడుకు హృదయనాథ్ చాలా చిన్నవాడు) తో కలిపి శ్మశానానికి వచ్చినవాళ్లు ఆరుగురు! ఆ ఆరుగురిలో టాక్సీవాలా కూడా ఉన్నాడు. శవాన్ని దింపాక బేరాల విషయం పట్టించుకోకుండా శవదహనం అయ్యేవరకు ఉండి ప్రణామాలాచరించి మరీ కదిలేదతను.

పాటవం., రెండోది, మీ హస్త రేఖా సాముద్రిక విశిష్ట లక్షణం!'' అని చెప్పి, ఆమె అరచేతిలో, 'జూపిటర్ మౌంట్' పైన గల రేఖానక్షత్రాన్ని సూచించి, చూపించాను. కొన్నికోట్ల చేతుల్లో, ఒక చేతిలో ఉంటుందేమో అలాంటి ఉత్తమ రేఖా లక్షణం, ఆ రేఖా నక్షత్రం చాలా దిట్టంగా వుండడం మరో ప్రత్యేకత. ఆమె అంతగా ఆశ్చర్యవడకపోయినా, చిరునవ్వుతో స్వీకరించారు నా తీర్మానాన్ని. బహుశః అంతకుముందే ఆ రేఖా నక్షత్రం తెలుసునో, లేక మరెవ్వరైనా చెప్పి వున్నారో నాకు తెలియదు కాని, నాలో నాకు గొప్ప సంతృప్తి - చాలా గొప్ప విషయాన్ని, ఆమెకి చెప్పేశానని.

''లత చదువుకోని (చదువురాని అనకూడదు) మహా మేధావి అనడం సముచితం. చదువుకునేందుకు చేరిన స్కూల్లో, పాట పాడి తోటిపిల్లల చేత పాడించిన నేరానికి, ఉపాధ్యాయుల వారు గద్దించడంతో, గాయపడిన మనసుతో ఇంటికొచ్చేసి, తిరిగి స్కూలు ముఖం చూడకూడదని నిర్ధారించుకున్న లత "విశ్వవిశ్వ విద్యాలయం"లో చదివిన అనుభవపాఠాల చదువుకీడైన చదువు విశ్వంలోనే లేదేమో. ఆమె మనుషుల్నీ మనసుల్నీ అవలీలగా నిమిషంలో చేయగల అధ్యయనం అసాధారణం! ఆమె జ్ఞాపకశక్తి అత్యద్భుతం.

బొంబాయి కెవ్వుడెళ్లినా ఆమెను కలుసుకోవడం మాట్లాడిరావడం నాకు పరిపాటి. అలా ఒక సంగీత కచేరీ సందర్భంలో బొంబాయి చేరిన నేను తిరిగి మద్రాసుకి బయలుదేరేముందు లతానికుంజమైన ప్రభుకుంజ్‌లో ఆమెని దర్శించాను. సంభాషణ మధ్యలో ఒక ప్రొడ్యూసర్ గారు విచ్చే శారు. లతగారి పాట కచేరీ ఏర్పాటు చేసు కోవడం, వారి రాకకుగల ముఖ్యోద్దేశం. ఆమెకు, తమ సంస్థ చేయ దలచుకున్న ఘనవైభవోపేత సన్మానవివరాలని



ఎన్నెన్నో అతిశయోక్తులతో ఒకటొకటిగా వర్ణిస్తూ, ఈ పాటకచ్చేరీకి ఆమె తప్పక సమ్మతించక తప్పదని, నిర్ణయాత్మకంగా నిర్దేశించాడు. నేనదంతా గమనిస్తూ కూర్చున్నాను - ఆయన రిమార్కులకి, లత ముఖకవళికలతోనే యిస్తున్న మార్కులని అర్థం చేసుకుంటున్నాను, ఆమె రియాక్షన్‌లని. ఆయన చెప్పిన అన్ని వివరాలని శ్రద్ధగా విని, ఆమె వడ్డించిన తిరుగులేని రిమార్కు నన్ను నివ్వెరపరచింది. ఆ రిమార్కుకి తాత్పర్యం ఇది! 'నిజం చెప్పాలంటే, పదిహేను సంవత్సరాల క్రితం ఇదే రీతిగా మీరు నన్నాహ్వానించి చేసిన అమోఘ సత్కారాన్ని నేటికీ మరువలేదు. ఏనాటికీ మరచిపోలేను - నన్ను క్షమించండి -' అని.

-(సశేషం)

## లతా వాయిస్ - పీపుల్స్ ఛాయిస్
### (శాస్త్రీయ సంగీత విద్వాంసులు)

"శాస్త్రీయ కళాభిజ్ఞులమైన మా వంటి వారికి, రసజ్ఞ ప్రశంసలని సాధించడానికి మూడూ, మూడున్నర గంటల టైం పడుతుంది. అదే సాధనని లత మూడూ మూడున్నర నిమిషాలలో రికార్డుల రికార్డు టైంలో సాధించి చూపించడం మహాద్భుతం."

**- ఉస్తాద్ అమీర్‌ఖాన్**

"తాజ్‌మహల్ ఏడో అద్భుతం అయితే, లత ఎనిమిదో అద్భుతం!!"

**- ఉస్తాద్ అంజద్ అలీఖాన్ (సరోద్ వాదకులు)**

"పారంపర్యంగా లక్ష్మీ సరస్వతులొక చోట వుండరు అంటారు పెద్దలు. కాని లత విషయంలో చూడండి! ఇద్దరూ ఒకామెలోనే కాపురమున్నారు -"

**- హరిప్రసాద్ చౌరాసియా (వేణువాదన విద్వాన్)**

"శాస్త్రీయ సంగీత విద్వాంసుల మనిపించుకుంటున్న మా లాంటి గాయకులం లతకి కృతజ్ఞులం. కారణం, ఆమె శుద్ధ శాస్త్రీయ సంగీతం పాడడం ప్రారంభించకపోవడం-"

**- పండిట్ జస్‌రాజ్**

"భావుకత", కుశాగ్ర నిశిత బుద్ధి గల కళాకారులకి నేను ప్రత్యేక గౌరవం ఇస్తాను. అవి రెండూ లతలో పుష్కలంగా వున్నాయి"

**- సితార్ మాస్ట్రో పండిట్ రవిశంకర్**

"లత ఒక్కతే పాడుతుంది. మిగిలిన వారందరూ విఫల ప్రయత్నం చేసేవారే."

**- సజ్జాద్ హుసేన్ (మేండొలిన్ మాస్ట్రో, సంగీత దర్శకుడు)**

"ఆమె గళ స్వరానికి తంబూరాని శృతి చేసుకోవచ్చిక"

**- మరాఠీ సంగీత కర్త శ్రీనివాస్ ఖలే**

"నా వయొలిన్‌లో మీ సంగీతాన్ని పునస్సృష్టి చేసేందుకు నేను ప్రయత్నం మాత్రమే చెయ్యగలను."

**- యహూదీ మెనూహిన్, వయొలిన్ విజర్డ్**

"లతాకి కృతజ్ఞతలు. ఆమె వలన సాధారణ మానవుడికి శాస్త్రీయ సంగీత రసజ్ఞత సిద్ధిస్తోంది."

**- భీంసేన్ జోషి, సంగీత విద్వాన్**

**సేకరణ - శ్రీని 'వాయిస్'**

జూన్ 21 కె.వి.మహదేవన్ వర్ధంతి సందర్భంగా...



# ఆయన్ని ఫాలో అయ్యేవారు ఎవ్వరూలేరు... నేను ఒక్కణ్ణే..

## కె.వి.మహదేవన్ గురించి కీరవాణి

కె.వి.మహదేవన్ గారి గురించి నాకు తెలిసింది చెప్పడానికి ప్రయత్నిస్తాను. తెలిసింది అంటే బయటివారినుండి కాకుండా నాకు డైరెక్టుగా తెలిసింది. అలాగే నేను డైరెక్టుగా ఫీలయ్యేది.

నేను చిన్నప్పుడు కృష్ణగారి ఫ్యాన్ని. కృష్ణగారి ఫైట్సుకి నేను ఫ్యాన్ని. ఇప్పుడు కాదా అంటే ఇపుడు నేను ఎవరి ఫ్యాన్ని కాదు.

కృష్ణగారి ఫ్యాన్ను కాబట్టి ఆరోజుల్లో సత్యం గారి పాటలు బాగా ఇష్టపడేవాణ్ని. జనరల్గా సత్యంగారు కృష్ణగారి సినిమాలకు ఎక్కువ పనిచేశారు. తర్వాత నేను చదువు మానేసి సంగీతం మీద కాన్సన్‌ట్రేషన్ పెట్టి సంగీతం నేర్చుకుంటున్న రోజుల్లో మహదేవన్‌గారి మీద అభిమానం పెరిగింది. ఆ రకంగా ఆయన నా ఫేవరేట్ మ్యూజిక్ డైరెక్టర్ అయ్యారు. ఆయన కంపోజ్ చేసిన చాలా పాటల్లో 80% పాటలు బిజియమ్స్‌తో సహా నాకు తెలుసు.

జనరల్గా మీ అభిమాన సంగీత దర్శకుడు ఎవరంటే- కె.వి.మహదేవన్ అనే చెబుతాను ఇది ఒకటవ పాయింట్. ఈ మధ్యనే అంతకన్నా ఎలివేటెడ్ మ్యూజిక్ చేసిన ఒక మ్యూజిక్ డైరెక్టరు పాటలు వినడం తటస్థించి మహదేవన్‌గారిని రెండో స్థానంలో పెట్టుకున్నాను.

ఆ మొదటి స్థానంలో ఉన్న మహానుభావుడు ఎవరంటే స్వర్గీయ నాగయ్యగారు. ఆయన పాటలు కొన్నింటిని వి.ఎ.కె.రంగారావు గారు ఇస్తే విని ఆయన్ని నా హృదయ పీఠంలో ఫస్టు ప్లేస్‌లో ప్రతిష్టించుకున్నాను. ఫస్టు సెకండ్ అని అనాలి కాబట్టి అంటున్నానే తప్ప అందరూ మహానుభావులే. జనరల్గా నాగయ్యగారు చేసినవి తక్కువ, మహదేవన్‌గారు చేసినవి ఎక్కువ.

నేను కాకినాడలో చదువుకుంటున్న రోజుల్లో (1974) మహదేవన్ గారికి స్వరబ్రహ్మ బిరుదు ఇచ్చిన సందర్భంగా పెద్ద సన్మానం చాలా వైభవంగా జరిగింది. అపుడు మేము స్కూలుకు వెళ్ళేవాళ్ళం. ఆయన సన్మానం సందర్భంలో ఆయనకు గండపెండేరం తొడగడం, పుష్పాభిషేకం, ఊరేగించడం అవన్నీ ఇంకా పూర్తి డిటైల్స్ తెలియదుగానీ, ఈ బృహత్తర కార్యక్రమంలో స్వర్ణకలశంతో ఆయన కాళ్ళు కడిగే అదృష్టం మా తల్లిదండ్రులకు దక్కింది. ఇదినేను చాలా ఆనందపడే విషయం.

ఆ తర్వాత రేడియోలో రెగ్యులర్గా ఆయన పాటలు వినటం. అవన్నీ క్యాసెట్ల రూపంలో కలెక్టు చేసుకోవడం.

ఇంకో కొత్త విషయం చెబుతాను అంటే వేరే విషయం చెప్పి మళ్ళీ ఇందులోకి వస్తాను.

చక్రవర్తి గారి వద్ద అసిస్టెంట్స్‌గా ఉన్న రోజుల్లో 'రావుగారిల్లు' అని నాగేశ్వరరావుగారు నటించిన సినిమాకు కంపోజింగ్ జరిగింది. తరణి అనే అతను డైరెక్టరు, చక్రవర్తి గారు మ్యూజిక్, యార్లగడ్డ సురేంద్ర నిర్మాత.

అపుడు కంపోజింగ్ జోరుగా ఉండేది. రెండు మూడు రోజులైనా ట్యూన్ ఓకే కావటం లేదు. బ్రేక్‌లో చక్రవర్తిగారు మమ్మల్నందరిని అసెంబుల్ చేయించి "నేనోవిషయం చెబుతాను- తరణి, యార్లగడ్డ సురేంద్ర వస్తున్నారు. పాపం వాళ్లిద్దరూ మంచివాళ్ళు. వారితోపాటు ఇంకోడు వస్తున్నాడురా వాడు పరమ కిలాడీలాగా ఉన్నాడు. కళ్ళజోడు పెట్టుకొని కూర్చుంటున్నాడు. గోడకి చేరబడి ఉంటాడు. మీరు గమనించారో లేదో వాడెవడో అసిస్టెంట్ డైరెక్టరు కాదు ఏమీ కాదు ఎందుకొస్తున్నట్టు! వాళ్లకి ఫ్రెండ్ అనుకుంటాను. నేను గమనించాను మీరు గమనించారో లేదో మనం ట్యూన్ పాడుతుంటే సురేంద్ర, తరణి వాడి కళ్ళవైపు చూస్తున్నారు. వాడు లైట్‌గా ఇలాఇలా అంటున్నాడు. అలా అనేసరికి ట్యూన్ ఓకే చేయటం లేదు. అంటే అతని ఉద్దేశ్యం వీళ్ళు సీక్రెట్‌గా కనుక్కుంటున్నారు. అయినా ఎవడువాడు? మన ట్యూన్‌ని జడ్జ్‌చేసే అధికారం ఎక్కడిది? ఓ పని చేయండి నేను మన ట్యూన్ పాడగానే ఏం బాబు బాగుందా అని అతనికేసి తిరిగి అడుగుదాం. అపుడు ఇహ మన సీక్రెట్ వీళ్ళు కనిపెట్టారే అని 'షేమ్' అయిపోతాడు" అని ట్యూన్ ఓకే కాలేదనే ఉక్రోషంతో అన్నారు. ఒక విధంగా ఇది ఫ్యాక్టే. ఆయన కనిపెట్టింది కూడా ఫ్యాక్టే.

విధి ఎంత విచిత్రమయిందంటే ఆయనకు తెలియదండి - వాళ్ళబ్బాయి కేరీర్‌ని ఒక నాలుగైదు మెట్లు పైకి పెంచేవాడే ఆ కళ్ళజోడు కుర్రోడని.

ఆ కళ్ళజోడు కుర్రోడు ఎవరో కాదు. రామ్‌గోపాల్ వర్మ! ఆ రామ్‌గోపాల్ వర్మ మీద వారికున్న నమ్మకం. అతని టాలెంట్ మీద వారికి వున్న నమ్మకం అలాంటిది. ఏమయ్యా ట్యూన్ బాగుందంటావా అని వాళ్ళు వాల్యూబుల్ ఒపీనియన్ తీసుకోవడం. ఆ తీసుకోవడం అనే ప్రాసెస్ ఎవరికైనా తెలిస్తే ఏమనుకుంటారో అని వాళ్ళు సైగలు చేసుకోవడం జరిగిందన్నమాట.

ఆ తర్వాత రామ్‌గోపాల్ వర్మ తీసిన 'గాయం' సినిమా ద్వారా చక్రవర్తిగారబ్బాయి శ్రీకి ఎంత పేరు వచ్చిందో మనకందరికి తెలుసు.

మా నాన్నగారికి డైరెక్టరు అవ్వాలనే

జీవితాశయం. అది ఇంకా సరిగ్గా నెరవేరలేదండి. ఆ ప్రయత్నాల్లో సాయి కృష్ణ కేశవరావుగారు అనే చాలా పేరున్న డిస్ట్రిబ్యూటర్. పార్టనర్‌గా మేం కొంత డబ్బుపెట్టే కండిషన్‌మీద వెంకటేశ్వరస్వామి సబ్జెక్ట్ ఒకటి ఏడుకొండలవాడు అనే టైటిల్‌తో మొదలు పెట్టాం. నాన్నగారు స్టోరీ- స్క్రీన్‌ప్లే- డైరెక్షన్ , మహదేవన్ గారు మ్యూజిక్ .1982లో మేం ఇంకా మద్రాసులో పూర్తిగా సెటిల్ అవ్వలేని రోజుల్లో ఇలాంటి వెంచర్ ఒకటి జరిగింది. అది రికార్డింగ్ కూడా జరగకుండా ఆగిపోయింది. సాయికృష్ణ కేశవరావుగారికి గుండెనొప్పి రావడం వారు చనిపోవడం జరిగింది. ఆటైంలో అన్నమాట.

నేను మ్యూజిక్ చేస్తే బాగుండునని నాన్నగారి ఉద్దేశ్యం. మా అబ్బాయి మ్యూజిషియన్ అని తెలుసు కొత్తవారితో మేం రిస్క్‌తీసుకోలేం అని పార్టనర్స్ అన్నారు. ఇప్పటిలాగా కొత్తవారికి అవకాశాలు సులువుగా దొరికే రోజులు కావు. సరే మ్యూజిక్‌లో వేరే ఎస్టాబ్లిష్డ్‌వారిని పెడదామంటే -సరే మా అబ్బాయి కాకపోతే మహదేవన్ గారంటే ఇష్టమండి వేరే ఎవరొద్దండీ. వాడికి మహదేవన్ అంటే ఇష్టం. అని మానాన్నగారంటే మహదేవన్ గారిని పెట్టారు. మహదేవన్ గారిని డైరెక్టుగా మీట్ అవ్వడం అనేది ఫస్ట టైం. సాయికృష్ణ ఆఫీసులోనే కంపోజింగ్‌లు. మహదేవన్‌గారు పుహళేందిగారు వచ్చేవారు.

రామ్‌గోపాల్ వర్మ తర్వాతి రోజుల్లో వేసిన కళ్ళజోడు కుర్రోడు వేషం అప్పుడే వేశాను. తమాషాగా నాకు కూడా కళ్ళజోడు ఉన్నాయి. మహదేవన్‌గారు కూడా కళ్లజోడు కుర్రాడు గురించి మాట్లాడుకున్నారో ఏమో! (ఇలా నాలుగైదుసార్లు రిపీట్ అయితే ఎవరైనా కనిపెట్టేస్తారు.)నెక్స్ట్ ట్యూన్ ఏదన్నా కట్టినప్పుడల్లా నావైపు తిరిగి "ఎలావుంది?" అని అడిగేవారు. ఇందులో విశేషమేమిటంటే ఆయన అఫెండ్ కాలేదు.

'బాగుందండీ' అని నేను అంటూండగానే, నాన్నగారు నేను ఆల్‌రెడీ ఆ సబ్జెక్ట్ కోసం కట్టిన ట్యూన్ పాటలు వినిపించి "సార్ ఏమన్నా కొంచెం ఈ టైప్‌లో వస్తుంటారా?'' అని భయభక్తులతోనే అడగడం, "బాగుంది, దీన్నే కొంచెం మారుద్దాం"అని ఆయన అనటం. జీవితంలో మరచిపోలేని సంఘటనలు. అంతటి మహానుభావులు మనం చేసినదానిని పెద్దమనసుతో యాక్సెప్ట్ చేయడం గొప్ప విషయం.

తర్వాత ఇంకోపాట కంపోజ్ చేయాల్సినపుడు ఆయన "ఓ పని చేయి. నీవే ఓ ప్లాన్ వేసుకొనిరా" అన్నారు. పుహళేందిగారితో " ఎలాగో మనం చేసింది వీళ్ళు ఇతనికి రిఫర్ చేయడం. 'ఒకసారి ఇది వినండి సార్' అని ఈ అబ్బాయితో పాడించడం జరుగుతున్నాయి. దానికంటె ఇదే మంచిది." అని, నాతో "నీవే ప్లాన్ వేసుకొనిరా బాబూ, చెబుతాను" అనేవారు. సరే ఆ సినిమా మధ్యలోనే ఆగిపోయిందనుకోండి. అది వేరేవిషయం.

ఆ రోజుల్లోనే ఓ కంపోజింగ్ వాళ్ళింట్లో కూడా చేశాం. చేసినపుడు ఆయనతో ఎప్పటినుండో మెదలుతున్న నా మనసులోని భావం ఆయనతో షేర్ చేసుకుందాం అనుకుని సరదాగా మాట్లాడుతూన్న ఆయన్ని కదిపి "ఏవండీ, శంకరాభరణం రిలీజ్ అయిన కొత్తలో దాంట్లో ఉన్న మంచిని గ్రహించకుండా, 'ఎంతగొప్ప కళాఖండం అది ఎంతమందిని కరిగించింది' అన్నది విస్మరించి కొందరు మ్యూజిషియన్స్ విమర్శించారండి. అందులో అదిలేదు ఇదిలేదు అని. నాకు చాలా బాధ కలిగింది.'' అని అన్నాను. "నీకేం తెలుసు బాబూ, అటకచూడు. కొన్ని వేల ఉత్తరాలు



వచ్చినాయి. అవన్నీ దాచిపెట్టాను'' అని అన్నాడాయన. అదొక ఇన్సిడెంట్.

మహదేవన్‌గారి లేటర్ స్టేజి చూసి నేను చాలా బాధపడతాను. పాపం వయసు చాలా ఎక్కువైపోయిఆయన అయోమయంలో పడిపాయారు. 82 ఏళ్లు దాటాక ఆయనకి సహస్రచంద్రోదయం అనే ఫంక్షన్ చేశారు. అధికమాసాలతో సహా వెయ్యి పున్నమిచంద్రులను చూసినవారికి ఆ ఫంక్షన్ చేస్తారు. నేను ఆ ఫంక్షన్‌కు హాజరయ్యాను. వారు సినిమావారిని ఎక్కువగా పిలువలేదు. సినిమావానిగా కాకుండా ఆయన్ని అభిమానించే వ్యక్తిగా నన్ను పిలిచారు. ఆయన ఫ్యామిలి చాలా పెద్దది. ఫ్యామిలీ మెంబర్స్ అందరి మధ్యలో జరిగిన ఫంక్షన్‌లో నేనుకూడా ఉన్నాను. అంటే వాళ్ళు నన్ను ఫ్యామిలి మెంబర్‌గా గుర్తించారని గ్రహించి చాలా ఆనందించాను. కానీ అయన పరిస్థితి చూస్తేనే బాధ వేసింది.

నేను తమిళంలో ఫస్టచేసిన పాట సినిమా'పాట్రుంట్ దిట్టన్' క్యాసెట్ రిలీజ్ అయింది. దాన్ని గురువుగారికి ఇచ్చి ఆశీర్వాదం పొందుదాం అని తీసుకెళ్ళి ఇస్తే, ఆయన క్యాసెట్ ఏమిటో, మనుషులు ఎవరొచ్చారో కూడా గుర్తుపట్టలేని స్థితిలో ఉన్నారు. చిన్నపిల్లవాడికి ఒకవస్తువు ఇస్తే ఎలా ఆడుకుంటాడో అలా క్యాసెట్ తిరగేసి మరగేసి చూస్తుంటే అది చూసి నాకు దుఖం పొంగుకువచ్చింది. ఏ వ్యక్తి మ్యూజిక్‌ని మనం ఇష్టపడి, అవి వింటూ మన నాలెడ్జి పెంచుకుంటూ పైకివచ్చి, కష్టపడి ఏదో ఒక అవకాశం దొరకబుచ్చుకుని, ఒక స్టేజికి వచ్చినపుడు, మన విజయాన్ని ఆయనకు చూపించి ఆశీస్సులు అడగబోయినప్పుడు, ఆ వ్యక్తికి ఏమీ తెలియని పరిస్థితిలో ఉంటే బాధ కాక ఇంకేం కలుగుతుంది? బాధతోనే పాదాలకు నమస్కారంచేసి వెళ్ళిపోయాను.

ఆ దశలో ఒక ఏసీ రూంలో ఆయన రెస్ట్ తీసుకుంటూ ఉండేవారు. ఆయనకు ఏంకావాలన్నా ఫ్యామిలీ మెంబర్స్ చూడ్డం జరిగేది. అంతే! ఆల్‌మోస్టు రిటైర్డ్. ఇంకేం లేదు, చిన్నపిల్లవాడితో సమానం. చిన్నపిల్లవాడికి ఏమితెలుస్తుంది? ఆ వయసులో హెల్త్ ప్రాబ్లమ్‌తో బాటు మానసిక స్థితికూడా అలా ఉండడం నన్ను చాలా బాధించిన విషయం.

ఇలా నేను మహదేవన్ గారి విషయంలో రెండుసార్లు బాధపడ్డాను - మొదటిసారి 'శంకరాభరణం' విషయంలో క్లాసికల్ మ్యుజీషియన్స్ విమర్శించినపుడు. నాది బాధకాదు,.. కోపం. ప్రజలకు చేరువ కావడం గురించి క్లాసికల్ మ్యూజిషియన్స్‌కి ఏం తెలుసు? అని కోపం. అలా విమర్శించిన క్లాసికల్ మ్యూజిషియన్స్‌ని ద్వేషించడం అప్పటినుంచే మొదలుపెట్టాను. క్లాసికల్ మ్యూజిక్‌ని మాత్రం కాదు. క్లాసికల్ మ్యూజిక్ అంటే ఎంత ఇష్టమో. క్లాసికల్ మ్యూజిషియన్స్ అంటే అంత ద్వేషం: మార్పు సహించలేని క్లాసికల్ మ్యూజిషియన్స్ నూతిలో కప్పలని నా అభిప్రాయం. రెండో విషయం - నేను పైకి వచ్చేసరికి ఆయన పెద్దాయన అయిపోయినారు. నా ఆనందాన్ని ఆయనతో పంచుకోలేకపోయాను. అని.

మహదేవన్‌గారి మ్యూజిక్‌లో ముఖ్యంగా నేను గ్రహించిన ప్లస్ పాయింట్ ఏమిటంటే బ్రీఫ్‌గా చెప్పడం. విషయాన్ని నాన్చకుండా చెప్పడం ,.నాన్చకుండా చెప్పడం అనేది ఏదైతే ఉందో దాన్ని మ్యూజిక్‌లో అప్లయ్ చేయడం. స్ట్రయిట్‌గా పాయింట్‌కి వచ్చేస్తాడాయన. సందర్భం వచ్చినపుడు మ్యూజికల్ ఎక్స్‌టెన్షన్ చేయవచ్చు. కానీ వ్యక్తులకు చూపించి ఇంప్రెస్ చేయాలనిచెప్పి ఎక్స్‌ట్రాగా సంగతులు వేయడం కాని, వాయిద్యాల హోరు పెంచడం గానీ ఏమీ వుండవని నా తాత్పర్యం.

ఆయన జీవితం లాగే ఆయన సంగీతమూ సింపుల్. ఆయనను అభిమానించిన నేను సంగీతంలో ఆ సింపుల్‌సిటి పట్టుకోగలిగాను అని నా ఫీలింగ్. ' మీ పాటల్లో లిరిక్ వినబడుతూంటుంది. లిరిక్ వినబడటం అనేది

మైనస్ పాయింట్ అని నాకు చెప్పినవారు కూడా ఉన్నారు. లిరిక్ ఏందుకు వినబడుతుందంటే - లిరిక్ డామినేట్‌చేసే ఆర్కెస్ట్రా ఉండదు కాబట్టి. సింపుల్‌సిటికి ప్రాధ్యానత ఇస్తూ వెళితే లిరిక్ హాయిగా వినబడుతుంది.

కెరియర్ పరంగా నేను ఆయననుంచి నేర్చుకున్నది, జీవితంలో అమలుపరుస్తున్నదీ కూడా ఒకటుంది. అదేమిటంటే, రన్నింగ్ రేసులో అవసరానికి మించి ఉండకూడదు అనేది. నా జీవితం ఇళయరాజాగారి జీవితంలా ఉండాలని నేను కోరుకోను.

ఎందుకంటే మహాభారతయుద్ధం అంతా పూర్తయిపోయిన శ్రీకృష్ణ నిర్వాణం తర్వాత అర్జునుని గతి గుర్తుకువస్తుంది. శ్రీకృష్ణుడి మరణం తర్వాత ఆయన పదహారు వేల భార్యలను ఒకచోటనుంచి మరోచోటికి తీసుకెళ్లే బాధ్యత అర్జునునిపై పడుతుంది. బందిపోటు దొంగలు వచ్చి మీదపడతారు. రోడ్డు స్థాయి ఆ దొంగలు, కౌరవులు ఆ స్టేచర్‌కాదు - కర్ణుడిలాటి మహామహానుభావులెందరినో నేలకూల్చిన అర్జునుడు. బందిపోటు దొంగలను హత మార్చుదాం అని బాణంతీయబోతే చేతులు లేవలేదు. మంత్రాలు గుర్తుకురాలేదు. అంతా అయిపోయింది. ఆయన టైం అయిపోయింది. దొంగలనేమీ చేయలేకపోయాడు. అపుడు గోపికలంతా కంగారుగా నదిలోకి పరిగెత్తి ఒక్క మునుగు మునిగేనరికి మహాఋషులయిపోయి తమ మానం కాపాడుకున్నారనుకోండి, అది వేరే కథ. ఇక్కడ సందర్భం ఏమిటంటే, అర్జునుడి దుర్గతి.

ఇళయరాజాగారిది రీచయిన స్టేజి. ఆయన స్టాండర్డ్‌కు ఇపుడొస్తున్న అతి సామాన్యమైన మ్యూజిక్ డైరెక్టర్స్‌తో పోటీ పడాల్సిన అవసరం మ్యూజికల్‌గా లేదు. ఫైనాన్సియల్‌గా అవసరం ఉందేమో నాకు తెలియదు. కానీ అడపాదడపా మ్యూజిక్ ఇస్తున్నారు. ఆ మ్యూజికు కూడా బాగోడం మానేసింది. 'వల్లి' (1993) అనే సినిమా చూశాను. నాకు ఆయన మ్యూజిక్ నచ్చిన ఆఖరి సినిమా అది. ఆయన ఈ పదిసంత్సరాలుగా మ్యూజిక్ చేస్తూనే వున్నారు. కానీ నాకు ఒక్క పాటకూడా నచ్చలేదు. దగ్గరగా హంసలేఖగారు ఎంతో ఆయనా అంతే!

కానీ అంతకుముందు ఆయన సృష్టించిన అద్భుతాలు ఎన్నో ఉన్నాయి. అవన్నీ నాకు జ్ఞాపకమే! ఆయన పాటలు పల్లవిలోని మొదటిలైను పాడుకుంటూ పోతే 3 గంటలు పాడుతాం. అటువంటి వ్యక్తి జీవితంలో చాలా చాలా తక్కువస్థాయి వారితో పోటిపడడం బాధాకరం. అలా పోటీపడే అవసరం ఆయనకు లేదు. వియ్యమైనా కయ్యమైనా సమానమైనవారితో చెయ్యాలనే సామెత ఉందండి. రన్నింగ్ రేసులో చేయాల్సిన అవసరం ఆయనకు లేదు.

మహదేవన్ గారు అట్లా కాకుండా ఆయన జీవితం సాఫీగా సాగింది. ఎవరితో పోటి పడలేదు. ఆయన నమ్మిన మ్యూజిక్ ఆయన అనుకున్న పద్ధతిలో హాయిగా చేశారు హాయిగా రిటైర్ అయ్యారు. మహదేవన్‌గారి లాంటి జీవితం నాకు రావాలని ఎప్పుడూ కోరుకుంటుంటాను.

అంతకంటే ఇళయరాజా గారు గ్రేట్ - కంపేర్ చేయకూడదు అనుకోండి - ఆయన ఎంతన్న గ్రేట్ అయినా కావచ్చు కానీ అటువంటి జీవితం నాకు రావాలని కోరుకోను. కంపేర్ చేయాల్సి వచ్చింది కాబట్టి ఇళయరాజాగారి గురించి మాట్లాడాల్సి వచ్చింది...అంతే! కావునా మహదేవన్‌గారి మ్యూజిక్‌నే కాకుండా ఆయన లైఫ్ స్టైల్‌ని కూడా అభిమానించేవ్యక్తిని నేను.

మహదేవన్‌గారు శహనారాగంలో చేసిన 'చూచి వలచి' అనే పాట చాలా అద్భుతమైన పాట. తర్వాత 'అహో ఆంధ్రబోజ' అనే పాట. 'ఓహో ఓహో పావురమా' ఇలా పాటల పేర్లకంటే



మంచి మనసులు, మూగ మనసులు, తేనేమనసులు, ఆత్మబలం తర్వాత శంకరాభరణం మొత్తం సినిమాపేర్లే చెప్పవచ్చు. ఆ సినిమాల్లో ఏ పాట అయినా బాగానే ఉంటుంది. అందరికి తెలిసిందే. ఆయన ఏ పాట చేసినా చాలా అద్భుతంగా చేశారు.

కమలకుమారిగారని ప్రస్థుతం చీరాలలో బోటనీ లెక్చరర్‌గా ఉంటున్నారు. ఆవిడ అంటుంటారు "కీరవాణి... నీవు మహదేవన్ గారు మహదేవన్‌గారు అంటూంటావు ఆయన పాటలు అన్నీ ఒకేలా ఉంటాయి. గ్రాఫ్ తేడా తెలియదు. రాజేశ్వరరావుచూడు వాళ్ళు చూడు వీళ్ళు చూడు ఎంత అద్భుతంగా ఉంటాయో అని. అది ఆవిడ ఫీలింగ్ అయి వుండచ్చు. మా నాన్నగారు అంటూంటారు. గేదేలు కాసేవాడు ఓ 50 గేదెలను తోలుకొని పోతుంటాడు. చూస్తే మనకు అవన్నీ ఒకేలా ఉన్నట్టు కనిపిస్తాయి. కానీ ఆ గేదెలు కాసేవాడికి వాటిలోని తేడా తెలుస్తుంది. అలాగే ఒక పాటకి ఒక పాటకి డిఫరెన్స్ ఉంటుంది. ఆయన మీద నేను బయటనుంచి విన్న నెగిటివ్ కామెంట్స్ నేను ఒప్పుకోనండి.

నేను అయననుకరిస్తూ ఎక్కడో ఒకచోట కొన్నిలైన్లు పెడుతూ ఉంటాను. 'నన్ను వదిలి నీవుపోలేవులే' అనేపాటను పట్టుకొని కొన్ని పాటలు చేశాను. భీమవరం బుల్లోడా పాటలోగాని, స్టూడెంట్ నెం1.లో ఎక్కడోపుట్టి ఎక్కడో పెరిగి పాటలో గాని, బొంబాయి ప్రియుడులోని ప్రణయమా అనే పాటలోగాని ఆయన ఇన్‌ఫ్లూయెన్స్ కనిపిస్తుంది. అలాగే సీతారామయ్యగారి మనుమరాలు లో 'కలికి చిలుకల కొలికి' అనేపాటలో ముత్యాలముగ్గు లోని ముత్యమంతాపసుపు పాట ఇన్‌ఫ్లూయెన్స్ ఉంటుంది. మహదేవన్‌గారిని ఇమిటేట్ చెయ్యాలి అని అనుకుంటూ కూర్చొను. బ్లడ్‌లో అది ఇంకిపోయింది కాబట్టి ఏదో ఒక రూపంలో బయటకి వస్తుంది. జనరల్‌గా పాత మ్యూజిక్ డైరెక్టర్స్ అందరూ ఇష్టం. రాజేశ్వరరావు, అశ్వత్థామ గారు- హిందీలో చాలా తక్కువ చేసిన మదన్‌మోహన్‌గారి రేంజ్‌కి మన అశ్వత్థామ గారిని పోల్చవచ్చు. నాకు మహదేవన్ గారు ఎలా అంటే ఎస్.డి.బర్మన్‌లాగా. చేసిన సంఖ్య ఎక్కువే వాటి క్వాలిటి ఎక్కువే, మెలోడి కూడా ఎక్కువే.

ఇంకో ముఖ్యమైన విషయం ఏమిటంటే నేను వాళ్ళింటికి ఆయన ఆశీర్వాదం కోసం వెళ్ళినప్పుడల్లా ఆశీర్వాదంతో బాటు డబ్బులు ఇచ్చేవారు. ఆయన ఇచ్చిన డబ్బును నాకు మొదటిబాబు పుట్టినపుడు మొట్టమొదట పట్టిన పాలు, ఇతర మందులు ఆ డబ్బులతోనే తేవడం జరగింది. ఆ విధంగా ఆయన ఆశీర్వాదం నాకు, నా కుటుంబా నికి, మా బాబుకి మేలు చేస్తుందని నమ్మకం. ఆ డబ్బుల చిల్లర ఇంకా ఉన్నాయి. అలాగే మా రెండో అబ్బాయికి, నేను పెంచుకున్న పాపకి కూడా ఇవ్వడం జరిగింది.

మహదేవన్ గారి సింప్లిసిటిని ఫాలో అయినవారిలో నేను తప్ప ఎవరూలేరని నేను అనుకుంటున్నాను. నేను ఆయన పాటలు వింటూంటాను ఆయన్ని ఫాలో అవుతుంటాను. బజార్‌లో రిలీజ్ అయ్యే ప్రతి మంచి క్యాసెట్‌ను, చెత్తక్యాసెట్‌ని కొని వింటూంటాను కాబట్టి నాకు తెలుసు. ఆయన్ని ఫాలో అయ్యేవారు ఎవ్వరూలేరు. నేను ఒక్కణ్ణే ఆయన్ని ఫాలో అవుతున్నాను.

ఆయన ఏ పాటనైనా తీసుకోండి అద్భుతం. అదొక జీవితసత్యం. ■

# అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం



# ఫూలోం కే రంగ్ సే


దేవ్ ఆనంద్


వహీదా




జహీదా

ఫూలోం కే రంగ్ సే, దిల్ కీ కలమ్ సే తుఝ్‌కో లిఖీ రోజ్ పాతీ
కైసే బతావూఁ కిస్ కిస్ తరహ్ సే పల్ పల్ ముఝే తూ సతాతీ
తేరే హీ సప్‌నే లేకర్‌కే సోయా, తేరీ హీ యాదోఁ మేఁ జాగా
తేరే ఖయాలోఁ మేఁ ఉల్‌ఝా రహా యూఁ జైసే కి మాలా మేఁ ధాగా

బాదల్ బిజ్‌లీ చందన్ పానీ జైసా అప్‌నా ప్యార్
లేనా హోగా జనమ్ హమే కయీ కయీ బార్
ఇత్‌నా మదిర్, ఇత్‌నా మధుర్ తేరా మేరా ప్యార్
లేనా హోగా జనమ్ హమే కయీ కయీ బార్

సాఁసోఁ కీ సర్‌గమ్, ధడ్‌కన్ కీ వీణా, సప్‌నోఁ కీ గీతాంజలి తూ
మన్ కీ గలీ మేఁ మెహకే జో హర్ దమ్ ఐసీ జుహీ కీ కలీ తూ
ఛోటా సఫర్ హో, లంబా సఫర్ హో, సూనీ డగర్ హో యా మేలా
యాద్ తూ ఆయే, మన్ హో జాయే భీడ్ కే బీచ్ అకేలా ॥బాదల్ బిజ్‌లీ॥

పూరబ్ హో పశ్చిమ్, ఉత్తర్ హో దక్షిణ్, తూ హర్ జగహ్ ముస్కురాయే
జిత్‌నా హీ జావూఁమై దూర్ తుఝ్‌సే ఉత్‌నీ హీ తూ పాస్ ఆయే
ఆంధీ నే రోకా, పానీ నే టోకా, దునియా నే హఁస్‌కర్ పుకారా
తస్వీర్ తేరీ లేకిన్ లియే మైఁ కర్ ఆయా సబ్‌సే కినారా ॥బాదల్ బిజ్‌లీ॥

చిత్రం : ప్రేమ్ పుజారి (1970)
రచన : నీరజ్
సంగీతం : ఎస్.డి.బర్మన్
అభినయం : దేవ్ ఆనంద్, జహీదా
గానం : కిశోర్ కుమార్

స్వతహాగా కవులైన వారిని సినిమా పాటల రచయితలుగా పరిచయం చేసి వారి సాహితీ సౌరభంతో తమ చిత్రాలకు ప్రత్యేకత చేకూర్చిన దర్శక నిర్మాతలు చాలామంది ఉన్నారు. కానీ సినీగీతరచయితలుగా స్థిరపడిపోయిన కవులు చాలా తక్కువ. వారు వ్రాసిన కొన్ని పాటలను తలచుకుని మురిసిపోవటమే మన పని. అలాంటి కవులలో ప్రముఖంగా చెప్పుకోవలసిన పేరు నీరజ్. ఆయన 'తేరే మేరే సప్నే', 'షర్మీలీ', 'ప్రేమ్ పుజారి' వంటి చిత్రాలకే పాటలు వ్రాశారు. వాటిలో చాలామటుకు హిట్సే. తన ఆదర్శాల కోసం ఆయన రాజకీయాలలో క్రియాశీలక పాత్ర వహిస్తూ అడపాదడపా సినీ గీతాలు వ్రాశారు. ఆయన కవిత్వ ప్రతిభకు గుర్తింపుగా భారతప్రభుత్వం ఆయనకు 1991లో పద్మశ్రీ అవార్డు ఇచ్చి సత్కరించింది.

దేవ్ ఆనంద్ తాను తొలిసారిగా దర్శకత్వం వహించిన 'ప్రేమ్ పుజారి' చిత్రానికి నీరజ్‌నే గీతరచయితగా ఎన్నుకున్నారు. ఈ చిత్రానికి సంగీత దర్శకుడు ఎస్.డి.బర్మన్. సచిన్‌దా, నీరజ్‌ల గొప్పదనం చాటే రెండు ఉదంతాలు ఈ చిత్రనిర్మాణంలో జరిగాయి. కవి అయిన నీరజ్ సినిమా పాట ఎలా వ్రాస్తారో చూడాలని సచిన్‌దా ఒక ట్యూన్ ఇచ్చి పాట వ్రాయమన్నారు. ఆ ట్యూన్ ఎన్నో హెచ్చుతగ్గులతో ఉంది. దానికి నీరజ్ వ్రాసిన పాట 'రంగీలారే తేరే రంగ్ మేఁ రంగా హై మేరే మన్'. ఆ పాట వింటే దాని సంగీత విలువలు, సాహిత్య విలువలు ఎలా చెట్టాపట్టాలేసుకున్నాయో తెలుస్తుంది.

ఇక నీరజ్ అంతక ముందే రాసిన ఓ పాటను దేవ్ ఆనంద్ ఈ చిత్రంలో

పెట్టాలనుకున్నప్పుడు సచిన్‌దా దానికి అద్భుతమైన ట్యూన్ చేశారు. ఆ పాటే 'షోఖియో౯ మే౯ ఘోలా జాయె ఫూలో౯ కా షబాబ్'. ప్రేమకు అందమైన నిర్వచనం చెప్పిన ఈ పాట ఇప్పటికీ శ్రోతలను అలరిస్తూనే ఉంది. ఇటీవల వచ్చిన 'రాక్‌ఫర్డ్' చిత్రంలో ఈ పాటను నందితాదాస్, నాగేష్ కుకునూర్‌లపై చిత్రీకరించారు. ఇక 'ఫూలో౯ కే రంగ్ సే' పాట తన హృదయాధిదేవతను తలచుకుంటూ నాయకుడు పాడే చక్కని ప్రేమగీతం.

తెలుగులో ఈ పాటలాంటి పాటలు ఉదహరించాలంటే 'సిరిమల్లె నీవే' (పంతులమ్మ), 'ఏ దివిలో విరిసిన పారిజాతమో' (కన్నెవయసు) పాటల గురించి చెప్పుకోవచ్చు. ఈ పాటలలోని భావాలు ఎంత కవితాత్మకంగా ఉంటాయో మన తెలుగు వారందరికీ తెలిసినదే. ఇదే కోవలోని పాట 'ఫూలో౯ కే రంగ్ సే'. ఇక్కడ గమనించదగ్గ మరో విషయం ఏమిటంటే ఈ పాటల పల్లవులన్నిటిలో పూవుల ప్రస్తావన ఉండటం. భావ కవిత్వంలో పూవులకున్న ప్రాధాన్యత అదీ!

విదేశాలలో ఉన్న నాయకుడు తన ప్రేయసిని తలచు కుంటూ అందరిలోనూ ఉండి కూడా తనలో తాను



పాడు కునే పాట ఇది. విదేశాలలో అందమైన ప్రదేశాలలో ఈ పాటను చిత్రీకరించారు. నాయకుడుగా దేవ్ ఆనంద్, అతని ప్రేయసిగా వహీదా రెహమాన్ నటించారు. కానీ వహీదా రెహమాన్ ఈ పాటలో కనిపించరు. మరో హీరోయిన్ అయిన జహీదా (నర్గీస్ మేనకోడలు, సినిమాలలో ఎక్కువకాలం నిలదొక్కుకోలేదు) కనిపిస్తారు.

'పాతీ' అంటే పత్రం, లేఖ. యాద్ అంటే జ్ఞాపకం. ఖయాల్ అంటే తలపు. ఉలఝ్‌నా అంటే చిక్కుపడటం. ధాగా అంటే దారం. బాదల్ అంటే మబ్బు. బిజ్‌లీ అంటే మెరుపు. పానీ అంటే నీరు. జనమ్ అంటే జన్మ. మదిర్ అంటే మది దోచేది, మత్తెక్కించేది.

**'పూవుల రంగుతో గుండె కలంతో రోజూ లేఖ రాశా నీకు**
**తెలిపేదెలాగ ఏయే విధాల క్షణక్షణం వేధించేవో నీవు**
**నీ కలలె కంటూ నిదురించినాను, నీ జ్ఞాపకాలతోనే మేల్కొన్నా**
**నీ తలపుల్లో చిక్కుపడిపోయా, దండలో దారం చందాన**
**మబ్బు, మెరుపు, గంధం, నీరు లాంటిది మన ప్రేమ**
**ఈ ప్రేమ కోసం జన్మించాలి మళ్ళీ మళ్ళీ మనం**
**ఎంతో మోహనం, ఎంతో మధురం మన ప్రేమ**
**ఈ ప్రేమ కోసం జన్మించాలి మళ్ళీ మళ్ళీ మనం'**

తన గుండెనే కలం చేసి, పూవుల రంగునే సిరాగా మార్చి ఆమెకు లేఖ వ్రాశాడు అతను. అది హృదయ సందేశం. విరహ వేదన భరించలేక 'నీవు నన్ను వేధిస్తున్నావు' అని ఆమెతోనే అంటున్నాడు. ఆమె కలల్లోకి వచ్చి వేధించింది, జ్ఞాపకాలతో వేధించింది. పూలదండలో దారంలా ఆమె తలపులతోనే ఉక్కిరిబిక్కిరి అయ్యాడతను. అంటే ఆ తలపులు పూవుల్లా సువాసన వెదజల్లుతున్నా ఆ తీయని బాధ తట్టుకోలేకపోతున్నానంటున్నాడు. ఇదో రకం నిందాస్తుతి. మబ్బు, మెరుపు, గంధం, నీరు ప్రకృతి ప్రసాదాలు. వాటిలాగ సహజమైనది వారి ప్రేమ. యుగాలు మారినా వారి ప్రేమ శాశ్వతంగా ఉంటుంది. మత్తెక్కించే ఆ మధురమైన ప్రేమకోసం మళ్ళీ మళ్ళీ తాము జన్మించాలని అతను కోరుకుంటున్నాడు.

సా౯స్ అంటే శ్వాస. సర్‌గమ్ అంటే సరిగమలు, స్వరాలు. ధడ్‌కన్ అంటే గుండె సవ్వడి. మెహక్‌నా అంటే పరిమళించటం. జూహీ కీ కలీ అంటే మల్లె మొగ్గ. ఛోటా అంటే చిన్నది. లంబా అంటే దీర్ఘమైనది. సూనీ డగర్ అంటే ఎవరూలేని దారి. మేలా అంటే సంత. భీడ్ అంటే ఎక్కువ మంది జనం. అకేలా అంటే ఒంటరి.

**'శ్వాసలో స్వరాలు, గుండె వీణానాదాలు,**
**కలల గీతాంజలి నీవే**
**హృదయపు బాటలో**
**పరిమళం చల్లే మల్లెమొగ్గవు నీవే**
**చిరుపయనమైనా, బహుదూరమైనా,**
**ఎవరూ లేకున్నా, అందరిలో మసలుతున్నా**
**మదిలో నీవు మెదిలితే చాలు**
**మనసు మరచేను అంతా'**

ఆమె అతని శ్వాసలో సరిగమల్లా ఒదిగింది, గుండెలో వీణానాదంలా పలికింది, అతని కలల్ని మధురమైన గీతాలుగా మలచింది. అతని హృదయంలో పరిమళం వెదజల్లే మల్లెమొగ్గయి నిలిచింది. అతను ప్రయాణంలో ఉన్నా, ఎవరూ లేని చోట ఉన్నా, అందరి మధ్యలో ఉన్నా ఆమె గుర్తు వస్తే చాలు అతని మనసు అన్నీ మరచిపోయి తనదైన లోకంలో విహరిస్తుంది.

'పూరబ్' అంటే తూర్పు. ముస్కురానా అంటే చిరునవ్వు నవ్వటం. దూర్ అంటే దూరం. పాస్ అంటే దగ్గర. ఆంధీ అంటే గాలివాన. తస్వీర్ అంటే చిత్తరువు, రూపం. కినారా అంటే ఒడ్డు.

**'తూర్పు పడమర ఉత్తరం దక్షిణం అన్నివైపులా నీ నవ్వే**
**నీ నుంచి నేనెంత దూరమైతే నీవంత దరి చేరుతావే**
**వాన అడ్డు వచ్చె, వరదొచ్చి ఆపె, లోకమే నను చూసి నవ్వె**
**ఐనా నీ రూపు నేను మదిలోన దాచి అందరికీ దూరంగా వచ్చా'**

ఏ వైపు చూసినా ఆమె చిరునవ్వు నవ్వుతున్నట్టే అనిపిస్తుంది అతనికి. అంటే ప్రకృతి అందాలలో ఆమె రూపమే కనిపిస్తుంది. ఆమె నుంచి అతను ఎంత దూరం వెళ్ళినా ఆమె అతనికి అంత దగ్గరవుతోంది. అతని హృదయానికి అంత చేరువవుతోంది. వాన, వరద లాంటి ఎన్ని అవాంతరాలొచ్చినా, లోకమే తనను చూసి నవ్వినా లెక్కచేయకుండా ఆమె తలపుల్లోనే తనువ్వూమరచిపోతున్నా డతను.

తన కెరియర్ ప్రారంభం నుంచి దేవ్ ఆనంద్‌కు నేపథ్యగానం చేసిన కిశోర్‌కుమార్ గాయకుడిగా రెండో ఇన్నింగ్స్ ప్రారంభించాక దేవ్ ఆనంద్‌కు పాడి సూపర్‌హిట్ చేసిన చిత్రం 'ప్రేమ్ పుజారి'. ఆ తర్వాత 'హరే రామా హరే కృష్ణా'లో కూడా చక్కని పాటలు పాడారు.

**-పి.వి.సత్యనారాయణ రాజు.**

# రాజా ఆడియో రివ్యూ

హరికృష్ణ, సిమ్రాన్, సౌందర్య కాంబినేషన్‌లో బొమ్మరిల్లువారి పతాకంపై దర్శక నిర్మాత వై.వి.యస్.చౌదరి నిర్మించిన 'సీతయ్య' ఆడియో క్యాసెట్ విడుదలయింది. సంగీత దర్శకుడు కీరవాణి అందించిన మరో మ్యూజికల్ హిట్ యిది. ఇందులోని 9 పాటలలో 3 పాటలను డాక్టర్ సి. నారాయణరెడ్డి, 6 పాటలను చంద్రబోస్ రాశారు.

ఉదిత్ నారాయణ్, చిత్ర పాడిన 'అమ్మతోడు నాన్నతోడు నినుపుట్టించిన బ్రహ్మతోడు' పాట వింటుంటే- ఇదే సంస్థ నిర్మించిన 'లాహిరి లాహిరి లాహిరిలో' చిత్రంకోసం కీరవాణి స్వరపరిచిన 'కళ్ళలోకి కళ్ళుపెట్టి చూడలేకున్నా' పాటలోని తాళగతి గుర్తొస్తుంది. సాహిత్యపరంగా చూస్తే... దీపావళి-ధూపావళి, ఏకాదశి-కేకాదశి వంటి పదప్రయోగాలతో పాటు బిల్లంగోడు, ఓమనగుంట, కోలాటాలు, దాగుడుమూతలు వంటి ఆటలతో చంద్రబోస్ చక్కగా 'ఆడుకున్నాడు!'

సినారె రాయగా బాలు పాడిన 'ఇదిగో రాయలసీమ గడ్డ' పాట క్యాసెట్‌లో ద్వితీయగీతం- శ్రేణిలో అద్వితీయ గీతం! పాటంతా విన్నాక- ఇది సినారె తప్ప ఎవరు రాయగలరు? ఇలా బాలూ తప్ప ఎవరు పాడగలరు- అని అనిపించని తెలుగువారెవరైనా వుంటే వారిలో ఏదో లోపం వుందన్నమాట. తిరుపతి వెంకటేశ్వరస్వామి, శ్రీశైలమల్లన్న, లేపాక్షి బసవన్న, చంద్రగిరి దుర్గం, భక్తకన్నప్ప, శ్రీకృష్ణదేవరాయలు, అన్నమయ్య కృతులు, వీరబ్రహ్మేంద్ర స్వామి తత్వాలు వీటన్నిటితో హృదయాన్ని రసానుభూతితో ముంచెత్తుతూ కొందరు దేశభక్తుల పేర్లను పేర్కొంటూ రాయలసీమ ఔన్నత్యాన్ని సినారె ఆవిష్కరించిన తీరుకి కళ్ళు జలదరిస్తాయి.. గుండె ఉప్పొంగుతుంది. ఇక ఇందులో దేశం కోసం త్యాగం చేసిన వారిని పేర్కొంటూ ఉదహరించిన కడప కోటిరెడ్డి, గాడిచర్ల కల్లూరి, సదాశివం పప్పూరి, హంపణ్ణ, లింగణ్ణ, షేక్‌పీర్ రబియాబి పేర్లను వింటుంటే- పాటల రచయితకి భావనా బలం, భాషా సౌందర్యంతో పాటు విషయ పరిజ్ఞానం కూడా ఉంటే పాట ఎంత గొప్పగా రూపుదిద్దుకుంటుందోనన్న విషయం అవగాహన కొస్తుంది. ఈ సంవత్సరానికి సంబంధించిన ప్రభుత్వ ప్రైవేట్ అవార్డులలో చాలాభాగం ఈ పాటకే వస్తే ఆశ్చర్యపడాల్సిందేం లేదు.

అనూరాధా శ్రీరామ్ ముఖ్యగాయనిగా పాడిన 'ఒక్కమగాడు' పాట ఒక బ్రహ్మాండమైన హిట్ సాంగ్! ఆడియోలు, సీడీలు, పైరసీలు, డౌన్‌లోడింగ్ ఫెసిలిటీలు లాంటివేవీ లేకుండా కేవలం కంప్యూటర్ ద్వారా మాత్రమే వినగల పద్ధతి అంటూ ఉంటే ఈ పాటకి ప్రతిరోజూ కొన్నివందల, వేల క్లిక్‌లు ఉంటాయి. అంతటి ఆకర్షణ ఉందీ పాటలో. నూటికి రెండువందల మార్కులు సంపాదించుకోగల ఈ పాటలో వంద మార్కులు కీరవాణివి మిగిలిన వందలో యాభై చంద్రబోస్‌వి యాభై అనూరాధా శ్రీరామ్‌వి. మల్లీశ్వరిలోని 'ఆకాశవీధిలో' పాటను గుర్తు చేసే ఓపెనింగు, శ్రీకృష్ణపాండవీయంలోని 'స్వాగతం సుస్వాగతం' పాటలోని 'ధరణి పాల శిరోమకుట మణి తరుణ కిరణ పరిరంజిత చరణా/ కదనరంగ బాహుదండ ధృతగదాప్రకట పటుశౌర్యాభరణా' అనే వాక్యాలను గుర్తుచేసే విధంగా రూపొందిన చరణాల ముగింపు ఈ




**విడుదల: ఆదిత్య**
**వెల : రూ.38/-**

పాటకు చేకూరిన అదనపు ఆకర్షణలు. సుగుణాభి రాముడు సమరాన భీముడు అనే పల్లవికి అఠాణా రాగాన్ని అందంగా కలుపుకున్న ఈపాట అన్ని వయసులవారిని ఆకట్టుకోగలదు.

ఏసుదాసు గారబ్బాయ్ విజయ్ ఏసుదాస్, సునీత పాడిన 'సమయానికి తగు సేవలు సేయనీ' పాట హాయిగా వినిపించే పాట. మధ్యమావతి రాగం ఆధారంగా రూపొందిన ఈ గీతంలో 'స్కీమింగు' అని తెలియని విధంగా సేవలతో చంద్రబోస్ చేసిన స్కీము ప్రశంసనీయమైన స్థాయిలో ఉంది. చూలాలికి జరిగేను జోలాలిసేవ లాంటి చక్కటి ప్రయోగాలు చేశాడాయన ఈ పాటలో. అంతేకాదు సినారె అంతటి వ్యక్తితో పాటు తన పేరుకూడా టైటిల్ కార్డ్‌లో వుంటుంది కనుక ఆ స్థాయికి తగిన విధంగా తన రచన వుంటే బావుంటుందేమోనన్న మెలకువ, తపన, కృషి అంతర్లీనంగా గోచరిస్తూ వుంటుంది ఈ పాటలో.

ఎస్.పి.బాలు, కీరవాణి పాడిన 'పైరుకోయిల కూసింది, పల్లె దరువులు వేసింది' పాట, కీరవాణి పాడిన 'ఎవరిమాట వినడు సీతయ్య' పాట- పల్లెపట్టు పదాలతో పాటలను రాయాలన్నా, ప్రౌఢత్వాన్ని నింపుకున్న పదాలతో పాట రాయాలన్నా తనదైన ముద్రను స్పష్టంగా చూపించగలిగే సి.నారాయణరెడ్డి ఈ రెండు పాటలకు రచన.

'ఆదిశంకరుల సౌందర్యలహరి' అనే మకుటంతో ప్రారంభమయ్యే పాట- చాలా మంచి పాట...! కీరవాణి- చంద్రబోస్ - చరణ్- సునీత కాంబినేషన్‌తో గంగోత్రిలోని 'గంగా - నీ ఉరుకులే రాగంగా' పాట తర్వాత వెలువడ్డ మరో మంచి పాట. పట్టాల్సిన పిచ్చే ప్రేమరా - పుట్టాల్సిన చిచ్చే ప్రేమరా/ చెయ్యాల్సిన తప్పే ప్రేమరా- తెలియాల్సిన నొప్పే ప్రేమరా/ తిరగాల్సిన మలుపే ప్రేమరా - తీయాల్సిన తలుపే ప్రేమరా/ ఎదగాల్సిన ఎత్తే ప్రేమరా- కలగాల్సిన మత్తే ప్రేమరా వంటి వాక్యాలు, రసవర్ధీత, మమతల తులసిదళం, పాడుతుంది ప్రేమ ఊపిరి కచ్చేరిలో, ఇలా ఎన్నో మంచి మంచి ప్రయోగాలతో చంద్రబోస్-; బాలు గళంలోని జిలుగులన్నిటికి నిజమైన వారసుడిగా రూపుదిద్దుకుంటున్న చరణ్-; రెండవ చరణంకి ముందు ఇంటర్‌లూడ్‌లో వీణతో సమానంగా ఆలపిస్తూ సునీత- జీవంపోస్తే వీరందరికి చైతన్యాన్నిచ్చే విధంగా ట్యూన్‌ని మోహన రాగంలో సమకూర్చిన కీరవాణి పాటకు వెన్నుదన్నుగా నిలిచారు.

శ్రియాఘోషల్, కీరవాణి పాడిన 'సిగ్గేస్తుంది నిను చూస్తుంటే' పాట భలే హాయైన పాట. బృందావన సారంగ రాగం ఆధారంగా ఈ పాట మలచబడింది అన్న విషయం తెలిస్తే ఆ రాగంతో పరిచయం ఉన్నవారు ఆనందాశ్చర్యాలతో మునిగిపోయేటంత తమాషాగా ఈ పాటను స్వరపరిచారు కీరవాణి. మొత్తం పాటనంతటినీ 'సిగ్గు'తో స్కీమ్ చేసిన చంద్రబోస్‌ని 'అడ్డగోలు సిగ్గు' అనే ప్రయోగం 'గర్వంగా' నిలబెడుతుంది.

చంద్రబోస్ రాయగా బాలు, చిత్ర పాడిన 'బస్సెక్కివస్తావో' పాటలో బాలూ పాడిన పద్ధతి గతంలో ఆయన స్వర్గీయ ఎన్.టి.ఆర్.కి పాడిన స్టయిల్‌ని గుర్తుచేస్తుంది. ఈ పాట పల్లవిని రీపీట్ చేస్తున్నప్పుడు 'గంగోత్రి' సినిమాలో 'వల్లంకి పిట్ట... మెల్లంగ రమ్మంటా' ఫాటలోని కొన్ని లైన్లు ట్యూన్ పరంగా జ్ఞాపకం వస్తాయి. ఇది పూర్తిగా మాస్ ఓరియెంటడ్ సాంగ్.

ఈ పాటలతో పాటు వేటూరి, కీరవాణి రచించిన రెండు చిన్ని పద్యాలు కూడా ఉన్నాయి. ఆ రెండింటినీ కీరవాణి పాడేరు.

**టోటల్‌గా ఓ మంచి ఆడియో యిది.**




"కారున్న అమ్మాయిని
పెళ్లి చేసుకున్నా"
"షావుకారు
వయ్యావన్నమాట"
"జీతం లేని డ్రైవర్నయ్యానంతే"



"బుద్ధికి - ఆవుకు పోలికేమిటి"
'రెండూ గడ్డి తింటాయి'





"ఈ కుక్క నేనొస్తే అస్సలు మొరగనే మొరగదు.... నేనంటే ఎంత అభిమానమో...!"
"కరెక్టే... స్వజాతి అభిమానం అంటే మాటలా?



విలేఖరి : మీరు పూర్వం వేదికలపై చాలా తక్కువ మాట్లాడేవారు. పెళ్లయ్యాక విజృంభిచేస్తున్నారు.... ఏంటి సంగతి?
వక్త: ఏముంది... ఇంట్లో అవకాశం లేక....




"అతను నకిలీ డాక్టరని ఎలా కనిపెట్టావు?"
"ఎక్స్‌రే చూసి నెగటివ్ పట్టుకొస్తే ఎలా, ప్రింట్ వేనుకురా అన్నాడు"

ఈ జోక్‌లను పంపినవారు ఎం.శిరీష

---

రాంకీ, వెంగళ్రావు కలసి ఓ హోటల్‌కి వెళ్లారు. వెంగళ్రావు టిఫిన్ చేస్తూ ఎదురుగా గోడకి వున్న అద్దాల్ని చూసి ఒక్కసారి షాకై కుడిచేత్తో తినడం మాని ఎడమ చేత్తో తినడం మొదలుపెట్టాడు.

"అదేంట్రా యాచేత్తో తింటున్నావ్" అడిగాడు రాంకీ

"నేను టిఫిన్ చెయ్యడం ఎవరైనా అద్దంలో చూస్తే ఎడం చేత్తో తింటున్నానని అనుకోర్రా... అందుకే ఇలా తింటున్నాను"అన్నాడు సార్థకనామధేయుడు వెంగళ్రావు.



ఈ జోక్‌ను పంపినవారు : తెలికిచర్ల రామకృష్ణ, విజయనగరం.

---

ఓ సిన్మా హీరోయిన్‌కి ద్వితీయ వివాహ వేడుకలు జరుగుతున్నాయి.

"రండి!" అంటూ హీరోయిన్ నవ్వుతూ ఆహ్వానించింది తన ఫ్యామిలీ లాయర్ని.

"కంగ్రాట్స్... మేడమ్... ఈ విడాకుల కేసు కూడా నాకే ఇవ్వాలి సుమా!" అని విష్‌చేసి డైనింగ్ హాలు వైపు వెళ్లాడా లాయరు.





"లీవెందుకయ్యా ఇంత అర్జంటుగా"
"రెస్ట్ కోసం... సార్"
"నువ్ భలే పిచ్చోడి వయ్యా... ఇక్కడ ఆఫీసున్నది దేనికి?" అని ఆవులిస్తూ, లీవ్‌గ్రాంట్ చేసాడా ఆఫీసరు.

అవుట్‌డోర్‌లో షూటింగ్ గ్యాప్‌లో కుర్చీలో కూర్చుని వున్న హీరోయిన్తో, ఓ అభిమాని పరుగెత్తికొచ్చి

"మేడమ్ నేను మీ అభిమానిని... నిన్న రాత్రి మీరు నా కలలో కొచ్చారు కూడా!" అని అన్నాడు.

"అలా కుదర్దే... ఏం పియ్యే... నిన్న డేట్స్‌ని వీరికి మనం కాల్షీట్స్ యివ్వలేదు కదా... మరి నేనెలా వచ్చాను వీరి కలలోకి !?" అంటూ అడిగిందా హీరోయిన్ పక్కనే వున్న తన పి.ఎ. వంక ఆశ్చర్యంగా చూస్తూ...



## హ్యూమర్ బాక్స్

“ఏమ్మా... డాక్టరుగార్ని యిలా తీసుకొచ్చావ్?” అడిగాడు సైక్రియాటిస్ట్, డాక్టరు గారి భార్యని.

“ఏం లేదండీ... ఈయన డాక్టరుద్యోగానికి పూర్తిగా అంకితమయిపోయారు... ఏదో నరసం కొద్దీ చెయ్యిపట్టుకోమన్నానంతే... ఫీజివ్వమని నన్ను కూడా అడిగేస్తున్నారండి!” అందా ఇల్లాలు కళ్లొత్తుకుంటూ.






“ప్రతీ మగాడి విజయం వెనుక ఓ స్త్రీ వుంటుం దంటారు కదా... అలాగే ప్రతీ గాయకుని విజయం వెనుక ఏముంటుందో తెలుసా?”

“ఉ. తెలుసు!”

“ఏమిటి?”

“తలుపులకి గడియలేని బాత్‌రూం!”



“ఇప్పటికీ స్వాతంత్ర్యాన్ని పూర్తిగా పొందలేని భారతీయులెవరైనా ఈ దేశంలో ఉన్నారంటారా?

“లేకేం... బోలెడంత మంది ఉన్నారు”

“ఎవరు వాళ్లు”

“పెళ్లయిన మగాళ్లు!”

**ఈ జోక్‌లను పంపినవారు లకనం మూర్తి, కాకినాడ.**

---

“ఏవండీ! నేను పాడుతాను, మీరు తాళం వేస్తారా” అడిగింది ఆండాళ్లు

“ఓ అలాగే! మొదలెట్టు” అని ఆవిడ పాటందుకోగానే లేచి గది బయట గొళ్లెం పెట్టి తాళం వేసి వెళ్లిపోయాడా భర్త.



**ఈ జోక్‌ను పంపినవారు అద్దంకి సీతాదేవి, హైదరాబాద్.**



“ఆ ఊరేగింపు ఏంటి?”

“జేబుదొంగల ర్యాలీ”

“ఎందుకూ”

“బ్లేడ్ల ధర తగ్గించాలట”

“వర్షం పడేటప్పుడు మెరుపులు ఎందుకు మెరుస్తాయి?

“భూమి ఎక్కడైనా తడవకుండా పొడిపొడిగా ఉండిపోయిందేమోనని ఇంద్రుడు పరీక్షిస్తూ ఉంటాడేమో బహుశా!”





రాజకీయ నాయకుడు : ఏమయ్యా సెక్రటరీ! ఇంత పెద్ద ప్రసంగం రాసావేమయ్యా! సభలో అంతా విసుక్కున్నారు.

సెక్రటరీ : లేదు సర్! నేను రాసిన ప్రసంగం చాలా చిన్నదే! పార్టీ ఆఫీసు కోసం, మన కోసం తీయించిన జిరాక్స్ కాపీలు దానికి అటాచ్ చేసేశాను పొరపాటున.

**ఈ జోక్‌ను పంపినవారు: జి.బి.లక్ష్మి, హైదరాబాద్.**

“జీవితంలో అతను చాలా మందిని పైకి తెచ్చాడు... తెలుసా?”

“అంతగొప్పవాడా...!?”

“ఊహుం”

“అదేంట్రా...గొప్పవాడు కాదంటావ్...ఎంతోమందిని పైకి తెచ్చాడంటావ్... ఏం చేస్తుంటాడేంటి?”

“లిఫ్ట్ ఆపరేట్ చేస్తుంటాడు”



**ఈ జోక్‌లను పంపినవారు: ఎం.శిరీష, చిత్తూరు.**




విడుదల : హెచ్.ఎం.వి.
వెల : రూ.40/-




హెచ్.ఎం.వి. సంస్థ ఇటీవల చేస్తున్న చాలా మంచి పనులలో ఒకటి - అలనాటి నేపథ్య గాయకుడు ఎమ్.ఎస్.రామారావు పాడిన ఒక ప్రైవేటు గీతాన్ని, 16 సినీ గీతాల్ని కలిపి ఒక ఆడియో క్యాసెట్‌గా విడుదల చెయ్యడం! ప్రైవేటు గీతంగా పేర్కొన్న - ఈ విశాల ప్రశాంత ఏకాంత సౌధంలో నిదురించు జహాపనా - అనే గీతం 1989 లో 'నీరాజనం' అనే సినిమాలో ఉపయోగించు కున్నారు కానీ ఆ ట్యూన్ వేరు. ఎన్.టి.ఆర్. తొలి చిత్రమైన మన దేశంలోని ఏమిటో సంబంధం ఎందుకో ఈ సంబంధం, చలో చలో రాజా; జయసింహాలోని ఓ మలయపవనామా నిలు నిలు నిలుమా; లక్ష్మమ్మలోని ఇటో అటో ఎటు పోవుటో, ఊయల ఊపనా సఖీ; గంగా గౌరీసంవాదంలోని రారే చెలీ ఇటు రారే చెలీ; సువర్ణసుందరిలోని నా చిట్టిపాప నా కంటి పాప; ద్రోహిలోని ప్రేమయే కాదా సదా, ఇదే నా నీ న్యాయం; వినాయక చవితిలోని యశోదా కిశోరా; నిరుపేదలులోని అమ్మలారా విన్నారా అయ్యల్లారా కన్నరా; పిచ్చిపుల్లయ్యలోని శోకపు తుఫాను చెలరేగిందా; పేరంటాలులోని ఓ రాజా మోహనరాజా; తాహశిల్దార్‌లోని ఈ రేయినన్నొల్ల నేరవారాజా; రాజనందినిలోని హరహరపురహర శంభో; కార్తవరాయని కథలోని మిగిలింది ఒక్క క్షణం; దీక్షలోని పోరా బాబూ పో మొదలైనవి మిగిలిన 16 గీతాలు.

ఈ పాటలలో కొన్ని సోలోలు, కొన్ని బృందంతో పాడినవి కాగా మిగిలిన వాటిలో కొన్ని - గాయనీమణులుగా పేరొందిన సుశీల, వైదేహి, సరోజిని వంటి వారితో పాడినవి, కొన్ని - అలనాటి నటీమణులైన కృష్ణవేణి, జి.వరలక్ష్మి వంటి వారితో పాడినవి. ఈతరం వారికి పాత తరంలో చాలా మందికి ఎమ్మెస్ రామారావు అంటే సుందరకాండను పారాయణం చేసిన 'సుందర'దాసుగానే తెలుసు కానీ ఒక సినీ నేపథ్య గాయకుడిగా ఆయన ఎటువంటి పాటలు పాడేవారో తెలియదు. అలాగే కృష్ణవేణి, జి.వరలక్ష్మి పాడితే ఎలా వుంటుందో తెలియదు. ఆత్రేయ తొలి సినీ గీతమైన 'పోరా బాబూ పో' అనే పాటను ఆయనకు సంబంధించిన ప్రసంగాలలోనూ, వ్యాసాలలోనూ ఉదహరిస్తూ వుంటారు గానీ అసలాపాట పూర్తి స్వరూపం ఎంతోమందికి తెలియదనే చెప్పాలి. వీటన్నిటి మీద ఒక అవగాహనను పెంచుకోవాలనుకునే వారికి ఈ క్యాసెట్ ఎంతగానో ఉపయోగపడుతుంది.

ఆసక్తితో పాటు అలనాటి పాటలను భద్రంగా దాచిపెట్టుకునే వారితో పరిచయాలు, ఇచ్చి పుచ్చుకునే స్నేహాలు వుంటే ఈ క్యాసెట్‌లో గల 17 గీతాలలో 16 గీతాలు కొంచెం కష్టమైనా సరే దొరికే అవకాశం వుంది. కానీ 'దీక్ష'లోని 'పోరాబాబు పో'ను సంపాదించటం మాత్రం అతి కష్ట సాధ్యమైన పనుల్లో ఒకటి. వీటన్నిటినీ ఏక మొత్తంగా అందించటం వెనుక గల పట్టుదల, దాని వెనుక గల తపనను అర్థం చేసుకుని ప్రోత్సహించటం శ్రోతల కనీస కర్తవ్యం. ఒక విధంగా చూస్తే తెలుగు సినీ సంగీత చరిత్ర తొలిరోజుల పరిణామక్రమం కూడా ఈ పాటలలో గోచరిస్తుంది కూడా! ఏది ఏమైనా ఈ క్యాసెట్‌లోని పాటల శ్రవణం ఒక ప్రత్యేకమైన అనుభవం! ■

---




విడుదల : హెచ్.ఎం.వి.
వెల : రూ.55/-

ఒకానొక తరంలో శ్రోతలనుర్రూతలూపిన గాయని టంగుటూరి సూర్యకుమారి. ఖంగుమని మ్రోగే ఆమె కంఠం, ఆ ధాటి- ఇవాళ్టికీ కొంతమంది శ్రోతల చెవులలో రింగుమంటూనే ఉన్నాయి. ఇవాళ మనమంతా పాడుకుంటున్న 'మాతెలుగు తల్లికి మల్లెపూదండ' అనే గీతాన్ని బహుళ ప్రాచుర్యం లోనికి తెచ్చింది ఆమె కంఠమే! ప్రస్తుతం ఆమె విదేశాలలో స్థిరపడినా దేశదేశాల్లోని వివిధ ప్రాంతాలలో ఉంటున్న తెలుగువారెందరికో నేటికీ అభిమాన గాయని ఆమె.

అటువంటి స్టేచర్ కలిగిన టంగుటూరి సూర్యకుమారి పాడిన 20 ప్రైవేటు గీతాలను 'గోల్డెన్ హవర్' మకుటం కింద ఒక ఆడియో క్యాసెట్‌గా హెచ్.ఎం.వి.వారు విడుదల చేశారు.

శతపత్ర సుందరి, ఎవరు విన్నారెవరు, మామిడి చెట్టును అల్లుకొన్నది మాధవిలత ఒక్కటి, ఒంటిగా ఉయ్యాల ఊగితివా, లేపనైన లేపలేదు నామును చూపనైన చూపలేదు, ఓ... మహాత్మా ఓ మహర్షి ఏదీ చీకటి, స్వప్న జగతిలో, చిన్నదోయి నా హృదయమా సాగర రాజా, ముక్కోటి కాంతలు ఒక్క కొంగున ఊగాలి వంటి గీతాలతో పాటు మా తెలుగుతల్లికి మల్లెపూదండ, హే భారత జననీ, ఓహో స్వాతంత్ర దేవి, మ్రోయింపు విజయభేరీ, ఇదే జోత నీకిది జోత ఓ స్వాతంత్ర్య భారత పిత, ఉదయమ్మాయెను, ఈనాడే పదిహేనవ తేదీ, శ్రీకర గోదావరీ కృష్ణ, మాదీ స్వతంత్ర దేశం- మాది స్వతంత్ర జాతి, ఎత్తవోయి నీ జయ జండా ఏజెండా, దేశమును ప్రేమించుమన్నా మంచి అన్నది పెంచుమన్నా వంటి దేశభక్తి గీతాలు కూడా వున్నాయి.

ఈ పాటలు వింటుంటే... ముఖ్యంగా దేశభక్తి గీతాలు... వింటుంటే ఆనాటి గాయనీ గాయకులలో, రచయితలలో, సంగీత దర్శకులలో సమాజం పట్ల ఉండవలసిన బాధ్యతలతో కూడిన చైతన్యం, నిజాయితీ, సంస్కారం అన్నీ దర్శనమిస్తాయి. అందుకే వారి వర్క్స్ నేటికీ సజీవంగా ఉన్నాయి. అవన్నీ మనకు అందుబాటులోనే ఉన్నందుకు సంతోషించాలి. అందించినందుకు అందుకు కారకులైన ప్రతి ఒక్కరినీ అభినందించాలి.

ముఖ్యంగా ఈ క్యాసెట్‌లోని దేశభక్తి గీతాలను నేటి పాఠ్య గ్రంథాలలో నిధిగా ప్రచురించితీరాలి. కళాకారులు నృత్యరూపకాలుగా మలచి ప్రదర్శించాలి. ప్రభుత్వ, ప్రైవేట్ మాధ్యమాలు కూడా వీటి ప్రసార, ప్రచార బాధ్యతలను ఒక జాతీయోద్యమంగా భావించి స్వీకరించి నిజాయితీగా అమలు చేయాలి. నలుగురు కలిసి ఆనందం పంచుకునే ప్రతి వేడుకల్లోనూ ఈ గీతాలను మనస్ఫూర్తిగా పాడుకోగలిగిన సంస్కారాన్ని అలవర్చుకోవాలి... భోజనానంతరం 'అన్నదాతా సుఖీభవ' అని స్మరించుకోవటం ఓ సత్సంప్రదాయం. ఆనాటి పెద్దలు నిష్కంళక హృదయాలతో అందించిన స్వాతంత్ర్య ఫలాన్ని సుష్టుగా ఆరగిస్తున్న మనం ఈ పాటల గురించి అటువంటి సంస్కారాన్ని అలవర్చుకుంటేనే హృదయంలోని స్పందనకు సార్ధకత లభిస్తుంది.

ఇక ఇందులోని గీతాలకు సంబంధించిన సాంకేతిక సమాచారంలో కొన్నిటికి రచయితల పేర్లు, మరి కొన్నిటికి సంగీత దర్శకుల పేర్లు, ఇంకొన్నిటికి ఈ ఇద్దరి పేర్లూ ఇవ్వటం జరగలేదు. ఈ విషయమై హెచ్.ఎం.వి. సంస్థకు చెందిన యస్.పి.శివప్రసాద్ గార్ని 'హాసం' పాఠకుల తరపున అడగటం జరిగింది. ఎన్నో వ్యయప్రయాసలకోర్చి వీటిని శ్రోతల కందించే ప్రయత్నంలో కాలాతీతమయిపోతూ వుండటం వల్లనూ, ఇంకా తాత్సారం చేస్తే ఈ మాత్రం కూడా దక్కక పోతుందేమో నన్న భావన బలమైపోతూ వుండటం వల్లనూ వెంటనే రిలీజ్ చెయ్యటం జరిగినట్టుగా ఆయనతో జరిపిన సంభాషణలలో 'హాసం' ప్రతినిధికి అర్ధమయింది. **వీటికి సంబంధించిన సరియైన సమాచారం వున్న పాఠకులు 'హాసం'కు పంపిస్తే వాటిని హెచ్.ఎం.వి. వారికి అందజేసే బాధ్యతను 'హాసం' ఆనందంగా స్వీకరిస్తుంది. వీలునిబట్టి ఆ సమాచారాన్ని సెకెండ్ బంచ్ లోనైనా పొందుపరిచే అవకాశం కూడా ఉంటుంది.** ■

# దిసీజ్ ఖర్మ... దట్సాల్...!

సత్యమూర్తి



ఎండలు భరించలేక, చిట్‌లు పాడి, దొరికిన చోట అప్పులు చేసి మీరు ఓ ఎయిర్ కండిషనర్ కొంటారు.



తీరా ఆ ఎ.సీ. బిగించే టైములో 'మీది సింగిల్ ఫేజ్ వైరింగ్, ఇంకో 10,000 ఖర్చుపెట్టి త్రీఫేజ్ వైరింగ్ చేస్తే కానీ ఇది వర్క్ చేయదు' అని బిగించడానికి వచ్చిన ఇంజనీర్ అంటే...



మెగాస్టార్ సినిమాకి టికెట్టు దొరికిన మొట్టమొదటి వ్యక్తిగా వచ్చి హాల్లో మంచి సీటు దొరికిందని సంబరపడిపోతారు మీరు.



తీరా సినిమా మొదలవగానే మీ ముందున్న ఒకే ఒక్క ఖాళీ సీట్లో ఒక భారీకాయుడు వచ్చి అడ్డంగా కూర్చుంటే...



పాపంకొడుకుని కష్టపడి చదివిస్తున్నాడు కదా అని మీ పక్కన ఉన్న గుమాస్తాకి తెలియని విషయాల్ని ఓపిగ్గా చెప్తూ, ఆఫీసు పనుల్లో మీరు చాలా సాయం చేస్తుంటారు.



చదువుకున్న అతని కొడుకు మీ ఆఫీసులోనే జేరి, మేనేజ్‌మెంట్‌కి 'మీరు అనవసరం' అనుకునేలా చేస్తే...

# న్యూస్ వ్యూస్

ఈ నెల 9వ తేదీన స్వర్గీయ ఘంటసాల విగ్రహం రవీంద్రభారతికి తరలించబడడం, అందుకు సంబంధించిన వార్త కథనాన్ని ఎడిటోరియల్‌లోను, ఫోటోలను ఈ సంచిక 75 పేజీలోను చూసి వుంటారు. విగ్రహావిష్కరణ అనంతరం, సభా కార్యక్రమం తరువాత లిటిల్ మ్యుజీషియన్స్ అకాడమీ ఆధ్వర్యంలో 32 మంది బాలబాలికలు స్వర్గీయ ఘంటసాల పాడిన, స్వరపరిచిన 12 గీతాలను పాడి ప్రేక్షకులను ఆనందాశ్చర్య చకితుల్ని చేశారు. ఈ బాలబాలికలంతా 5 నుండి 17 ఏళ్ళ లోపు వారే. ఘంటసాల పరమపదించే నాటికి వీరిలో కొందరి తల్లిదండ్రులు కూడా పుట్టి వుండరు. స్వరాలతో నహో మది శారదాదేవి మందిరవేం,

## మంచి పాటకు నిర్వచనాన్ని తెలిపిన చిన్నారులు

హాయిహాయిగా అమని సాగె వంటి పాటలను అతి దగ్గర గమకాలు, దీర్ఘాలాపనలు కలిగిన లేరుకు శలవుల సాటి వంటి పాటలను ఆ చిన్నారులు పాడుతుంటే శ్రోతలుశ్రూతలూగిపోయేరు. ఆ 32 మంది చిన్నారులను పరిచయం చేస్తుంటే మొదటి వ్యక్తి నుంచి చివరి వ్యక్తి వరకూ ఆగకుండా చప్పట్లతో తమ హర్షాన్ని వెల్లడి చేశారు. ఇటీవల హైద్రాబాద్‌లో జరిగిన సాంస్కృతిక కార్యక్రమాలలో అంతసేపు ఆగకుండా ప్రేక్షకులు చప్పట్లు చరిచిన సంఘటన బహుశా ఇదొక్కటేనేమో!? అసలు ఘంటసాల పాటలను చిన్న పిల్లలతో పాడించాలనుకోవడం, అదీ ఒక్కొరొక్కరుగా కాకుండా బృందగానంగా పాడించడం ఈ కాన్సెప్ట్ ప్రేక్షకులకు బాగా నచ్చింది. తరాల అంతరాలను దాటి నిలబడగలిగేదే మంచి పాట అనే నిర్వచనాన్ని పాటకు పరోక్షంగా అందజేసే విధంగా - ఈ చిన్నారుల చేత ప్రతి ఆదివారం ఆరు గంటల పాటు సాధన చేయించిన - లిటిల్ మ్యుజిషియన్స్ అకాడమీ అధినేత కె.రామాచారి ఈ సందర్భంగా అభినందనీయుడు.

# జర్నలిస్ట్ దంపతుల 'చంటిగాడు'



'సూపర్‌హిట్' సినీవారపత్రిక అధినేతలు, దంపతులు బి.ఎ.రాజు, జయ ఇటీవల 'ప్రేమలో... పావనీ కళ్యాణ్' చిత్రాన్ని నిర్మించిన విషయం పాఠకులకు విధితమే. తాజాగా ఆ దంపతులు ప్లాన్ చేసిన చిత్రమే - చంటిగాడు. ఈ చిత్రం షూటింగ్ ఈ నెల 9వ తేదీన ప్రారంభమయింది. 'ఎదురింటి మొగుడు - పక్కింటి పెళ్ళాం' హాస్యచిత్రం ద్వారా పరిచయమైన బాలనటుడు ఆదిత్య టీనేజ్‌లోకొచ్చి బాలాదిత్య అనే పేరుతో హీరోగా పరిచయం అవుతున్నాడు. నిజానికతణ్ణి తొలిసారి చూసినపుడు శ్రీమతి జయ పెద్దగా ఇంప్రెస్ అవలేదు. కానీ తరువాత అతగాడు రామాయణంపై స్వయంగా రాసుకున్న ఓ పాటను పాడుతుండగా కనబరిచిన హావభావాలను చూసి అప్పుడు హీరోగా ఫిక్స్ చేసుకున్నారామె. సుహాసిని అనే నూటికి నూరు నయాపైసల తెలుగమ్మాయి హీరోయిన్‌గా పరిచయం అవుతోంది. వీరుకాక కళా దర్శకుడుగా ఎస్.నాగేంద్ర, పాటల రచయితలుగా కాసర్ల శ్యామ్, పైడిశెట్టి రామ్ పరిచయం అవుతున్నారు. సూపర్‌హిట్ అధినేత్రి శ్రీమతి జయ గతంలో స్క్రిప్ట్ రైటింగ్, దర్శకత్వం శాఖలలో తనకున్న అనుభవాన్ని సమీకరించుకుని దర్శకురాలుగా ముందుకొస్తోంది.

భానుమతి, సావిత్రి, జి.వరలక్ష్మి, విజయనిర్మల తర్వాత తెలుగు సినీ పరిశ్రమకు పరిచయం అవుతున్న మరో మహిళా దర్శకురాలీమె. "ఇంతమందిని కొత్తగా తీసుకొస్తూ నూతన పరిచయం అని చెబుతూ మీ గురించి మీరు అలా చెప్పుకోవటం లేదేంటీ?" అని ఓ పాత్రికేయుని ప్రశ్నకు "వీరందరి గురించి ఆలోచిస్తూ నా గురించి ఆలోచించుకోవటమే మర్చిపోయాను" అంటూ సమాధానమిచ్చారు జయ. ఎటువంటి సమస్యనైనా, ప్రశ్నకైనా - నెమ్మదిగా నవ్వుతూ - తెలివిగా - సమర్థనీయంగా - సమాధానం చెప్పగల వ్యక్తిత్వమే దర్శకురాలిగా ఆమె రాణించగలదని తెలుపుతోంది. ఇక తను అనుకున్నది ఎంత కష్టసాధ్యమైనదైనా సరే అత్యంత నైపుణ్యంతో అమలు చేసి విజయం సాధించే నేర్పు గల బి.ఏ.రాజు ఈ చిత్రంతో



పటిష్ఠమైన నిర్మాతగా పేరు తెచ్చుకోగలడని ముహూర్త షాట్‌కు ఓ మూడు రోజుల ముందు ఫిలిం ఇండస్ట్రీ కోసం ప్రత్యేకంగా విడుదల చేసిన బ్రోచర్ తెలియజేస్తోంది. ఒక్క ఎ.ఎం.రత్నం వంటి భారీ నిర్మాతకు మాత్రమే ఇటువంటి బ్రోచర్‌లు రిలీజ్ చేసే అలవాటుంది. వందేమాతరం శ్రీనివాస్ సంగీత దర్శకత్వంలో ఈ చిత్రానికి సంబంధించిన ఆరు పాటలూ సిద్ధం అయ్యాయి. జూలైలోనే ఆడియో రిలీజ్ కాగలదని అక్టోబర్‌లో చిత్రాన్ని విడుదల చేస్తామని ఎంతో ఆత్మవిశ్వాసంతో తెలియజేశారు బి.ఎ.రాజు.

గాయకుడిగాను, సంగీత దర్శకుడిగాను ప్రేక్షకులను అలరించిన వందేమాతరం శ్రీనివాస్ 'అమ్మలు' చిత్రంలో ధరించిన ఓ ఉదాత్తమైన పాత్ర ద్వారా ప్రేక్షకుల అభిమానాన్ని చూరకొనబోతున్నాడు. అమాయకంగా కనిపిస్తూ ఎటువంటి త్యాగాన్నైనా చేసే ఆ పాత్ర ద్వారా వందేమాతరం శ్రీనివాస్ నటుడిగా చాలాకాలం ప్రేక్షకులకు గుర్తిండిపోతారు.







వై.వి.యస్.చౌదరి


డా॥ సి.నారాయణరెడ్డి

## సాంకేతిక నిపుణులు

| | |
|---|---|
| కథ | : వై.వి.ఎస్.చౌదరి |
| మాటలు | : పోసాని కృష్ణమురళి |
| పాటలు | : డా॥సి.నారాయణరెడ్డి, చంద్రబోస్ |
| డాన్స్ | : బృంద, తార,రాజశేఖర్, ప్రేమ, రాకేష్, కృష్ణారెడ్డి |
| స్టిల్స్ | : జి. శ్రీను |
| ఫైట్స్ | : రాజు |
| మేకప్ | : చంద్ర |
| కాస్ట్యూమ్స్ | : శేఖర్ |
| కో- డైరెక్టర్స్ | : రమేష్‌రెడ్డి, మల్లికార్జునరెడ్డి |
| అసోసియేట్స్ | : సురేష్, సి.హెచ్.శోభనాద్రి, ప్రభాకర్ |
| ప్రొడక్షన్ కంట్రోలర్ | : రామ్మోహనరావు |
| పి.ఆర్.ఓ | : చిన్నారాయణ |
| పబ్లిసిటీ | : సురేష్ అంజన్ |
| ఎగ్జిక్యూటివ్ నిర్మాత | : కొమ్మినేని వెంకటేశ్వరావు |
| సంగీతం | : కీరవాణి |
| దర్శకత్వం | : వై.వి.ఎస్. చౌదరి |


కీరవాణి


చంద్రబోస్

రచన, గానం: కీరవాణి (స్వర్గీయ ఎన్.టి.ఆర్. స్మృత్యర్థం)

నా పరిపూర్ణ పరిశుద్ధ హృదయంతో
నిను కొల్చుభాగ్యం ఇంకెప్పుడు
ప్రభూ..... ఈ జన్మకు

Duration of the Song 25 Sec

రచన: చంద్రబోస్ (1) గానం: ఉదిత్ నారాయణ్, చిత్ర

Duration of the Song 5 min 50 Sec

అ: ఓ పిల్లా..... ఓ పిల్లా..... ఓ పిల్లా... ఓ.... పిల్లా.....
అమ్మతోడు నాన్నతోడు నినుపుట్టించిన బ్రహ్మతోడు
వదలను నిన్నే ఓ పిల్లా వదలను నిన్నే ఓ పిల్లా
మీ అమ్మ కాదన్నా.... మీ నాన్న కాదన్నా
ఆ బ్రహ్మ కాదన్నా.... వదలను నిన్నే ఓ పిల్లా....
ఆ: ఓ రాజా.... ఓ రాజా...
కొమ్మతోడు రెమ్మతోడు కట్టుకు వచ్చిన కోక తోడు
మరువను నిన్నే ఓ రాజా... ఓ రాజా...
నీ తోడుంటే దీపావళీ... నువ్వు... ఊఁ అంటే ధూపావళీ
అ: ఒక్కరు వుంటే ఏకాదశి... జంటైతే కేకాదశి
ఆ: సయ్యంటె ప్రతి సంధ్యకి సుఖాల సంక్రాంతి
అ: నువ్వుంటే ప్రతి రాతిరి అయ్యేను నవరాత్రి
ఆ: నా తీగను అల్లితే నాగుల పంచమిలే
అ: నీ సోకులు అందితే గోకుల అష్టమిలే
బ్రతుకంతా సీతా రాముల నవమే ఓ పిల్లా ఓ పిల్లా... ఓ... పిల్లా... ॥అమ్మతోడు॥
అ: బిడియాలతో బిల్లంగోడు పిల్లా నేడే ఆడేయనా....
ఆ: వయ్యారంతో ఓమనగుంటా ఆడించి ఓడించవా
అ: పెదాల కోలాటాలే.... యివాళ ఆడాలి
ఆ: గదుల్లో కోతి కొమ్మ గలాటా చూడాలి
అ: చలిదాగుడు మూతల ఆటకు ముందుకు రా....
ఆ: నను గుజగుజ రేకుల ఆటకు గుంజకురా
మనువాటే ఆడినాడే మొగుడై పోరా.... ఓ రాజా.... ఓరాజా.... ఓ..... రాజా....
కొమ్మతోడు రెమ్మతోడు కట్టుకు వచ్చిన కోకతోడు...
మరువను నిన్నే.... ఓ రాజా... మరువను నిన్నే ఓ రాజా
ఏ కొమ్మకాదన్నా.... ఏ రెమ్మ కాదన్నా నా కోకే కాదన్నా
మరువను నిన్నే... ఓ రాజా.... అ: ఓ పిల్లా.... ఓ...... పిల్లా



రచన: డా॥ సి.నారాయణరెడ్డి (2) గానం: ఎస్.పి.బాలసుబ్రహ్మణ్యం

Duration of the Song 4 min 55 Sec

ప: ఇదిగొ రాయలసీమ గడ్డ.... దీని కథ తెలుసుకో తెలుగు బిడ్డ ॥3॥
ఈ గడ్డలో పగల సెగలొద్దురా... ఈ మట్టిలో నెత్తురోలకొద్దురా ॥ఇదిగొ॥
చ: పతిత పావనుడు తిరుపతి వేంకటేశ్వరుడు...
సర్వ రక్షకుడు శ్రీశైల మల్లేశ్వరుడు...
కొలువున్నదీ సీమలోనే
రంకెలిడు లేపాక్షి బసవన్న శిల్పం...
రణభేరి నినదించు చంద్రగిరి దుర్గం...
నెలకొన్నదీ నేలలోనే.... ॥ఇదిగొ॥
చ: హరుని కంటికే కన్నర్పించిన కన్నప్ప భక్తవరుడూ
విజయ నగర సామ్రాజ్య దురంధర కృష్ణరాయ భూవిభుడు
చరిత్ర కెక్కిన ధరణి ఇది.....
పదాలనే స్వరపథాల నడిపిన అన్నమయ్య కృతులు
ఇహ పరాల కలిపిన వీరబ్రహ్మేంద్ర తత్వగతులు
అలలై పొంగిన అవని ఇది.... ॥2॥ అందుకే...... ॥ఈ గడ్డలో॥ ॥ఇదిగొ॥
చ: తెల్లదొరల హడలెత్తించిన ఉయ్యాల వాడ నరసింహారెడ్డి
కో: వందేమాతరం
మడమ తిప్పక స్వరాజ్య సంగ్రామం నడిపిన కడప కోటిరెడ్డి.....
కో: వందేమాతరం
గాడిచెర్ల కల్లూరి... సదాశివం పప్పూరి
హంపణ్ణ.... లింగణ్ణ..... షేక్‌పీర్ రబియాబి
ఒక్కరా.... ఇద్దరా.... పదుగురా.... ఆఁ నూర్గురా....
ఎందరెందరో త్యాగమూర్తులకు జన్మమిచ్చిన జనని యిది... ॥ఇదిగొ॥
అంతటి చిరంతన నిరంతర వికస్వర వైభవంతో విరాజిల్లిన
రాయలసీమ..... మన రైతన్నల సీమ... ఈనాడు దుష్కర ముష్కర
శక్తుల దురంతాలతో అతలాకుతలమవుతుంటే
చూస్తూ ఉంటారా.... చూస్తూనే ఉంటారా..... కో: లేదు.... లేదు.....
అయితే... యువత విక్రమించాలి.... నవత విప్లవించాలి....
నా గొంతున గర్జించే నాదమే మహోద్యమమై
కుళ్ళిన ఈ వ్యవస్థకే కొత్తనెత్తురెక్కించాలి
సరికొత్త చరిత సృష్టించాలి... ॥2॥



రచన: చంద్రబోస్ (3) గానం: అనురాధ శ్రీరామ్, కీరవాణి

Duration of the Song 5 min 30 Sec

ఆ: పెళ్ళీడు కొచ్చినా ఒంటిగా ఉన్నాను
అ: SO SAD
ఆ: పెనిమిటెట్లా ఉండాలో కలలు కన్నాను.... ఊఁ...ఊఁ.... ఊఁ... ఊఁ...
అ: IS IT...?
ఆ: ఊఁ... ఏడ తానున్నాడో వాడూ
అ: చ్ చ్ చ్ చ్ చ్
ఆ: ఒక్కగానొక్క మగాడు
అ: అంత స్పెషలా......?
ఆ: ఊఁ.. ఊఁ.... ఊఁ... నా ఊహలో అందగాడు
అ: నాన్చొద్దూ.....
ప: సుగుణాభిరాముడు... సమరాన భీముడు
ఎవరో ఎవరో అతగాడు ఒక్క మగాడు.... ఒక్క మగాడు...
చెప్పిందే చేసేవాడు చేసేదే చెప్పేవాడు
ఎవరో ఎవరో అతగాడు... ఒక్క మగాడు... ఒక్క మ... గా... డు..
చ: జీన్సుప్యాంటు కట్టినా - గళ్ళ లుంగీ చుట్టినా.... నీటుగాడు
జానపదుల పాటైనా జాజ్ బీటు రూటైనా.... ఆటగాడు
మగువలకే మరుడు... ఔ...ఔ....ఔ... మదనుడికే గురుడు.....ఏ.....ఏ.....ఏ...
మాటలు తను అనడు.... ఔ.. ఔ... ఔ... చేతలకిక ఘనుడు
ముక్కు మీద కోపం వాడు ముక్కుసూటిగ వెళ్ళేవాడు
ముక్కుతాడు నాకే వేస్తాడు...
అతల వితల సుతల సత్యభూతల భువనాలన్ని ప్రణమిల్లు పురుషుడు...
ఒక్క మగాడు... ఒక్క మగాడు
కొమ్ములు తిరిగిన కండలు కలిగిన
కలలో మెదిలే మొనగాడు... ఒక్క మగాడు.... ఒక్క మ... గా.... డు...
చ: ఆకుచాటు పిందైనా ఆకసంలో చుక్కైనా... వేటగాడు..
లక్షమంది అడ్డున్నా లక్ష్యమంటూ ఏదైనా.... పోటుగాడు...
మగసిరి గల రేడు... అయ్....అయ్....అయ్...
మనసున పసివాడు... ఏఁ.....ఏఁ...ఏఁ....
శత మదగజ బలుడు అయ్... అయ్.... అయ్.... అతనికి ఎదురెవడు
పాత సినిమా హీరోలాగా సాహసాలు చేసేవాడు సాక్షాత్తూ నాకై పుట్టాడు



శాంత కరుణ రౌద్ర వీర అద్భుత శృంగారాది రస దేవదేవుడు....
ఒక్క మగాడు.... ఒక్క మ... గా... డు...
సుగుణాభిరాముడు... సమరాన భీముడు ఎవరో ఎవరో అతగాడు...
ఒక్క మగాడు... ఒక్క మగాడు... ఆంధ్రుల తనయుడు అనితర సాధ్యుడు
నా కథ నడిపే నాయకుడు ఒక్క మగాడు.... ఒక్క మ... గా... డు...
ఒక్క మగాడు... ఒక్క మగాడు.... ఒక్క మ... గా... డు...
ఒక్క ఒక్క మగాడు

రచన: చంద్రబోస్ (4) గానం: విజయ్ ఏసుదాస్, సునీత

Duration of the Song 4 min 30 Sec

అ: సమయానికి తగుసేవలు సేయనీ నీ శ్రీవారినీ ॥2॥
ఇన్నాళ్ళుగా శ్రమియించిన ఇల్లాలిని ఇకసేవించనీ ఈ శ్రీవారినీ... ॥సమ॥
నాకు నువ్వు నీకు నేను అన్న తీపి మాటతో
చెవిలోన గుసగుసల చిలిపి వలపు పాటతో
శ్రీమతికి జరిగేను సుప్రభాత సేవ
బంగారు నగల మించు బాహు బంధాలతో
చలువ చందనాల మించు చల్లని నా చూపుతో
అర్థాంగి కి జరిగేను అలంకార సేవ...
అమ్మలోని బుజ్జగింపు కలిపిన ఈ బువ్వతో
నాన్నలోని ఊరడింపు తెలిసిన ఈ చేతితో
నా పాపకు జరిగేను నైవేద్యసేవ... నైవేద్య సేవ ॥సమ॥
కలతలేని లోకంలో దిష్టిపడని దీవిలో
చెడుచేరని చోటులో ప్రశాంత పర్ణశాలలో
ఈ కాంతకు జరిగేను ఏకాంత సేవ
అనుబంధమె బంధువై... మమతలె ముత్తయిదువలై
ఆనంద బాష్పాలె అనుకోని అతిథులై సీతమ్మకు జరిగేను సీమంతపు సేవ
నులివెచ్చని నా ఎదపై పరిచేటి పాన్పులో
కనురెప్పల వింజామర విసిరేటి గాలితో
చూలాలికి జరిగేను జోలాలి సేవ... జోజోలాలి సేవ....
ఆ: శ్రీవారికి ఒక మనవిని సేయనీ... ఈ ప్రియదాసినీ
శ్రీవారికి ఒక మనవిని సేయనీ ఈ ప్రియదాసినీ
కనుతెరవగ మీరూపే చూడాలని
మీ కౌగిళ్ళలో కనుమూయాలని అ: ఈ కౌగిళ్ళలో కలిసుండాలని....

**రచన: డా॥ సి.నారాయణరెడ్డి** (5) **గానం : ఎస్.పి.బాలు, కీరవాణి**

Duration of the Song 3 min 45 Sec

ప: పైరు కోయిల కూసింది... పల్లె దరువులు వేసింది...
పైరుతో శృతి కలిపి... పల్లెతో జత కలిసి ॥2॥
రావయ్యా రావయ్యా రామసక్కని సీతయ్యా..... ॥2॥
చ: కత్తులు దూసే పల్లెల్లో మెత్తని ప్రేమలు నింపావు
తెంచుకుపోయే గుండెల్లో... తీయని ముళ్లే వేశావు...
ఇన్నాళ్ళు వేచిన మా కళ్ళు.. ఇచ్చేను కర్పూర హారతులు.. ॥2॥
కో: అందుకోవయ్యా ఆదుకోవయ్యా ॥2॥ ॥రావయ్యా॥
చ: ఆ రెడ్డి ఈ రెడ్డి ఆ నాయుడీనాయుడందరొక్కటైపోతే
ఆ ఎత్తులీ ఎత్తులు ఆ కత్తులీకత్తులన్నీ చిత్తయిపోతే
సీమలన్నిటికి మిన్న... సీమలన్నిటికి మిన్న... మన రాయలసీమోరన్నా.... ॥2॥
వింటున్నావా వెంకన్నా... కంటున్నావా మల్లన్నా ॥2॥ ॥రావయ్యా॥

**రచన: చంద్రబోస్** (6) **గానం : ఎస్.పి.బి, చరణ్, సునీత**

Duration of the Song 5 min 15 Sec

అ: ఆదిశంకరుల సౌందర్యలహరి దేవులపల్లి లలిత గీతా ఝరీ
శ్రీనాథ శృంగార లాహిరి... వేటూరి గేయాల మాధురి
నవలా శౌరి యండమూరి, షెల్లీ, కిట్స్... యద్దనపూడి
ఎందరో మహానుభావులు చూపిన దారి
పట్టాల్సిన పిచ్చే ప్రేమరా... పుట్టాల్సిన చిచ్చే ప్రేమరా...
ఆ: జీవితమే వడబోసి... అనుభవమే కలబోసి
ఎందరో మహానుభావులు చూపిన దారి
చెయ్యాల్సిన తప్పే ప్రేమరా... తెలియాల్సిన నొప్పే ప్రేమరా...
అ: అందరికి తెల్లారితే సూర్యోదయం
నాకు మాత్రం నిన్ను చూస్తేనే సూర్యోదయం
ముంచుతుంది ప్రేమ అమృత జలపాతంలో
తేల్చుతుంది ప్రేమ ఆకాశంలో
ఆ: మొగ్గుతుంది ప్రేమ మమతల తులసిదళంతో
నెగ్గుతుంది ప్రేమ తలరాతతో
అ: మనసు పుటల్లో వయసే రాసే రసవద్గీతే ప్రేమ
ఆ: తలపులతో తలపండి.... వలపులనే తెగ వండి
ఎందరో మహానుభావులు చూపినదారి



అ: తిరగాల్సిన మలుపే ప్రేమరా
ఆ: తియ్యాల్సిన తలుపే ప్రేమరా....
ఆ: ఎదురుగా నువ్వుంటే గుండె దడ పెరుగుతుంది
దూరమైతే ఆగిపోతుందేమో
అ: ఓ...ఓ...ఓహో... ఆడుతుంది ప్రేమ మనసుల మైదానంలో
పొంగుతుంది ప్రేమ మది దానంతో
ఓ...ఓ...ఓ...పాడుతుంది ప్రేమ ఊపిరి కచ్చేరిలో
పండుతుంది ప్రేమ దస్తూరితో
ఆ: అడిగినవన్నీ మనకందించే అక్షయ పాత్రే ప్రేమ
అ: కవితలనే దివ్వెలుగా... భావనలే వెలుగులుగా
ఎందరో మహానుభావులు చూపిన దారి
ఆ: ఎదగాల్సిన ఎత్తే ప్రేమరా...
అ: కలగాల్సిన మత్తే ప్రేమరా.. ॥ఆది శంకరు॥

**రచన: డా॥ సి.నారాయణరెడ్డి** (7) **గానం : ఎం.ఎం.కీరవాణి**

Duration of the Song 2 min 50 Sec

అ: ఆ విక్రమ స్ఫూర్తి ఆ విశృంఖల దీప్తి
ఎవరతడు ఎవరతడు ఎవరు
ఆ సముజ్వల మూర్తి ఆ సమున్నత కీర్తి
ఎవరతడు ఎవరతడు ఎవరు
కో: సీతయ్యా.... సీతయ్యా... సీతయ్యా....
ఎవరి మాట వినడు సీతయ్య ॥3॥
ఆ రూపు సింహాద్రి సదృశం ఆ చూపు బాణాగ్ర నిశితం
ఉఛ్వాసామతని ఓంకారం విశ్వాసం అతని ధిక్కారం
ఎవరి మాట వినడు సీతయ్య ॥3॥
అణువణువు ధర్మాగ్రహం అడుగడుగు న్యాయాంకితం
శిష్టరక్షణమతని యాగం దుష్టశిక్షణమే ఉద్యోగం
ఆ పాదం తాకితే మాతృధరణి మది పులకిస్తుంది
ఆ పాదం కదిలితే వాయుమండలం ప్రచలిస్తుంది
ఆ పాదం కదిపితే ఆకాశం శిరసు వంచుతుంది
ఆ పాదం కుదిపితే తేజోవలయం తీండ్రిస్తుంది
ఆ పాదం ఉరిమితే జలధరాత్మ జలజలజలజలజల జల వర్షిస్తుంది.....
ఓం....... ఓం.......



**రచన: చంద్రబోస్** (8) **గానం : శ్రీయా ఘోషల్, ఎం.ఎం.కీరవాణి**

Duration of the Song 5 min 25 Sec

ప: సిగ్గేస్తుంది నిను చూస్తుంటే
సిగ్గేస్తుంది నీ మాటింటే
సిగ్గేస్తుంది నీతో ఉంటే
సిగ్గేస్తుంది ఆలోచిస్తే
సిగ్గేస్తుంది అడుగే వేస్తే....
సిగ్గేస్తుంది అందాకొస్తే.....
ఏదో ఇవ్వాలనుకుంటే ఇచ్చే ధైర్యం లేకుంటే
ఓరయ్యో... ఓ....
కళ్లల్లో కడివెడు సిగ్గు...
బుగ్గలో బుట్టెడు సిగ్గు
ఒళ్లంతా ఒకటే సిగ్గూ ॥సిగ్గే॥
చ: ముద్దిమ్మని నా అంతట నేను పెదవే విప్పి
అడగాలంటే అయ్ బాబోయ్ సిగ్గు
ఇస్తానని తానంతట తాను ఎదురే వచ్చి
ఇదుగో అంటే అడ్డగోలు సిగ్గు
కొకొక కకక కక్క కకక్క కోకలాగుతుంటే సిగ్గు
ఛీ ఛీ ఛీ ఛీ ఛీ చీఛ్చీ చీ చిలిపి సైగ చేస్తే సిగ్గూ
వెలుపల సిగ్గూ.. లోలోపల సిగ్గూ
సిగపూవై ఉన్నోడు మొగ్గంతా తడిమేస్తుంటే సిగ్గూ....
చ: రాతిరి తాను నిద్దరమాని నాకలలోనే
తిరిగేస్తుంటే ఓరినాయనో సిగ్గూ
కలలో కలిగిన అలసటతో నా ఒళ్ళోనే
నిదిరిస్తానంటే ఎక్కడలేని సిగ్గూ
ఊ ఊ ఉ ఉఊఉఊహత్తరుముతుంటే సిగ్గూ.....
ఆ ఆ ఆ ఆ ఆ ఆ ఆశ కలుగుతుంటే సిగ్గూ...
తొలి తొలి సిగ్గూ... నను తొలిచిన సిగ్గూ
చిదిమేసే చిన్నోడికి సిగ్గంటూ చెప్పాలంటే సిగ్గూ ॥సిగ్గేస్తుంది॥

**రచన: వేటూరి** **గానం : కీరవాణి**

అనాది మహిళా మాతా
అనంతీ ఆత్మవర్ధిని
ప్రకృతీ పార్వతీ శక్తీ
పాహిమాం భువనేశ్వరీ



**రచన: చంద్రబోస్** (9) **గానం : ఎస్.పి.బాలు, చిత్ర**

Duration of the Song 4 min 50 Sec

ఆ: బస్సెక్కి వస్తావో... బండెక్కి వస్తావో... కారెక్కి వస్తావో.... లారెక్కి వస్తావో
బస్సెక్కి వస్తావో... బండెక్కి వస్తావో... కారెక్కి వస్తావో.... లారీఎక్కొస్తావో
ఏదైనా ఎక్కేసిరా నా ఎదలోన పక్కేస్తారా ॥2॥
అ: రాముడై వస్తానో భీముడై వస్తానో కాముడై వస్తానో కృష్ణుడై వస్తానో
రాముడై వస్తానో భీముడై వస్తానో కాముడై వస్తానో కృష్ణుడై వస్తానో
ఏ వేషంలో వచ్చినా.... నీ ఆవేశం తగ్గించనా ॥2॥
అ: మావా అంటే మాపటికి మనసిస్తానే
ఆ: మావా మమా మావా
అ: బావా అంటే బ్రహ్మాండం చూపిస్తానే
ఆ: బావా
ఆ: పోరీ అంటే పొద్దంతా ప్రేమిస్తాలే
అ: ఏయ్ పోరీ
ఆ: రాణీ అంటే రాత్రికి నిను రానిస్తాలే
అ: ఏమోయ్ అంటే ఏమే అంటూ.... ఏమేమో చేస్తానే
ఆ: సతీ అంటే పతీ అంటూ ప్రతిదీ అందిస్తాలే...
ఎట్టాగైనా నను ఎట్టాగైనా ఎట్టాగైనా పిలిచేసుకో... నా పట్టుతేనె పిండేసుకో...
అ: ఏపియస్సార్టీసీ బస్సెక్కివస్తానే బండెక్కివస్తానే కారెక్కివస్తానే
లారెక్కివస్తానేబండెక్కివస్తాను బండెక్కివస్తాను
కారెక్కివస్తాను లారీఎక్కొస్తాను
ఆ: ఏదైనా ఎక్కేసిరా నా ఎదలోన పక్కేస్తారా
అ: ఓకే
ఆ: ఏదైనా ఎక్కేసి రావయ్ వయ్ రావయ్‌రా నా ఎదలోన పక్కేస్తారా
అ: ఓయ్యస్
అ: కన్నే కొడితే మెరుపల్లే ముందుంటానే
ఆ: హోయ్ హోయ్
అ: యీలే వేస్తే గాలల్లే అల్లేస్తానే
ఆ: అబ్బబ్బో
ఆ: నవ్వే నవ్వితే నడిచొచ్చి నడుమిస్తాలే
అ: అబ్బో
ఆ: చెయ్యే వూపితే చిలకలని చుట్టిస్తాలే...
అ: పైటే దువ్వి బయటేపడితే పైపైకే వస్తానే
ఆ: కాలే దువ్వి కబురే పెడితే పరువపు పరుపేస్తాలే
ఎల్లాగైనా... యిక ఎల్లాగైనా
ఎల్లాగైనా కవ్వించుకో నన్ను ఎల్ల కాలం కాపాడుకో ॥రాముడై॥



a Y.V.S. CHOWDARY film
యలమంచిలి గీత
బొమ్మరిల్లు వారి
సీతయ్య
ఎవ్వరి మాటా వినడు!
dts
యం.యం.కీరవాణి
వై.వి.ఎస్.చౌదరి
కొమ్మినేనివెంకటేశ్వరరావు
డా॥సి.నారాయణరెడ్డి
చంద్రబోస్
తారాగణం
నందమూరి హరికృష్ణ
రవికాంత్
ముఖేష్‌రుషి
రాహుల్‌దేవ్
బ్రహ్మానందం
అలీ
ధర్మవరపు సుబ్రమణ్యం
మల్లిఖార్జునరావు
ఎం.ఎస్.నారాయణ
ఎం.బాలయ్య
కాంతారావు
ఆహుతి ప్రసాద్
మోహన్‌రాజ్
జయప్రకాష్‌రెడ్డి
కె.అశోక్‌కుమార్
రాజన్.పి.దేవ్
దేవన్, సత్యప్రకాష్
జీ.వి., మోహన్‌దాస్
గజర్‌ఖాన్
సిమ్రాన్
సౌందర్య
సునితావర్మ
వింధ్య
నళిని
సుభాషిణి
రమాప్రభ
కల్పనారాయ్
హరిత
ఝాన్సి
పద్మజయంతి
విమలశ్రీ
ఉమాదేవి
ఫణిచౌదరి
దీపిక
మమత
ఇందూ ఆనంద్

# హాసం అవార్డు - 2003 ప్రదానం

న్యూస్ వ్యూస్

హాస్య, సంగీత విభాగాలలో ఔత్సాహిక కళాకారులను సత్కరించి ప్రోత్సహించే సంకల్పంతో ఈ సంవత్సరం నుండి 'హాసం అవార్డు' నెలకొల్పడం జరిగింది. తొలుదొల్తగా



ఈ అవార్డు గాయని శ్రీమతి సురేఖామూర్తిని వరించింది.

గతపక్షం జూన్ 7 వ తారీకున రవీంద్ర భారతిలో 'జానకి స్వరం - సురేఖ గళం' పేరిట 12 గంటలపాటు ఎస్.జానకి గారి పాటలతో సురేఖామూర్తి శ్రోతలను అలరించిన సంగీతోత్సవ సభ ఈ అవార్డును ఆమె 'హాసం' ప్రచురణకర్త శ్రీ వరప్రసాద్ రెడ్డి చేతులమీదుగా అందుకున్నారు.

మచిలీపట్నంలో జన్మించిన శ్రీమతి సురేఖ తండ్రి రామచంద్రరావు గారు హార్మోనిస్టు, ఆలిండియా రేడియో 'ఎ' గ్రేడు ఆర్టిస్టు. అంతేకాదు, సినీసంగీతదర్శకుడు మాస్టర్‌వేణు వద్ద అసిస్టెంటుగా పనిచేశారు కూడా. తల్లి ప్రఖ్యాత గాయని విజయలక్ష్మీశర్మ సోదరి. అందువల్ల సురేఖకు చిన్నప్పటినుండీ సంగీతంలో అభినివేశం ఏర్పడడంలో ఆశ్చర్యం లేదనుకోవాలి. హైదరాబాదులో విద్యాభ్యాసం సాగించిన సురేఖ బి.కామ్. పాసయి ప్రస్తుతం పోస్టల్ అక్కౌంట్స్ విభాగంలో జూనియర్ అకౌంట్స్ ఆఫీసరుగా పనిచేస్తున్నారు. హాబీగా సంగీతంలో కృషి చేస్తున్నారు.

చిన్నప్పుడు శాస్త్రీయ సంగీతం నేర్చుకోకపోయినా, రేడియో ద్వారానే ఆమెకు సంగీతం పట్టుబడింది. మొదటి సారి 6 ఏళ్ల వయసులో దూరదర్శన్ వారి టెలిస్కూలులో పాట పాడారు. 16 ఏళ్ల వయసులో తొలి స్టేజి ప్రదర్శన ఇచ్చారు. గత 23 ఏళ్లుగా తన సుమధురగళంతో శ్రోతలను అలరిస్తూనే ఉన్నారు. ఆలిండియా రేడియో 'ఎ' గ్రేడ్ ఆర్టిస్టు అయిన సురేఖ టీవీ గాయనిగా రెండుసార్లు నంది అవార్డులు గెలుచుకున్నారు. 1995 లో 'శరణం శ్రీ చరణం' టెలీఫిల్మ్‌లో నేపథ్యగానానికి, 1996 లో 'కృష్ణవేణి' టెలీఫిల్మ్‌లో నేపథ్య గానానికి, ఆమెకు ఈ అవార్డులు లభించాయి.

ఆంధ్రదేశంలో పలుప్రదర్శన లిచ్చిన సురేఖ ప్రవాసాంధ్రులను కూడా తన గానమాధుర్యంలో ఓలలాడించారు. ఇంగ్లండులోని డాక్టర్స్ అసోసియేషన్ ఆహ్వానంపై 2000లోను, యూరోపియన్ తెలుగు అసోసియేషన్ ఆహ్వానంపై ఇంగ్లండుకు, దుబాయికి, 2002 లోను విదేశాలు పర్యటించిన సురేఖకు ఒక కుమారుడు, ఒక కుమార్తె.

'హాసం' అవార్డు ప్రదానం చేస్తూ శ్రీ వరప్రసాద్ శ్రీమతి సురేఖ గారిలో విద్వత్తు, వినయం కలిసి వున్నాయని, అవార్డుకై ఎంపిక చేసేటప్పుడు ఈ విషయం కూడా పరిగణనలోకి తీసుకోవడం జరిగిందని అన్నారు.



'హాసం' అవార్డు

తనకు జరిగిన సత్కారానికి సమాధానం చెబుతూ శ్రీమతి సురేఖ లతామంగేష్కర్‌కు ఎస్.జానకి గారు ఏకలవ్య శిష్యురాలయినట్లే తను కూడా జానకి గారి పాటలు రేడియోలో విని ఏకలవ్య శిష్యరికం చేశానని అన్నారు. 12 గంటలపాటు జానకిగారి పాటలు పాడడం రికార్డుల కోసం కాదనీ, జానకిగారిపై అభిమానం చాటుకోవడానికి మాత్రమేనని స్పష్టం చేశారు. తను పాడిన 12 గంటలపాటు జానకి గారు సభలో కూర్చుని ఉండడం ఒక గొప్పవరంగా భావిస్తున్నానని అన్నారు.

శ్రీమతి ఎస్.జానకి తమ ఉపన్యాసంలో సురేఖను అభినందించారు. 'నేను ఎన్ని రకాల పాటలు పాడానో అన్ని రకాల పాటలూ పాడి వినిపించారు సురేఖ. మీకేవ్వైనా పాడి వినిపిద్దామన్నా ఇక నాకేమీ మిగల్చలేదామె.' అన్నారామె. పలువురు ప్రముఖులు పాల్గొన్న ఈ సభ రసమయి ఆధ్వర్యంలో జరిగింది.

## శోక గీతాలతోనే జానకి కెరియర్ ప్రారంభం

ఆనాటి సభలో తన కెరియర్ తొలిదినాల గురించి ఎస్.జానకి ఇలా చెప్పుకొచ్చారు - "నేను తొలిసారిగా నేపథ్యగానం చేసినది - 'విధియిన్ విళైయాట్టు' అనే తమిళచిత్రానికి టి.చలపతిరావుగారి సంగీతనిర్వహణలో ఓ శోకగీతానికి. నా కలలన్నీ వృథా అయిపోయాయనే అర్థంలో సాగుతుందా పాట. విధివిలాసమేమో కానీ (ఆ సినిమా పేరుకి అర్థం అదే మరి!) ఆ సినిమా రిలీజు కాలేదు. రెండోసారి నేపథ్యగానం చేసిన సినిమా మాత్రం రిలీజయి పేరు తెచ్చింది. అది 'ఎం.ఎల్.ఏ.' కె.బి.తిలక్‌గారి తెలుగు సినిమా. దానిలో నేను ఘంటసాలగారితో కలిసి గానం చేసిన ఆ పాట కూడా శోకగీతమే - 'నీ యాసా అడియాసా, చేజారె మణిపూసా' అని.

కొన్నాళ్లకు మలయాళంలో పాడే ఛాన్సు వచ్చింది. 'నాగిన్' హిందీ సినిమాలోని 'మేరే దిల్ యే పుకారే ఆజా' అనే పాట ట్యూన్‌లో సాగే ఆ పాట కూడా విషాదగీతమే. ఇదేమిటి తొలిగీతాలన్నీ ఏడుపుపాటలే వచ్చాయి అనుకుని ఆశ్చర్యపడ్డా, మనిషి కూడా ఏడుస్తూనే పుడతాడు కదా, అలాగే సినీగాయనిగా నా జన్మ కూడా ఏడుపుతోనే ఆరంభమయిందన్నమాట అనుకున్నాను."


చదువుల్రావు
మన కాలేజీలో మంచి పాప్యులారిటీ ఉన్నవాణ్ణి నేనే
కాదు నేనే
పోనీ... జయశ్రీ ఇటు వస్తూంది. అడుగుదామా?
సరే అడుగుదాం
జయశ్రీగారు మీరు బస్సులో ఒంటరిగా ఎక్కారనుకోండి
నా పక్కన ఒక సీటు, వీడి పక్కన ఒక సీటు ఖాళీగా ఉన్నాయనుకోండి. మీరు ఎక్కడ కూర్చుంటారు?
నెక్స్ట్ బస్సులో

# ఎలుక వచ్చె ఇల్లు భద్రం



ఇలపావులూరి మురళీమోహనరావు

8

**హెచ్చరిక**

విరగబడి నవ్వితే గుండె చిక్కబట్టే ఉపిరాడక అవస్థపడేవారు కామెడీ యాక్ట్ 2003 ప్రకారం ఈ సీరియల్‌చదవడం నిషేధం.
ఒకవేళ మీ పొట్టచెక్కలైతే పత్రిక నుంచి ఎలాంటి పరిహారం రాదు. ఈ హెచ్చరిక ఈ సీరియల్ పూర్తయ్యేంత వరకు అమలులో ఉంటుంది.





## జరిగిన కథ

వెంకట్రావు, సుందరి భార్యాభర్తలు.అనూహ్య వాళ్ల పాప. వాళ్ల ఇంట్లో ఓ ఎలుక దూరి నానా రభసా చేస్తూంటుంది. దాన్ని చంపడానికి పెట్టిన 'రాటేట్' కేకును అనూహ్య రుచిచూడడంతో ఉత్తుత్తి పరీక్షల పేర డాక్టరు వేలాది రూపాయలు ఖర్చుపెట్టిస్తాడు. ఇలా కాదని ఎలుకల బోను పెడితే దాన్ని కొరికేస్తుందా ఎలుక. పిల్లిని పెంచితే ఎలుక పీడ విరగడవుతుందని సుందరి చెప్పడంతో వెంకట్రావు మేనేజర్ ఇంటినుండి పిల్లిని తెస్తాడు. వారం రోజులు గడిచినా పిల్లి ఎలుకను పట్టదు. అర్ధరాత్రి లేచి పిల్లి ఏం చేస్తోందో చూద్దామనుకుంటారు వెంకట్రావు దంపతులు.

(ఇక చదవండి)

దొంగను పోలీసు స్టేషనుకు దాసుకెళుతున్నాడు వెంకటసామి.
"సార్... వానొచ్చేట్టుంది. ఇంటికెళ్ళి గొడుగు తెస్తాను" చెప్పాడు దొంగ.
"అయ్.. వదిలేస్తే పారిపోదామనా? నీ ఎత్తులు నా దగ్గర సాగవు. నువ్విక్కడే ఉండు. నేను వెళ్ళి తెస్తాను" వెళ్ళాడు వెంకటసామి.
ఈ సీరియల్‌లో కనకలింగం కూడా ఆ బాపతే.

# ఎలుక వచ్చె ఇల్లు భద్రం

రాత్రి ఒంటి గంటైంది.

వెంకట్రావును గిల్లింది సుందరి. ఉలిక్కిపడి గావుకేక పెట్టి లేచాడు వెంకట్రావు.

"ఉష్... అరవకండి మెల్లగా లేవండి" అన్నది సుందరి.

"ఓసి నీ మొగుడు కలెక్టరు గానూ. దానికింత గట్టిగా గిచ్చాలా?"

"గిచ్చలేదు, గిల్లాను, అయినా పెళ్ళైన కొత్తల్లో నా చేత అడిగి మరీ గిచ్చించుకోలేదూ?"

"ఆ రోజులు వేరు. ఆ అందాలు వేరు. ఇంతకూ ఎందుకు లేపినట్లు?

"కాస్త నౌకా విహారం చేద్దామని..."

"పద.. హాయిగా లాహిరి లాహిరి లాహిరిలో అని పాడుకుంటూ అలా పండు వెన్నెట్లో తిరిగొద్దాం."

"హు... నా బతుక్కు అదొకటే తక్కువ."

"రసపట్టులో తర్కాలు కూడదోయ్." సుందరిని కౌగిట్లో బిగించాడు వెంకట్రావు.

డొక్కలో నొక్కేనరికి కీచుమన్నాడు వెంకట్రావు.

"అయ్యో... మనం ఇపుడు లేచింది మన పిల్లి ఏంచేస్తున్నదో చూద్దామని"

"ఓ... మర్చిపోయాను. లే... పద..." లేచాడు వెంకట్రావు.

ఇద్దరూ మెల్లగా చప్పుడు కాకుండా అడుగులో అడుగులువేస్తూ నడవసాగారు. ఒక మూల గుడ్డల్ని కొరుకుతున్న ఎలుక తోకమీద కాలు వేసింది సుందరి. అరికాల్లో పొడవాటి తోక మెత్తగా తగిలేసరికి వళ్లంతా జలదరించి పెద్దగా అరిచింది సుందరి. తెగబలిసిన ఎలుక ఇద్దరి కళ్ళముందే మరో గదిలోకి దూరింది.




"భయపడకు. ఎలుకేలే" ఊరడించాడు వెంకట్రావు.

"దీన్దుంపతెగ... మనం రోజూ మైసూర్ శాండల్ సబ్బుతో నాలుగు సార్లు స్నానం చేసినా చర్మమంతా గరగరలాడుతుంది. జన్మలో స్నానం అన్నది చెయ్యకపోయినా ఈ వెధవ జంతువుల చర్మం మాత్రం స్పాంజిలా, దూదికంటే మెత్తగా ఉంటుంది. పామేమో అనుకుని హడలి పోయాను." గుండె పట్టుకుని అన్నది సుందరి.

ఇద్దరూ కలిసి హాలంతా వెదికారు. పిల్లి కనిపించలేదు.

"ఎటుపోయిందబ్బా ఇది? పూర్వం మా తాత కూడా ఇంతే. రాత్రి అందరితో పాటు పడుకునే వాడు. అర్ధరాత్రి లేచి చూస్తే మంచం మీద కనిపించేవాడు కాదు. మళ్ళీ తెల్లవారి లేచి చూస్తే మంచం మీదే ఉండేవాడు." అన్నాడు వెంకట్రావు.

"మీ బామ్మ దగ్గరకు వెళ్ళేవాడేమో!"

"ఉహు... ఊరి పొలిమేరల్లో కొన్ని పూరి గుడిసెలుండేవి. తాతకు అక్కడ ఒక సెకండ్ సెటప్పుండేదట. దానికోసం రాత్రి పదకొండింటికి మూడు మైళ్ళు నడిచి వెళ్ళేవాడట. అలాగే దీనికి కూడా ఎక్కడైనా..."

"చాల్లేండి... ముందు పిల్లిని చూద్దాం పదండి" వెతకసాగింది సుందరి.

వంటింట్లోకెళ్ళారిద్దరూ ఆ దృశ్యం చూసి కడుపు రగిలిపోయింది సుందరికి. స్టౌ పక్కన ముడుచుకుని పడుకుని గాఢనిద్ర పోతున్నది పిల్లి.

'ఆహా! ఏం పిల్లిని తెచ్చారండీ! రాత్రంతా మేలుకొని మర్నాడు పగలు నిద్రపోయే కొత్తపెళ్ళి కొడుకులా గురకలు పెట్టి నిద్రపోతున్నది. జన్మ ధన్యం" వెక్కిరిస్తూ అన్నది సుందరి.

"అరగంటక్రితం మనం లేచి నేను గావుకేక పెట్టి, నువ్వు కెవ్వున కేకపెట్టి ఇంత శబ్దాలు చేస్తున్నా ఇది ఈ విధంగా నిద్రపోతున్నదంటే దీనికెంత కొవ్వెక్కిందో చూడు" పిల్లిని చేత్తో గుద్దాడు వెంకట్రావు.

పిల్లిలేచి భయంకరంగా అరిచి కాలితో వెంకట్రావు చేతిని గీరి మరో గదిలోకి పారిపోయింది. పిల్లి గీరిన చోట చర్మం లేచింది.

"అబ్బబ్బ...బ్బ.." అన్నాడు వెంకట్రావు చేతిమీద ఊదుకుంటూ.

"ఎంత విశ్వాసంలేనిదీ పిల్లి! ఛీ ఛీ.. మనుషులూ అలాగే ఉన్నారు. జంతువులూ అలాగే ఉన్నాయి. ఎవ్వరికీ విశ్వాసం అన్నది లేదు. ముందు చేతికేదైనా మందు రాస్కోండి. లేకపోతే సెప్టిక్ అయి మళ్ళీ డాక్టరు దగ్గరకు పోవాల్సొస్తుంది." అన్నది సుందరి.

"మైగాడ్... మళ్ళీ డాక్టరన్నమాటెత్తకు. ఇప్పటికే తలవాచిపోయింది. కాస్త పౌడర్ రాసుకుంటాలే. పద పడుకుందాం." బెడ్‌రూమ్‌లోకి దారితీశాడు వెంకట్రావు.

"ఇంత బద్ధకపు పిల్లిని నా జన్మలో చూడలేదు. తిని దున్నపోతులా నిద్రపోవడం తప్ప ఎలుకలను పట్టుకోవాలన్న జ్ఞానమే లేదు. బద్ధకం తప్ప బుద్ధిలేని మొద్దు." తిట్టిపోసింది సుందరి.

"సర్లె... ఎన్ని తిట్టినా దాని కర్ధం కాదులే. ఇకరా.." పిలిచాడు వెంకట్రావు.

****



# ఎలుక వచ్చె ఇల్లు భద్రం

ఇలపావులూరి మురళీమోహనరావు

బీరకాయ పీచు బంధుత్వాలు మనుషులకే కాదు,
జంతువులకు కూడా ఉంటాయి.
పిల్లికి ఎంతమంది బంధువులున్నారో ఈ సీరియల్‌లో చదవండి.

"ఏంటి సుందరిగారూ అదోరకంగా ఉన్నారు? వంట్లో బాగాలేదా?" మర్నాడుదయం దార్లోంచి పలకరించింది ఆండాళ్ళమ్మ.

"ఒంట్లో బాగానే ఉందండి. ఎలుకల పోరుతో చచ్చిపోతున్నాం." చెప్పింది సుందరి.

ఆండాళమ్మకు చాలా ఆనందం కలిగింది. పైకి మాత్రం చాలా విచారంగా ముఖం పెట్టింది.

"ఏదో పిల్లిని తెచ్చారుగా? అది ఎలుకను పట్టలేదా?"

"అది మహా బద్ధకపు పిల్లి. ముప్పొద్దులా తిని తాగి రాత్రి మా కంటే ముందుగా నిద్రపోతుంది. ఎలుక దిగులుకంటే దీని దిగులు ఎక్కువై పోయింది."

"ఈ మాత్రం దానికే ఇంత విచారించాలా? నన్నడిగితే ఏదొక ఉపాయం చెప్పనా?"

"ఏం చెయ్యమంటారో చెప్పండి"

"దానికి ఆహారం ఏం ఇస్తున్నావు"

"మూడు పూట్లా పాలు, మేం అన్నం తినేటపుడు పెరుగన్నం"

"అదీ సంగతి! దాన్ని ముప్పొద్దులా అలా ఎద్దును మేపినట్లు మేపుతుంటే ఇక ఎలుకను పట్టాల్సిన ఖర్మ దానికేం పట్టింది? కడుపు నకనక లాడుతుంటేనే మనిషైనా, జంతువైనా పనిచేసేది. రెండు రోజులపాటు దానికి అసలేం పెట్టకు. అప్పుడు కడుపు మాడి ఎలుకను పడుతుంది" చెప్పింది అండాళమ్మ.

"అలాగా! ఇవాల్టినుండీ అలాగే చేస్తాను" అన్నది సుందరి.

ఆండాళమ్మ పకపక నవ్వుకుంటూ లోపల కెళ్ళింది.

ఆ రాత్రి పిల్లికి ఏమీ పెట్టకుండా పడుకున్నారిద్దరూ. అర్ధరాత్రి నుంచి మ్యావ్ మ్యావ్ మని అరవడం మొదలుపెట్టింది.

"ఏవండోయ్... వింటున్నారా? అరుస్తోంది" అన్నది సుందరి.

"చావనీ దొంగముండను. ఎలుకను పట్టిందాకా దానికి పచ్చి మంచినీళ్ళు కూడా పోయద్దు" చెప్పాడు వెంకట్రావు.




"వాత పెడతాను. దాని రోగం అలాగే కుదరాలి, పడుకోండి" దుప్పటి ముసుగు తన్నింది సుందరి.

తెల్లవారి లేవగానే అక్కడక్కడ రక్తపుబొట్లు కనిపించాయి. "ఏవండోయ్... ఏంటీ రక్తం? వామ్మో... ఎవరైనా చేతబడి చేశారా ఏంటి మనకు" గాభరాపడి వెంకట్రావును లేపింది సుందరి.

వెంకట్రావు ఉలిక్కిపడి లేచాడు. రక్తపు బొట్లను చూస్తూ వంటింట్లోకెళ్ళారు. చీలికలు పేలికలై కనిపించింది ఎలుక.

"వావ్... ఎలుకండీ! చచ్చింది" చప్పట్లు కొట్టింది సుందరి.

"శభాష్... పిల్లంటే నీవే పిల్లీ... హేట్సాఫ్ టూ యూ..." సెల్యూట్ చేశాడు వెంకట్రావు.

"దేనిపని అది చెయ్యాలి కానీ మనం ఎన్ని ప్రయత్నాలు చేస్తే ఏంలాభం? మనం మొదటే ఈ పని చేసుంటే పధ్నాలుగు వేలు ఆ డాక్టరుగాడి బొందన పెట్టుండే వాళ్ళం కాదు. నాకు కనీసం నాలుగు గాజులు వచ్చుండేవి" విచారంగా అన్నది సుందరి.

"ఏం చేస్తాం? ప్రాప్తం ఉండాలి. జరిగిందేదో జరిగింది. ఒక పెద్ద పీడ వదిలింది" అన్నాడు వెంకట్రావు ఎలుకను కాలితో తంతూ.

"ఊ..ఊ..చచ్చిన పామును చంపడానికి అంతా తయారే" వెక్కిరించింది సుందరి.

"ఇక ఈ పిల్లిని వదిలించుకోవాలి. దీనికి ఇక నుంచీ అన్నం పెట్టకు" అన్నాడు వెంకట్రావు.

"ఇక అన్నమా సున్నమా? దీన్ని మేపలేక చచ్చాం. పైగా దీనికి టీవీ చూసే జబ్బుంది. మీరు ముఖం కడుక్కునిరండి కాఫీ తాగుదాం" డికాక్షన్ వేస్తూ అన్నది సుందరి.

ఏమైందో ఏమో తరువాత రెండు రోజుల పాటు పిల్లి కనిపించలేదు.

"ఇదేదో విచిత్రమైన పిల్లిలా ఉందే! ఎలుకను చంపగానే తన డ్యూటీ అయిపోయినట్లు ఎక్కడికో వెళ్ళినట్లుంది" సంతోషంగా అన్నది సుందరి.

"రియల్లీ.... రాక్షసుడిని చంపగానే దేముడు అవతారం చాలించినట్లు మన ఎలుకను చంపడానికే వచ్చినట్లుంది ఈ పిల్లి. దీన్లో భగవదంశ ఉంటుంది. నా ఉద్దేశ్యంలో అది మరొకరింటికి పోయుంటుంది" అన్నాడు వెంకట్రావు.

"అవును పాపం దాన్ని అనవసరంగా ఆడిపోసుకున్నాం. నిజంగా మేలిమిజాతి మార్జాలం" బాధగా అన్నది సుందరి.

-(ఇంకావుంది)

జూన్ 19 జంధ్యాల వర్ధంతి సందర్భంగా...



# కొమ్మ కొమ్మకో సన్నాయి...

# జంధ్యా వందనం



హాస్యం, సంగీతం కలిసి ఒకే జన్మ ఎత్తిన హాసం, నిన్నటి దరహాసం జంధ్యాల ఇతిహాసంలో చేరిపోయి రెండేళ్ళు గడిచాయి. ఎన్నేళ్ళు గడిచినా ఆయన మధురస్మృతికి మరణం లేదు. ఎంత కాదనుకున్నా కనపడకుండా కన్నీళ్ళు కళ్ళతోనే మింగడం కన్న శరణం లేదు.

తెలుగుసినిమా అపహాస్యం పాలెక్కువై అపహాస్యం పాలై పాలిపోతున్న ఈనాడు జంధ్యాల తన వంశ వృక్షంతో సహా దర్శనమిచ్చి ఆదుకుంటాడు. పానుగంటి, కందుకూరి, గురజాడ, చిలకమర్తి, భమిడిపాటి, మొక్కపాటి, మునిమాణిక్యం, మొదలయిన శాఖోపశాఖలతో విరాజిల్లే ఆ హాస్య కల్పవృక్షానికి మూల స్థానంలో కూర్చుని పిబరే 'హాస్యమరసం' అని రస పిపాసులకు తన కలం నుంచి వెలువడిన హాస్యరసకలశాలను అందించిన తెలుగుజాతి చిరునవ్వు జంధ్యాల.

**1972**లో బి.యన్.రెడ్డిగారి చిత్రానికి పనిచేయాలని వచ్చి ఆ పని పనికిరాకపోవడంతో కె.విశ్వనాథ్ గారికి పరిచయం అయినారు జంధ్యాల, పరిచయం చేసింది ఆయన రాసిన నాటకమే - 'సంధ్యారాగంలో శంఖారావం'. ఆ తరువాత 'సిరిసిరిమువ్వ' చిత్రంతో ప్రత్యక్షంగా ఆయన రంగప్రవేశం చేశాడు. అప్పటినుంచి పాటలు వేటూరి మాటలు జంధ్యాల మార్కు చిత్రాలు ఎన్నో బాక్సాఫీసు పరిభాషలో 'సూపర్ డూపర్ హిట్స్' అయ్యాయి- సప్తపదులూ సాగరసంగమాలూ, శంకరాభరణాలు ఒక వంక, వేటగాళ్లు, జస్టిస్ చౌదరీలు, ఆఖరిపోరాటాలూ మరొకవంక..... ఎన్నో ఎన్నెన్నో-

జంధ్యాల దర్శకుడుగా తీసిన చిత్రాలు దాదాపు అన్నీ తెలుగు సరసాల సాహితీ సంగీత సంచికలే. ఆయన తొలిచిత్రం 'ముద్దమందారం' పాటలు రాయడానికి 'నాగార్జునసాగర్' వెళ్లాం. జంధ్యాల నేను వేరే సిట్టింగులకు, అంతకుముందు అక్కడికి వెళ్లడం రెండుమూడుసార్లు జరిగింది. మానవ నిర్మిత మహాసాగరం, మంచినీటి సముద్రం, కృష్ణవేణమ్మ హృదయవైశాల్యం కలసి సాక్షాత్కరించే ఆ చోట పుట్టిన పాటలు మధురాతి మధురాలు. అందులో జంధ్యాల వంటి సాహితీకృషీవలుడితో, సంగీత ప్రియుడితో నాగార్జున సాగర్‌లో, కన్యాకుమారిలో, విశాఖబీచిలో, ఫిషర్‌మన్స్‌కోవ్‌లో, కేరళలో గడిపిన క్షణాలు మరవురానివి. 'సీతాకోకచిలుక' చిత్రానికి దర్శకుడు భారతీరాజా. తను చిత్రాన్ని ఎక్కడైతే తీస్తున్నాడో అక్కడే ఆ పరిసరాల్లోనే మాటలు, పాటలు రాస్తే బాగుంటుందని మమ్మల్ని అక్కడకు తీసుకువెళ్లాడు. త్రిముఖాలుగా మహాసాగరం కలిసేచోట, స్వామి వివేకానందుడు సాగరంలో నిలబడి తపశ్చర్య ఆచరించినచోట, సూర్యోదయా స్తమయాలు జనన మరణాల అద్వైతాన్ని చాటే చోట నేను పాటలు, ఆయన మాటలు రాసిన చిత్రం 'సీతాకోకచిలుక'.



'జానకి కన్నుల జలధితరంగం
రాముని మదిలో విరహ సముద్రం
చేతులు కలిపిన సేతు బంధనం- ఆ
సేతు హిమాచల ప్రణయ కీర్తనం సాగర సంగమమే
ప్రణవ సాగర సంగమమే'

అన్న గేయం - జంధ్యాల దృష్టిలో వాగ్గేయం- అక్కడే పుట్టింది.

'భారత భారతి పద సన్నిధిలో
కులమత సాగర సంగమశృతిలో' జరిగిన కథ తీయడానికి రాయడానికి ఒకే ప్రదేశం ఎన్నుకున్న భారతీరాజా ఎంతటి కళాతపస్వి!

హాస్యమనే అచ్ఛాదనతో చిత్రాలు తీసి జీవన వేదాంతాన్ని బోధించిన రాజ్‌కపూర్,

'జీనాయహాఁ మర్‌నాయహాఁ
ఇస్‌కే శివా జానా కహాఁ' అని శైలేంద్ర మహాకవి ద్వారా జీవిత సత్యాలెన్నో అవిష్కరించాడు. ఒక ప్రేమగీతంలో ప్రేయసీ ప్రియులు 'రేపు నీవు వుండవు నేనూ వుండను. కానీ లోకం, కాలం ఇలాగే వుంటాయి. ప్రేమ ఎప్పుడూ వుంటుంది. పాటా బ్రతికేవుంటుంది- మనం మాత్రం వుండము' అనే భావాన్ని రాజ్‌కపూర్ నర్గీస్‌లు ఎన్నిసార్లు పాడుకోలేదు. జంధ్యాలకు ఆత్మ గురువు రాజ్‌కపూర్. ఈ సంగతి రహస్యంగా ఒకనాడు చెప్పాడు జంధ్యాల. తన ప్రతి చిత్రంలోను ప్రేమ గురించి విధిగా ఒక పాట వుండాలని అదే చివరికి మిగిలేదనీ ఆయన అనేవాడు. 'అమరజీవి' చిత్రంలో 'విప్రనారాయణ' రూపకం పెట్టినపుడు అందులో 'నశ్వరమిది నాటకమిది నాలుగు గడియల వెలుగిది' అనీ 'కడలిని కలిసేవరకే కావేరికి రూపు వున్నది' అనీ రాసిన క్షణంలో ఆయన కన్నీళ్లతో నవ్విన క్షణం మరువలేను.

చినుకులా రాలి నదులుగా సాగి
వరదలై పోయి కడలిలా పొంగు
నీ ప్రేమ నా ప్రేమ
నీ పేరే నా ప్రేమ
హిమములా రాలి సుమములై పూసి
ఋతువులై నవ్వి మధువులా పొంగు
నీ ప్రేమ నా ప్రేమ
నీవేలే నా ప్రేమ
మౌనమై మెరిసి గానమై పిలిచి
కలలతో అలిసి గగనమై ఎగసె
నీ ప్రేమ నా ప్రేమ
నీవేలే నా ప్రేమ
భువనమైనా గగనమైనా
ప్రేమమయమే సుమా ప్రేమ
మనమే సుమా'

వంటి గీతాలను తన బ్రతుకుతోటలో పూయించుకున్న తోటమాలి జంధ్యాల. తనతో పాటు నాకూ..... ఈ వాక్యం ఎలా ముగించాలో తెలియక అర్థోక్తిగా... ఆయనలా మిగిలి పోతోంది. పువ్వులా పుట్టి పువ్వులా రాలిపోయిన చంటబ్బాయి, అమరజీవి జంధ్యాల.

'ఒక ప్రేమ అమృత శిల్పం
ఒక ప్రేమ బుద్ధుడి రూపం
ఒక ప్రేమ రామ చరిత్రం
ఒక ప్రేమ గాంధీతత్వం'

ఇవి శాశ్వత సత్యాలు, ప్రాణకావ్యాలు, ఇవి రాయించడం ఒక ఎత్తు - ఆ రాసిన అక్షరాత్మలని ఆవిష్కరించడం మరో ఎత్తు. ఈ రెండు సందర్భాలలో అతను ఎవరికీ అందనంత ఎత్తుకు ఎదిగిపోయాడు. చిత్రీకరణతో పదాలకు భాష్యం చెప్పిన భావుకుడు జంధ్యాల. రంగులనూ సెట్స్ మొదలైన హంగులనూ నమ్ముకుని జంధ్యాల ఏనాడూ చిత్రాలు తీయలేదు. లేలేత జీవితాల కలనేత మమకారాల పడుగు పేకలవంటి భావాలను, ఆవేశాలను, ఆనందాలను, ఆగ్రహాలను, అనురాగాలను జంధ్యాల వలె గుర్తించిన వారు, గుర్తుంచుకున్నవారూ అరుదు.

'అలివేణీ ఆణిముత్యమా
నీకంట నీటి ముత్యమా
ఆవిరి చిగురో ఇది ఊపిరి కబురో
స్వాతివానా లేత ఎండలో ఇవి-
జాలినవ్వు జాజి దండలో-'

ముక్కుపచ్చలారని కుర్రబెంగల లేత గుండెల చప్పుడు వినిపించాలని ఇవాళ ఎవరనుకుంటున్నారు! అసూర్యంపశ్యల పరువాల పాల పొంగుల కెరటాల పవళించిన..... వటపత్రశాయిగా పవళించిన... బాలకృష్ణుడెవరిక్కావాలి? జయదేవుడి పదప్రయోగం ఏ శృంగార మహస్సు నుంచి కణకణలాడుతూ ఎగసి వచ్చి కవితగా రగిలిందో (హుతాశనతల్పం వంటి ప్రయోగాలు, వాటిలో వున్న పద అర్థ వర్ణ శబ్ద విన్యాసాలు) చెబితే వినే వారెవరు? ఈ ప్రశ్నలకు జవాబు చెప్పిన మహాజ్ఞాని జంధ్యాల, అతను తీసిన చిత్రాలు, వాటిలో మాటలు పాటలు అన్నీ అతని సమాధానాలే.



'నీలాలు కారేనా కాలాలు మారేనా
నీ జాలి నే పంచుకోనా
నీ లాలి నే పాడలేనా
జాజి పూసేవేళ జాబిల్లి వేళ
పూలడోల నేనుకానా'

జంధ్యాల చిత్ర సాహితీ సంపుటాలు సవ్యాఖ్యానంగా వెలువడిననాడు కులపతి, మధురమనస్వి అడవి బాపిరాజుతోబాటు మనకు మిగిలే మరో మానవుడు మాననీయుడు జంధ్యాల అని తెలుస్తుంది.

జంధ్యాల మనసు వెన్నముద్ద, కళ్లు వెన్నెలపొద్దులు, మాట అతి సున్నితం.... సారణి వీణ మీటినట్లు, ఊపిరి వేణువూదినట్లు లలితం- నవరసాలు అతనికి నవ్వురసాలే-

పెదకళ్లేపల్లిలో తెలుగు వసంతోత్సవాలు జరిగిన మూడు రోజులూ జంధ్యాల అక్కడే వుండి హాస్యరసపు జల్లులతో శ్రోతలను ముంచెత్తడంతో పాటు ఎత్తిపొడుపుల మెరుపులతో విమర్శల ఉరుములతో, పొట్టల్ని చెక్కలు చేసి నవ్వుల్ని పండించు రసపిడుగులతో ఉర్రూతలూగించాడు.

సినీ సాహితీప్రపంచంలో హాస్యాయుధాన్ని సవ్యసాచిలా ప్రయోగించిన వారు శ్రీ పింగళి నాగేంద్రరావుగారు, శ్రీ జంధ్యాల గారే. భాషా వ్యాకరణ శాస్త్రాలనుంచీ, సాంఘిక దురాచారాల నుంచీ వ్యంగ్య వైభవంతో హాస్యరసాన్ని జోడించి భాషను పెంచి వీరతాళ్ళు వేయించుకున్న మొనగాళ్లు ఎందరున్నా వీరిద్దరి స్థానం మరొకరికి అందదు. హాస్యరస ప్రయోగం చేసినవారిలో శ్రీ మల్లాది రామకృష్ణశాస్త్రిగారు ప్రథములు. శాస్త్రిగారి ప్రాసక్రీడలు కొన్ని ద్విత్వాక్షరిగా సాగి ప్రజారంజకమైనాయి- 'రహస్యం' చిత్రంలో రాజసులోచన, రేలంగి సంభాషణ మరపురానిది.

'ఎవరు మీరు.....?,
సిద్ధులం.....
సిద్ధులకీ బుద్ధులేమిటో!
సిద్ధాన్నం చూస్తే ఎవరికి నోరూరదు?

ఇత్యాదిగా సాగిన ప్రాసక్రీడ అందరికీ అర్థమయ్యే భాషలో జంధ్యాల అనేక సందర్భాలలో చేశారు, 'వేటగాడు' చిత్రంలో రావుగోపాలరావు, స్టూవర్టుపురం పోలీస్‌స్టేషన్, స్టేషన్ మాస్టరు సినిమాలలో ప్రాసక్రీడ అలాంటిదే. బ్రాహ్మణీకపు ప్రథమ కోపాలు, గ్రంధాక్షరీ శాపాలు, తిట్లు, తిట్టిన తిట్టు తిట్టకుండా తిట్టడాలు ఎన్నో జనాన్ని విపరీతంగా ఆకట్టుకునే విధంగా రాయగల జంధ్యాల హాస్యరచనకు కొత్త వరవడి దిద్దాడు. ముళ్లపూడి వారంటే గురుత్వంతో కూడిన అభిమానం ఆయనకి.

రచనలోనే కాక నిత్య జీవితంలో కూడా హాస్యరసానికి, సరసానికి పెద్దపీట వేశాడు జంధ్యాల. శ్రీనాథ మహాకవిలో ఎంత సరసం, భోజనశాలా పాండిత్యం వుండేవో అంతావున్న చిరుకవిసార్వభౌముడు. తెలుగువారి వంటకాలమీద, వాటి రుచుల మీద, పేర్లమీద ఎన్నెన్ని రసగుళికల వంటి సంభాషణలు ఆయన రాశాడో!

'రెండు జెళ్ళ సీత' చిత్రంలో
'మాగాయే మహాపచ్చడి
పెరుగేస్తే మహత్తరి
అదివేస్తే అడ్డవిస్తరి
మానిన్యాం మహాసుందరి'

ఇలా ఊరగాయస్తోత్రాలు దండకాలు రాయించిన తెలుగు దర్శకుడు ఆయన. ఈ పట్టున ఆయనలో 'మాయాబజార్'లో గోంగూరోపాఖ్యానం రాసిన పింగళివారి పట్టు మనకు చిక్కుతుంది. కురుసార్వభౌముడైన రారాజు 'అది లేనిదే ముద్దయినా ముట్టరు' అన్నంతవరకూ వెళ్లింది. అటువంటి శిఖరాగ్ర హాస్యం జంధ్యాలలోనూ కనిపిస్తుంది.

శ్రీవారికి ప్రేమలేఖ, నాలుగు స్తంభాలాట, ఆనందభైరవి, రెండుజెళ్ల సీత, రెండు రెళ్లు ఆరు, మూడు ముళ్లు వంటి చిత్రాలలో ఆయన హాస్యరసంతోనూ, అది నింపిన పాత్రలతోనూ చేసిన ప్రయోగాలు అపూర్వం, తన కోరిక నెరవేరితే పక్కవాడికి గుండు గీయిస్తానని మొక్కుకోవడం, అల్లు రామలింగయ్య నటనలో విచిత్ర హిందీ భాషను ఉపయోగించడం అటువంటి ప్రయోగాలే.

హాస్యరసం కోసం మిగతా రసాలను చిన్నచూపు చూడలేదు జంధ్యాల. ఉదాత్తమైన సన్నివేశాలు సృష్టించి ఉత్తమ సాహిత్యం గల పాటలను రాయించుకున్న రసహృదయం ఆయనది.

'దొరలనీకు కనుల నీరు
దొరలదీలోకం మగదొరలదీ లోకం
కనులలోనే దాచుకోవె
కడలిలా శోకం - కన్నెపడుచులా శోకం'
అని 'నాలుగు స్తంభాలాట' చిత్రంలోను.
'చైత్రము కుసుమాంజలి
పంచమస్వరమున ప్రౌఢ కోకిలలు
పలికే మరందాల అమృత వర్షిణి'
అదే పాటలో
'శయ్యలలో కొత్త వయ్యారమొలికే
శరదృతు కావేరిలా కొంతసాగి' వంటి ప్రకృతి వర్ణనలతో 'ఆనందభైరవి' చిత్రంలోను
'మనసా తుళ్లిపడకే అతిగా ఆశ పడకే
అతనికి నీవు నచ్చావో లేదో
ఆ శుభ ఘడియ వచ్చేనోరాదో
తొందరపడితే అలుసే తెలుసా మనసా'
అని కన్నెమనసు భాషలో తేటగా, తెలుగులో 'శ్రీవారికి ప్రేమలేఖ' చిత్రంలోను.
'మల్లెపూల మారాణికి బంతిపూల పారాణి'
వంటి మరెన్నో పాటలు ఏరికోరి తన చిత్రాలలో చలన శిల్పాలుగా దర్శనమిచ్చిన ఆ ఘనత జంధ్యాలదే.

రమేష్‌నాయుడు, రాజన్ నాగేంద్ర జంధ్యాల సంగమంలో పుట్టిన

సంగీత గంగలో మునగని, మునిగి ముక్తి పొందని తెలుగు రసజ్ఞులు లేరంటే అతిశయోక్తి కాదు.

ప్రేమ అనే రెండక్షరాల మాటను నిర్వచించడానికి ప్రపంచ భాషలన్నిటిలోనూ వున్న వేలాది అక్షరాలు కూడా చాలవు అని జంధ్యాల తరచు అంటుండేవాడు. అందుకే ఆ ప్రేమ కీర్తనగా నాచేత దాదాపు పదిపాటలు రాయించాడు ఆయన. ప్రకృతి ఒళ్లో తలదాచుకున్న పసితనం



ఆయనది. నేను రాసిన

'కొబ్బరాకు గాలి మబ్బుకేసింది

ఉలికిపడ్డ మబ్బు ఉరిమిచూసింది'

పాట ఆయనకు ఎంతో యిష్టం. ఈ పాట తన 'నాలుగు స్తంభాలాట'లో ఎంతో సందర్భశుద్ధిగా ఉపయోగించుకున్నాడు.

పాటల రచయితగా నా జన్మకు ధన్యత చేకూర్చిన ద్రష్టలు, సృష్టికర్తలలో జంధ్యాల ఒకరు.

నన్ను, నా హావభావాలను, నా మాటలను మహా మురిపెంగా చూసుకున్న 'నా వాడు' జంధ్యాల. నన్ను నటుడుగా చూడాలని ఆయన తపన పడేవాడు. తన చిత్రం 'మల్లెపూవు'లో కకుంభంజకం స్వాములవారుగా నాచేత వేషం కూడా వేయించి మురిసిపోయాడు.

ఆయన జీవితం ఎంత చిన్నదైనా అది కలకాలం మను చరిత్ర! ఆ మనుచరిత్ర కృతిభర్త వెళ్ళిపోతే 'కృష్ణరాయలతో దివికేగలేక బ్రతికి యున్నాడ జీవచ్ఛవంబనగుచు' అనుకున్న పెద్దన శోకసముద్రపు ఉప్పెన కెరటాలు ఈ కన్నీటి నీరాజనాలు- పెద్దన పాదధూళికి సైతం సరితూగే యోగ్యత నాకు లేదని తెలుసు. కానీ వియోగంలో, విషాదంలో, విధిరాతలో అనుభవాలు మాత్రం ఒక్కటే కదా!

జంధ్యాల సభలలో అప్పుడప్పుడు విసిరిన చెణుకులు శ్రోతల హృదయాలకు చక్కిలిగింతలు పెట్టడమే కాక లోలోతుగా ఆలోచిస్తే నిగూఢమైన విమర్శలుగా గోచరించేవి. మామూలు గోష్ఠులలో, కథా చర్చలలో ఆయన వాక్చాతుర్యం సరే సరి; ఒకసారి ఒక కథా చర్చలో వేషం వెయ్యాలనే దురద వున్న ఒక యువకుడిని పెట్టుబడి సగం నువ్వు భరిస్తావా అని అడుగుతాడు నిర్మాత. పెడతాను కానీ నాకు వేషమివ్వడమే కాకుండా పోస్టర్స్ అన్నిటిలోను నా పేరు, దానికింద 'నటుడు-సహ నిర్మాత' అని విధిగా వెయ్యాలంటాడు ఈ దురద రాజేశ్వరరావు. కథలో ఇతనికి నిర్మాతకీ విరోధం రావాలి. ఏం చేయాలి అని చర్చ. వెంటనే జంధ్యాల నిముషం కూడా ఆలోచించకుండా ఏముందీ! తీరా పబ్లిసిటీ అంతా అయిపోయి దేశమంతా పోస్టర్సు అంటించేస్తారు, ఆఫీసులోను, బైటా అందరూ పొట్ట చెక్కలయ్యేట్టు నవ్వుతూ వుంటారు. ఇతనూ చూస్తాడు ఏమిటా అని! అతని పేరు కింద 'సటుడు-నహ నిర్మాత' అని వుంటుంది' అన్నాడు. నిజంగా అందరూ పగలబడి నవ్వారు.

ఒకానొక సభలో బాలు, జానకి, శైలజ వరుసగా ప్రసంగించి శ్రోతల కళ్ల వెంట ఆనంద బాష్పాలు తెప్పిస్తే ఆ తర్వాత ప్రసంగం మొదలు పెడుతూ జంధ్యాల 'ఇంతవరకు 'పాడు' మనుషులు ముగ్గురూ వచ్చి కంట తడి పెట్టించారు' అనగానే సభాసరస్వతి పెద్దగా నవ్వింది.

జంధ్యాల ప్రసంగాలు సమయోచితంగా చెప్పే పిట్ట కథలనవచ్చు. వేదాంత తత్త్వాన్ని బోధించడానికి భగవాన్ శ్రీ రమణ మహర్షి ఇలాగే పిట్ట కథల ద్వారా గోరుముద్దలు జ్ఞాన శిశువుల చేత తినిపించేవారు. అవన్నీ రమణో పనిషత్తులుగా మిగిలిపోయాయి. అలాగే జంధ్యాల చమత్కారాలూ చెణుకులూ ఒక పుస్తక రూపానికి వచ్చి శాశ్వత నిధిగా ఆంధ్రులకు మిగిలిపోవాలి. ఎవరు ఇందుకు పూనుకున్నా దానికి సర్వసహకారాలు అందించే జంధ్యాల అభిమానులు ఎందరో వున్నారు.

ఒకసారి వేమిద్దం, మద్రాసు నుంచి తిరువనంతపురం వెళ్లవలసి వచ్చింది. గాలివాన, వాతావరణం అనుకూలంగా లేదు. ఆప్రో విమానం వాహనం, ఇద్దరం అలాగే విమానాశ్రయానికి చేరాం. ఇంతలో ప్రకటన. సాంకేతిక లోపం వల్ల విమానం గంట ఆలస్యం కావచ్చునని! బయటపడ్డట్టు పైకి కనిపిస్తే నాగరికతా లోపం క్రింద కట్టి అందరూ నవ్వుతారేమో అని కూడా భయపడి విమానాశ్రయంలోనే బింకంగా తిరగడం మొదలుపెట్టాము. ఇంతలో అక్కడొక బోర్డు కనిపించింది. అది ఎయిర్ ఇన్సూరెన్స్‌కి సంబంధించినది, ఆ క్షణంలో ఒకరికి తెలియకుండా ఒకరం 'ఇదేదో అవసరమయ్యేట్టే వుంది'... అనుకున్నాం. అనుకున్నది కాస్తా పైకి అనేశారు జంధ్యాల. 'అయితే చేసేస్తే పోలా' అన్నాను నేను. 'పోతామంటారా' అన్నాడతను. విమానం అనుమానంలో పడింది కదా అన్నాను. 'అది అనుమానంలో పడ్డా అఖాతంలో పడ్డా - మనం మాత్రం సేఫ్‌గానే వుంటాం. పైగా అనవసరంగా ఇన్సూరెన్స్ చేశాం అని బాధపడతాం తర్వాత' అంటూ నవ్వుతూ నవ్విస్తూ అన్నాడు. 'ఏమిటి మీ కంత నమ్మకం! అని అడిగాను. ఆ నమ్మకం విమానం మీద కాదు. మన ఇంట్లో వాళ్ళ చేతి అదృష్టరేఖ మీద' అని నవ్వుకుంటుండగానే విమానం రెడీ అని ప్రకటన వచ్చింది, కేరళ చేరాం.

ఇవన్నీ జీవితం జీవించి వున్న రోజుల్లో జరిగిన సంఘటనలు - సినిమాలు, వాటిలో సంగీతం, హాస్యం, కథ, తనవాళ్ల మీద పెద్ద జోక్ చేసి వెళ్లిపోయాడు జంధ్యాల -

భగవంతుడు ఇంత త్వరగా ఇటువంటి జోక్ జంధ్యాల చేత వేయిస్తాడని అనుకోలేదు.

చాలాకాలానికి కరుణించి భగవంతుడు జంధ్యాలకు ఇద్దరు ఆడపిల్లలను, కవలలను ప్రసాదించాడు. సంగీత సాహిత్య బాల సరస్వతులల్లే వాళ్లాయింట నడయాడుతుంటే చూసే కన్నులకు పండుగగా వుండేది. వాళ్ల బారసాలనాడు ఒక ప్రముఖ స్నేహితుణ్ణి ఆహ్వానిస్తూ జంధ్యాల అన్నమాటలు.... 'వాళ్ళపెళ్లికి నేను ఉంటానో ఉండనో.... కనుక మీరు యిప్పుడేవచ్చి వాళ్లని ఆశీర్వదించి నన్ను ఆనందపరచండి'

కాలధర్మాన్ని, జీవన తత్త్వాన్ని అంత చిన్న వయసులోనే గుర్తించి తృతీయ పురుషార్థాన్ని దాటి వెళ్లిపోయిన జంధ్యాల మహాజ్ఞాని. ఆయనకి అంజలిగా మిగిలిన జీవితాల్లో నాదీ ఒకటి.

చిరంజీవి జంధ్యాలకిదే నా అక్షర సంధ్యా వందనం.

**- వేటూరి సుందరరామ్మూర్తి**

# అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం











మాడిమేలే మాడి కట్టి
కోడి కోడి సేర్‌త్తు విట్ట శీమానే
హలో హలో కమాన్ కమవుట్ శీమానే
ఆకు అంబు సేనై వచ్చి కారు వచ్చి
హలో హలో కమాన్ కమవుట్ శీమానే
పోరడిక్కుం కోమానే
హలో హలో కమాన్ కమౌట్ కోమానే ॥మాడి॥
విశ్వనాథన్ వేలై వేణుం
విశ్వనాథన్ వేలై వేణుం
విశ్వనాథన్ వేలై వేణుం
పొణ్ణుంగ పేచ్చుక్కు బుద్ధియై మాత్తిక్కుం
మూళైయిల్లాదవరే
వేట్టియై మాత్తిక్క శేలైయై కట్టిక్క
వెట్కమిల్లాదవరే
వేలైయిన్ని పోగాదు వేఱు వేలై తేడాదు
పాట్టుప్పాడి కూచ్చల్ పోట్టు
వేలై వాంగువోమ్ ॥వేల॥
విశ్వనాథన్ వేలై వేణుం
విశ్వనాథన్ వేలై వేణుం
విశ్వనాథన్ వేలై వేణుం
రాత్తిరి నేరత్తిల్ తూక్కత్తిల్ నానొరు
రాక్షసన్ పోల్ వరువేన్
నాళైక్కు వేలైక్కు వావన్ను నీ సొల్లుం
నాళివరై పోరితువేన్ ॥రాత్తిరి॥
వానం వన్ను శాయ్‌న్దాలుం మేగం వన్ను వీళ్‌న్దాలుం
వేంగై పోలపాయ్‌న్ను వన్ను వేలై వాంగువోమ్ ॥వానం॥
విశ్వనాథన్ వేలై వేణుం
విశ్వనాథన్ వేలై వేణుం
విశ్వనాథన్ వేలై వేణుం ॥మాడి॥

'కాదలిక్క నేరమిల్లై' (ప్రేమించడానికి తీరికలేదు) చిత్రం తమిళంలో వెలువడిన మంచి హాస్యచిత్రాలలో ఒకటిగా పేరు తెచ్చుకొంది. చిత్ర దర్శకులు సి.వి.శ్రీధర్ మాతృభాష తెలుగు. ఈ చిత్రంలో రెండు జంటలు. కాంచన, ముత్తురామన్ ఒక జంట, రాజశ్రీ, రవిచంద్రన్ రెండవ జంట. నాయికగా కాంచనకూ, నాయకుడుగా రవిచంద్రన్‌కూ ఈ చిత్రమే తొలి చిత్రం.

విశ్వనాథన్ రామమూర్తి సంగీత దర్శకత్వం వహించిన ఈ చిత్రంలోని పాటలు కణ్ణదాసన్ రాశారు. 'మాడి మేలే మాడికట్టి' పాటను పి.బి.శ్రీనివాస్ బృందం పాడారు. ఈ చిత్రం విడుదలైన కొత్తలో విశ్వనాథన్ రామమూర్తి సంగీత కార్యక్రమం ఒకటి జరిగింది. అందులో ఈపాటకు సంబంధించిన ప్రకటన చేస్తూ "ఇప్పుడు పి.బి.శ్రీనివాస్ గారు సంగీత దర్శకులు విశ్వనాథన్ గారిని వ్యతిరేకిస్తూ ఒక పాట పాడనున్నారు" అని చమత్కారంగా చెప్పారు.

కూతురి మాట విని విశ్వనాథన్ అనే ఒక శ్రీమంతుడు కథానాయకుడిని ఉద్యోగంలోంచి తీసేశాడు. తనను ఉద్యోగంలో చేర్చుకోవాలని నాయకుడు తన మిత్రబృందంతో కలిసి అతనిపై పోరాటం మొదలుపెట్టాడు. ఆ సన్నివేశంలోని పాట ఇది -

తమిళ పాటకు తెలుగు అనువాదం చూద్దాం.

"మేడమీద మేడ కట్టి
కోట్లు కోట్లు చేర్చుకొన్న శ్రీమంతుడా
హలో హలో కమాన్ కమవుట్ శ్రీమంతుడా
బండ్లు అమ్ములు సైన్యం పెట్టుకొని కారు పెట్టుకొని
పోరే(ర్?) (బోర్ కొట్టే) సంపన్నుడా
విశ్వనాథన్.. పని కావాలి!
కూతుళ్ల మాటతో బుద్ధి మార్చుకొనే
బుర్రలేని వాడా
ధోవతిని మార్చుకొని చీర కట్టుకోవడానికి
సిగ్గులేనివాడా
ఉద్యోగం ఇవ్వనిదే పోకుండా
వేరే ఉద్యోగం వెతుక్కోకుండా
పాట పాడి అరచి అరచి
పని సంపాదించుకుంటాం
విశ్వనాథన్... పని కావాలి!
రాత్రి వేళలో నిద్రలో నేనొక
రాక్షసుడిలా వస్తాను
రేపటి నుంచి పనికిరా అని నీవు చెప్పే
రోజు దాకా పోరాడుతాను
మిన్ను వచ్చి వాలినా మేఘం వచ్చి పడినా
పులిలా దూసుకు వచ్చి పని ఇప్పించుకుంటాం
విశ్వనాథన్... పని కావాలి!"

పోరదిక్కుం అనే మాటలో శ్లేష ప్రయోగం చేశారు కణ్ణదాసన్. ప్రాచీన కాలంలో ధాన్యాన్ని ఏనుగుల చేత తొక్కించేవారట. దానికి 'పోర్ కొట్టడం' అని పేరు. తమిళంలో ప, బ లకు ఒకటే అక్షరం. పోర్ కొట్టడం - బోర్ కొట్టడం కూడా కావచ్చు.

'కాదలిక్క నేరమిల్లై' ఆధారంగా 'ప్రేమించిచూడు' వెలువడింది. తెలుగు చిత్రానికి సంగీత దర్శకులు మాస్టర్ వేణు. 'వెన్నెల రేయి ఎంతో చలి చలి' తెలుగు చిత్రం కోసం వేణు ప్రత్యేకంగా స్వరపరిచిన పాట. తక్కిన పాటలన్నీ తమిళచిత్రంలోని బాణీలతోనే సాగాయి. 'ప్రేమించి చూడు'లో పి.బి.శ్రీనివాస్ ఎక్కువ పాటలు పాడటం వల్ల టైటిల్స్‌లో ఆయన పేరే మొదట కనిపిస్తుంది. ఆ కింద ఘంటసాల పేరు కనిపిస్తుంది.

'ప్రేమించి చూడు' చిత్రానికి మాటలు రాసిన ముళ్ళపూడి వెంకటరమణ - 'మాడి మేలే మాడి కట్టి' పాట సన్నివేశానికే 'మేడమీద మేడకట్టి' పాట రాశారు. తమిళ గీతంలోని అభిప్రాయాలు తీసుకొన్నా తెలుగు నుడికారాలను సొగసుగా ప్రయోగించి పాటలో తెలుగుదనాన్ని నింపారు రమణ.

ముళ్లపూడి వెంకటరమణ రాసిన మొత్తం సినిమా పాటలు మూడు. వాటిలో ఒకటి 'ప్రేమించి చూడు'లోది. తక్కిన రెండూ 'పక్కలో బల్లెం' చిత్రంలోవి.

తమిళంలోని 'విశ్వనాథన్' (టి.ఎస్.బాలయ్య) తెలుగులో 'బుచ్చబ్బాయి' (రేలంగి) అయిపోయాడు.

తమిళ గీతంలో అక్కడక్కడా కనిపించే అంత్యప్రాసలు తెలుగు పాటలో అంతటా వ్యాపించి ఉండి ఆనందం కలిగిస్తాయి. తమిళంలోని 'శ్రీమంతుడు' తెలుగులో కామందు కావడం వల్ల కామందును 'రా ముందు ..దిగి రా ముందు' అనే వీలు చిక్కింది. కూతుళ్ల మాట విన్న తమిళ శ్రీమంతుడు బుర్రలేని వాడయితే తెలుగు కామందు ఆకతాయి. తమిళంలోని పెద్ద మనిషి పంచె మానేసి చీర కట్టడానికి సిగ్గుపడనివాడని ఉన్నదాన్ని రమణ-'మీసకట్టు తీసివేసి కాసెపోసి కోకచుట్టి గాజులేసు కొమ్మందు' అని తెలుగు నుడికారంతో నింపారు. 'డొక్క చీల్చి డోలు కట్టడం' అనే జాతీయాన్ని విడగొట్టి 'డొక్క చీల్చి వేస్తాము, డోలు కట్టి తెస్తాము' అనడమూ దాంతో బాటు 'డోలు కొట్టి గోలపెట్టి రచ్చకెక్కుతాం' అనడమూ రమణ ముద్రే. తమిళ గీతంలో ఉద్యోగం ఇచ్చేదాకా పోరాడుతూ ఉంటాను' అని ఉండగా తెలుగు పాటలో మరుసటి రోజుకే ఉద్యోగం ఇవ్వాలన్న హెచ్చరిక ఉంది. తమిళంలో మిన్నూ మేఘమూ వాలడం గురించీ, పడడం గురించీ ఉండగా తెలుగు పాటలోని 'మిన్ను విరిగి మీద పడడం; 'మన్ను మిన్ను ఏకం కావడం' వంటి జాతీయాలు పాటలో తెలుగుదనాన్ని పెంచాయి.

తమిళగీతంలోని 'రాక్షసుడు' తెలుగులో 'రాక్షసి' అయిపోయాడు.

ముళ్లపూడి వెంకటరమణ ముత్యం మూడు పాటలతోనే పాటలు రాయడం మానేయడం ఎంత అన్యాయమో 'ప్రేమించి చూడు'లో ఈ పాట చూస్తే తెలుస్తుంది.

**- పి.ఎస్.గోపాలకృష్ణ**



మేడమీద మేడ గట్టి కోట్లు కూడబెట్టినట్టి కామందూ
హలోహలో కమాన్ కమవుట్ రా ముందూ దిగిరా ముందూ
అందుకుంటె జుట్టు పట్టి
అందకుంటె కాళ్లు పట్టు కామందూ
హలోహలో కమాన్ కమవుట్ రాముందూ దిగి రాముందూ
బుచ్చబ్బాయ్ పని కావాలోయ్
బుచ్చబ్బాయ్ పని కావాలోయ్
ఆడపిల్ల మాట మీద ఉద్యోగాలూడగొట్టు
ఆకతాయి కామందూ
మీసకట్టు తీసివేసి కాసెబోసి కోకచుట్టి
గాజులేసుకొమ్మందూ
డొక్కచీరివేస్తాము - డోలుకట్టి తెస్తాము
డోలుకట్టి గోలపెట్టి రచ్చకెక్కుతాం ॥బుచ్చబ్బాయ్॥
రాత్రికి నేనొక రాక్షసినై నీ కలలో పీడిస్తా
రేపటి వేళకు నీ పని నీదని దారికి రాకుంటే
మాపటి వేళకు నీపని నే పడతానోయ్ బుచ్చబ్బాయ్
మిన్ను విరిగి మీద పడ్డా
మన్నుమిన్ను ఏకమైనా
నిన్ను గెల్చువరకు మేము
ఆడి తీరుతాం పోరాడి తీరుతాం ॥బుచ్చబ్బాయ్॥

**జూన్ 28 ముళ్లపూడి జన్మదిన సందర్భంగా...**

# మళ్లీ ఓ కానుక ఇవ్వండి..

**- సత్యానంద్** (సినీ రచయిత)

" ఓ సీ గాన పెసూనాంబా.. ఇప్పుడేమొనూ, మరేమోనూ... మనమంతా... అంటె అమ్మ - నాన్న - మా బాబాయ్ - బామ్మ- పక్కింటి పిన్నిగారూ... అంతా కల్సి నిఝం జటకా ఎక్కేసి... రంయ్‌మని వెళిపోతాం.. దార్లో రెండుజెడల సీత కనిపిస్తే బాబాయ్ బండిలోంచి కిందపడి ఈల వేసుకుంటూ పోతాడు... అస్తమానూ నన్ను పిల్చి ఈల వెయ్యమంటున్నాడని- వాడికి మొన్నో - రేపో నేర్పేసాను... కుంచెం బాగానే వేస్తాడులే... మరేమొ.."

అంతా కలసి బయటకి వెళ్ళటం మీద బుడుగు వీధి అరుగుమీద కూర్చుని అనర్ఘళంగా చెబుతుంటె-

"ఓ ఫైవుందా..." అరుగు ఎక్కి అడిగాడు అప్పారావు. బుడుగు పట్టించుకోలేదు. టెక్నిక్ మార్చి భాషకూడా మారిస్తే పని జరగవచ్చనే దురభిప్రాయంతో అప్పారావు...

"బులుగూ... బులుగూ... ఓ ఫైవుగాని టెన్నుగాని... వుంతే అప్పియ్యమ్మా..." అని మోకాళ్లమీద పాకుతూ... 'బాల'రసాన్ని బాగా అభినయిస్తూ అని మళ్ళీ అన్నాడు.. "ఓ ఫైవుందా..?" అని.

"లేదు...బాముృంది.." అని మరుక్షణంలో

"బామ్మొయ్.. పిల్లల్ని ఎత్తుకుపోయా వాడొచ్చాడేవ్... వచ్చి వీడికి ప్రయివేట్ చెప్పేయ్..." అని గావుకేక వేశాడు బుడుగు.

అప్పారావు అదిరిపడి.. అరుగు మీదనుంచి రోడ్డుమీదకి గెంతుతూ- "పిట్టకొంచెం-" అంటూ మొదలుపెట్టిన పూర్తిచేసే అవకాశం లేకపోయింది అతనికి. అందుకు కదలికలు- గెంతటం అనే కళలో పెద్దగా ప్రావీణ్యం లేని అతగాడి రెండు కాళ్ళు ఏకాభిప్రాయంతో నేలమీద ఆనకపోవటం - తొందరపడి ముందు నేలమీదకి దిగిన కుడికాలు ఓ అరటిపండు తొక్కని పలుకరించటం- ఆ తొక్క సహకారంతో వూహించని వేగంతో అప్పారావ్ ప్రయాణం మొదలుపెట్టటం- వగైరాలు...!

ఆ చెట్టుకింద నిలబడి - నెత్తిమీద పడ్డ కాకిరెట్టని తుడుచుకోవాలో - కడుక్కోవాలో అనే మీమాంసతో వున్న యువరాజుని అప్పారావ్ ఢీ కొట్టి.... ప్రయాణం ఆపి 'ఓ ఫైవుందా..' అంటూ పరామర్శించాడు.

"కాష్ లేదు.. చెక్‌బుక్ కారులో వుంది..." గంభీరంగా చెప్పి... ఎప్పుడూ ఎ.సి. కారులో తిరిగి విసుగేసి- కాస్సేపు 'ఎండ'లో సరదాగా నడిచేవాడి పోజులో - వుషారుగా అడుగులు ముందుకు వేసి - హఠాత్తుగా కారు కింద పడబోయాడు యువరాజు.

బ్రేక్‌కి తనకి సంబంధం వుందనే విషయం మర్చిపోయిన ఆ జనతా ఎక్స్‌ప్రెస్‌లాటి కారుని నడిపే చక్రవర్తి స్టీరింగ్‌ని ఎడా-పెడా తిప్పి, ఎటో-అటు పోనివ్వగా లోపలవున్న జనాభా అంతా ఉమ్మడిగా కోరస్‌లో కేకపెట్టారు. సుందరమ్మ- సుబ్బారావు- అతని మావగారూ, పిన్నిగారూ, నరసమ్మా, అంతా యథాశక్తి హాహాకారాలు చేశారు.

చక్రవర్తి పెళ్ళాంకేసి చూస్తూ, వాయిద్యాల



హోరులో వినపడని సినిమా గీతంలా "అందుకే... ఈ కారు వీర్రాజుకి అమ్మేద్దాం అన్నాను.." అన్నాడు. ఈలోగా అరిచి ఆయాసపడ్డ కారులోని హాహాకారులు అరవటం ఆపి " ఇప్పుడు ఏం చేద్దాం..." అన్నారు.

"కారు ఆగిపోయాక మళ్ళీ అరవటం బాగోదు. దిగుదాం" సుబ్బారావు ప్రతిపాదించాడు.

అంతా దిగారు.

"ఇక తొయ్యండి.." సుబ్బారావు మావగారు అన్నారు.

అంతా ఆయన కోరిక మన్నించి కలిసికట్టుగా ఒక్క తోపు తోసేశారు ఆయన్ని. పడటమే జీవిత ధ్యేయం అన్నట్టుగా, ఆయన అర్జంటుగా పదడుగులు ముందుకెళ్ళి సిగార్ వెలిగించే గిరీశం కాళ్ళదగ్గర సాష్టాంగ పడ్డాడు.

"ఏవోయ్... వెంకటేశం చూసావ్.. ఇంతకాలానికి తెలుగూస్ గొప్పతనాన్ని తెలుగూస్ గుర్తించి కాళ్ళమీద పడిపోటం మొదలు పెడుతున్నారు. ఈ ఫార్మాలిటీ నాన్ స్టాప్‌గా ఇలాగే కంటిన్యూ అయితే కంట్రీ ఎంతో ఫార్వర్డ్ అవుతుందోయ్.. ఈ సాష్టాంగం పెట్టే మనిషిని- నన్ను జాయింట్‌గా ఏ యంగ్ విడో చూసినా.. నా గ్రేట్‌నెస్ ఏవిటో నే చెప్పకుండానే తెలుసుకుంటుందోయ్..." సగర్వంగా అంటుండగా-

'క్లోజప్‌లో మీ సగర్వం ఎక్స్‌ప్రెషన్ కాస్త ఎక్కువయింది.. మిడ్‌షాట్‌కి అయితే ఒ.కె." పక్కనుంచి ముందుకు వస్తూ అన్నాడు వరహాల్రాజు.

"ఏవిటోయ్... ఎవర్నువ్... టెంట్‌సినిమా తెరమీది తెలుగూ పిక్చర్‌నుంచి వూడిపడ్డావా... ఈ రోజుల్లో టెంట్‌హాళ్ళు ఎక్కడున్నాయంటావా... ఎందుకు లేవోయ్... విడోస్ లేని ఇళ్ళూ, టెంట్ హాళ్ళు లేని వూళ్ళు లేవుగాక లేవు... అంటే వున్నాయని అర్థమన్నమాట.... ఐమీన్- లేవు అనే వర్డ్‌కి వున్నాయంటే మీనింగ్ వుండటం ఏవిటి చెప్మా అని నీకు సందేహం వుండటం-"

* * *

"వూఁ... రాసుకు పోతున్నావ్... ఏవిటి కథ...? ఎవరు వీళ్ళంతా...? రకరకాల పాత్రలు.... ఒకళ్ళకొకళ్ళు సంబంధం లేకుండా చెలరేగిపోతున్నారు..." అంటూ- చదవటం ఆపి చిరాకుగా చూస్తూ మీరు అడగరని నాకు తెలుసు.

ఎందుకంటే...తెలుగు తెలుసున్నవాళ్ళు, 'హాస్యం' అంటే ఇష్టపడేవాళ్ళు- అదేనండా టేస్ట్ ,సెన్సాఫ్ హ్యూమర్ వున్న మీలాటి వాళ్ళకి... ఆ పాత్రల పేర్లు, వేషం, భాష అన్నీ పరిచయమేనని నాకు బాగా తెలుసు.

అయితే- ఆ పాత్రలన్నీ ఇవేళ హడావిడి పడుతూ- లేస్తూ, గందరగోళంగా ఎందుకు బైల్దేరాయి? అనే అనుమానం మీకు కలగచ్చు. విన్నవించుకుంటాను, వినండి. (సారీ... చదవండి).

* * *

అనగనగనగ ఓ ముళ్ళపూడి వెంకటరమణ.

అతడు ఆ మధ్య 1931 జూన్ 28 న పుట్టాడట.

'అతడు' అని పిలవబడే 'ఏజ్'నుంచి 'ఆయన' అని చెప్పుకునే స్టేజ్‌కి వచ్చేలోగా చాలా రాతలు రాసాడు!

అవి అచ్చులో వచ్చిన అచ్చ తెలుగు కథలు.

తెలుగువాళ్ళ అలవాట్లని - పొరపాట్లనీ -చివాట్లనీ- వగరుని - పొగరుని, వెటకారాన్ని, మమకారాన్ని, గొప్పతనాన్ని, చిలిపితనాన్ని, పంతాన్ని, బింకాన్ని, అన్నిటిని కలబోసుకున్న పాత్రలు, ఆ కథల్లో కదులుతూ మనల్ని పలకరిస్తాయి-

మనం మర్చిపోతున్న తియ్యటి

తెలుగుపదాలని, వాటి వయ్యారాలని, విరుపుల్ని, వాడుకని వేడుకని మనకి గుర్తు చేస్తుంటాయి -

తెలుగు మనభాష అయినందుకు మనం కాలరెత్తుకుని గర్వపడేట్టు చేస్తాయి. అంటే అందమైన భాషని మనం మర్చిపోతోన్నందుకు తలదించుకు కాస్త సిగ్గుపడేట్టు చేస్తాయ్.

ఆయన కథలు అన్నిటిలోనూ- టాపిక్ ఏదైనా సరె-

ప్రేమయినా - విరహమైనా - పసితనమైనా- పెద్దరికమైనా - సినిమా అయినా - రాజకీయం అయినా- అప్పుచెయ్యటమైనా - తప్పు చెయ్యడమైనా - కన్నీళ్ళు, కష్టాలు, ఆకలి, ఆనందం ఏదైనా సరె.... హాస్యంతో జతకట్టి ముందస్తుగా మనల్ని నవ్వించి, ఆ పైన 'అయ్యో... పాపం' అనిపించేటట్టు చేస్తాయి.

(ఉదాహరణలకి "ముళ్ళపూడి వెంకటరమణ సాహితీ సర్వస్వం" చదువుడు)

రమణగారికి తెలుగన్నా... తెలుగుతనం అన్నా.... తెలుగు వాళ్ళన్నా... ఎంతో ఇష్టం.

ఆ ఇష్టం తోనే తెలుగువాళ్ళ మీద జోకులేసి - వెటకారం చేస్తాడు.

ఆ ఇష్టం తోనే తెలుగు సినిమాలని -'నవ్వించండి, నవ్వులపాలవద్దని' చెబుతాడు.

ఆ ఇష్టం తోనే రాజకీయం రంగుమార్చినా, జెండా- అండ - దండ మార్చినా సగటు మనిషి సగటున పెద్దగా మారడని చెబుతాడు.

గిరీశం చేత లెక్చర్స్ ఇప్పించినా-

రామిరెడ్డిగారి చేత కథలు చెప్పించినా-

తెలుగు జనాభా మీద ఆయనకున్న ఇష్టం, ప్రేమ, అభిమానం దొంగచాటుగా మనకి కనిపిస్తూవుంటాయి.

అందుకే కావొచును - మనందరికీ ఆయనంటె అంత ఇష్టం.

* * *

"అది సరెనయ్యా... బిగినింగ్‌లో ఆయన కథల్లోని పాత్రలు- వాటి హడావిడి రాసేశావ్... వాటి సంగతేవిటి...?"- అసహనంగా మీరు.

"అవన్నీ ఎక్కడికో బయల్దేరాయి... పదండి వెంటపడి చూద్దాం..."- వినయంగా నేను.

* * *

ఆ ఇంటి ముందు కోలాహలంగావుంది.

ఒకరిమాట మరొకరు వినకూడదనే పట్టుదలతో ఎవరు మటుకు వాళ్ళు మాట్టాడేసుకుంటున్నారు.

"పెద్దాయన్ని కల్సుకోటానికి వచ్చాంగాని - అసెంబ్లీహాల్లోకి కాదుగదా... ఎందుకంత అల్లరి..." రావిరెడ్డిగారు అన్నారు.

"అల్లరేవిటండీ.... అల్లరి... ఇదంతా అభిమానం..."- గుర్నాధం అరిచాడు. "ఇదిగో గొడవ పడద్దు. పెద్దాయిన వచ్చేలోగా.. ప్రతివాళ్ళూ.. ఓ ఫైవుంటే ఇవ్వండి చెప్తా..." అప్పారావు గుంపు మధ్య చెలరేగిపోతున్నాడు.

"నిఝెం జటకా మీద వచ్చాను... ఇదిగో నిఝెం కోరడా..."- నమ్మించటానికన్నట్టు బుడుగు అందుబాటులో వున్న కళ్ళని కొడుతున్నాడు.

"మన తెలుగూస్ ఇంతేనోయ్ వెంకటేశం.. మంచికైనా... చెడుకైనా ముందు రెచ్చిపోతారు. నాతోటి నలుగురు స్కాలర్స్‌ని ఓ కమిటిగా వేయించి... ది మెంటాలిటీ ఆఫ్ తెలుగూ పీపుల్ అనే టాపిక్ మీద రీసెర్చి చేయిస్తే - నోబుల్ - గోబుల్స్... అదేదో ప్రయిజు కూడా వచ్చేయచ్చు.." - గిరీశం లెక్చర్స్ మొదలెట్టాడు.

"టాప్ ఏంగిల్‌లోంచి... ఈ గందరగోళాన్ని చూపిస్తూ.. క్రేన్ కిందకి దింపితే.. హీరో వచ్చే శుభం సీన్‌కి బ్రహ్మాండమైన షాట్ లాగించచ్చు..." వరహాల్రాజు ప్రక్కనున్న రాయుడుతో గంభీరంగా అన్నాడు.

నిజంగా - ఆ సమయానికి... లోపలనుంచి ఈవేళ హీరో అయిన ముళ్ళపూడి వెంకటరమణగారు బైటకి వచ్చారు.

ఒక్కసారిగా...

గుర్నాధం, గోపాలం, రాధ, బుడుగు, ఆనందరావు, వరహాల్రాజు, రామిరెడ్డిగారు, సుందరమ్మ, వీర్రాజు, మీసాలం, సీత, భానుమతి, గిరీశం, అప్పారావు, మహరాజు... యువరాజు, సుబ్బులు, రాయుడు, లక్షింనర్సు, బుచ్చికక్కి, చిట్టెమ్మ, ధనుర్ధారి శంకరం... ఇంకా వాళ్ళు - వీళ్ళు - ఎవళ్ళెవళ్ళో.. ఏకగ్రీవంగా.. ముక్తకంఠంతో కోరస్‌గా...

"హేపీ బర్త్‌డే టు యూ... మైడియర్ రమణా..." అని అరిచారు.

ముళ్ళపూడి వారి అబ్బాయి మొహమాటంగా సిగ్గుపడ్డాడు...

*******

అప్పారావు అప్పులు చెయ్యటం,
బుడుగు అల్లరి చెయ్యటం,
రావిరెడ్డిగారు రాజకీయం చెయ్యటం,
వరహాల్రాజు సినిమాల్లో వెయ్యటం,
రాధమ్మ అందంగా నవ్వటం,
గిరీశం లెక్చర్లివ్వటం,
బాపుగారు బొమ్మలు గీయటం,
రమణగారు కథలు రాయటం,
మానేయటం చాలా అన్యాయం అనిపిస్తుంది.

అందుకే ఆయన పుట్టిన రోజునాడు అభిమానులంతా....

"హేపీ బర్త్‌డే టూ యూ...."- అంటూనే

కానుకలిచ్చే సంప్రదాయానికి కాస్త మార్పులు చేసి -

ఓ కథని కానుక అడుగుతున్నాం...!

"మళ్ళీ ఓ కథ రాయండీ..."

దురాశేమొ.........................!

■




నలభై ఏళ్లుగా సినీ పరిశ్రమ
తీరుతెన్నులపై అధ్యయనం
చేసిన రచయిత, జర్నలిస్టు, నటుడు

# రావి కొండలరావు

రాసిన వ్యాసమిది



**1990 వ సంవత్సరం.**
**విజయవాడలో 'బాపురమణీయం' పుస్తకావిష్కరణోత్సవం.**

అంతకుముందు-

ప్రింటయిన ఆ పుస్తకం పేజీల్ని దగ్గరగా కుట్టించి, ముళ్లపూడి రమణగారు నాకిచ్చారు.



"విజయవాడలో ఆవిష్కరణ. బాపు, నేనూ ఎలాగూ వెళతాం. మీరు రావాలి. ఈ పుస్తకాన్ని తెలుగు మాస్టారిగా విమర్శిస్తూ చిదగ్గొట్టాలి" అన్నారు. నేనాశ్చర్యపోయి చూశాను. "అవును" అన్నారు మళ్లీ ఆయనే.

"ఏంబావుంటుంది రమణగారూ- శుభంగా శుభ్రంగా పుస్తకం ఆవిష్కరింపబడుతూవుంటే, దాన్ని పొగడాలిగాని, ఇలా తిడితే మర్యాదగానూ వుండదు, సంప్రదాయమూ కాదు గదా" అన్నాను. ఆయన ఒప్పుకోలేదు. పొగడ్తలు ఎలాగూ ఉంటాయనీ, ఇది వినోదంగానూ సరదాగానూ వుంటుందనీ, బావుంటుందనీ "అల్లరి-తెలుగు మాస్టారు" అని కార్యక్రమంలో వేద్దామని అన్నారు. బాపుగారి సపోర్టు, శ్రీ రమణగారి ఓటు - ఇవన్నీ కలిపి అలాగే అనిపించాయి నాచేత. రమణగారి 'సెన్సాఫ్ హ్యూమర్' బాపుగారి 'స్పోర్టివ్ స్పిరిట్' అలాంటివి.

(నండూరి రామమోహనరావుగారు ఆ సభకి అధ్యక్షులు, చిత్ర నిర్మాత డూండిగారు పుస్తకావిష్కరణ. తుర్లపాటి కుటుంబరావుగారు ముఖ్య అతిథి- సభ సాగిపోతోంది. కథ, నాటక రచయితలు, పత్రికాధిపతులు. విలేకర్లు, విమర్శకులూ, సాహితీవరులతో సభ కిటకిటలాడింది. రావెమ్మోహనరావు గారు మాట్లాడుతూ వుండగా, 'తెలుగు మాస్టారు' ఎవరూ పిలవ కుండానే గద్దె ఎక్కారు.)

"అయ్యా! తమరెవరో గాని ఇందాకట్నుంచి చూస్తున్నాను. అదే పనిగా మాట్లాడుతున్నారు... ఎప్పటికైనా ఆపుతారేమో, నేనే వచ్చి నాలుగు మాటలు మాట్లాడదామనుకుంటే- ఎప్పటికీ తెమల్చరే- తమరు!..... అంచేత మధ్యలో డిస్టర్బింగ్‌గా వున్నాను.... ఏంలేదు, ఇక్కడ గ్రంధావిష్కరణ జరుగుతున్నదని విన్నాను. 'బాపురమణీయము'- ఇదిగో కొని చూశాను. ఏదో బిల్హణీయము, స్వారోచిష మనుసంభవము అన్నట్టుగా ఇదేదో ఆ కోవకి చెందిన గ్రంధమనుకొని, కొని చూడగా- ఎప్పుడో వచ్చిన సినిమాల మీద సమీక్షలు, కార్టూన్లా- అవేవీ, వంకర టింకర గీతల బొమ్మలు - ఇవన్నీ పాతవేట. ఎప్పుడో పత్రికల్లో వచ్చేశాయట. వాటిని ఇప్పుడు పుస్తకంగా వేశారా- కడు ధూర్తము! బాపురమణీయము అని ప్రబంధ నామకరణము చేసి ఏమిటీ మోసము! ఇప్పుడు దేనికి బాబ్జీ ఈ సమీక్షలు? ఇవన్నీ ముళ్లపూడి వెంకట రమణ అన్న అతను పత్రికలో రాసినవిట. ఇప్పుడీ సమీక్షలు చదివి, ఎవడు చూస్తాడయ్యా ఆ సినిమాలు? అసలు ఎక్కడ ఆడుతున్నాయి అవి? ఆడుతున్నాయనుకో- ఇవి చదివి వెళ్తారా ఎవడయినా? సైలెన్స్.... నిన్నవచ్చిన సినిమాయే నేడు ఆడ్డంలేదు. ఈ పాత సినిమాలు ఎక్కడ వుంటాయి?... అటువంటి పాతతరం సినిమాల మీద సమీక్షలు- ఒక పుస్తక రూపంలోనా? దేనికి? ఎవడికి ప్రయోజనం?.... ఇలా అంటున్నానని ఏం అనుకోకండి.... ఆఁ!... ఇన్ని పేజీలు... ఇంత పుస్తకం.... వెల అరవై రూపాయలు... మేలు ప్రతి 85, ఫిమేలు ప్రతి 60.... అని అతనెవరు... శ్రీరమణట.... ఇతను ఇంకో రమణ- ఇతని చమత్కారంట.... ఎవడైనా తనని శ్రీ అంటాడో లేదో అని, తనే శ్రీ తగిలించేసుకున్నాడు పేరు ముందు.. అతనూ ఉన్నట్టున్నాడీ సభలో.... సైలెన్స్ మాట్లాడకక్కడ!

> రమణ గారి రాత స్పీడులో అక్షరాలు అర్థంకావు.
> "ఇలా రాస్తే ఎలా అర్థమవుతుందండీ?" అని అడిగితే,
> "అర్థం కాకూడదనే. లేకపోతే కాపీ కొట్టేస్తారు గదా" అని చమత్కరించారొకసారి.







రమణగారు ఒక హోటల్లో కూచుని స్క్రిప్టు రాసుకుంటున్నారు. నేను వెళ్ళాను. "సారీ, డిస్టర్బ్ చేసినట్టున్నాను" అన్నాను.

"ఏంలేదు... మంచి సమయానికొచ్చారు. ఎవరైనా వచ్చి డిస్టర్బ్ చెయ్యకూడదా అనుకుంటున్నాను. మీరొచ్చారు" అన్నారు రమణగారు- రాస్తున్న కలాన్ని పక్కన పడేస్తూ.

ఈ పుస్తకం వేసిన వారెవరూ..... నవోదయ పబ్లిషర్స్.... వీరి దయతో వేశారన్న మాట... దేనికి బాబ్జీ నవోదయా.... ఈ పుస్తకం?.... దేనికిదీ? దీనికి బదులు రామాయణ, మహాభారత గాథలో, ఒక భగవద్గీతా వ్యాఖ్యానమో వేసి అరవై రూపాయలు పెట్టి అమ్ము- అమ్ముతుందిగాని, ఇదెవడు కొంటాడు- నాలాంటి అభాగ్యుడు తెలియక కొనాలిగాని!

ఇందులో కార్ట్యూన్‌లని కూడా వున్నాయి టింకర వంకర రాతలతోనూ, బొమ్మతోనూ. కార్టూను, ట్యూనూ కలిపి కార్ట్యూన్ అని పేరు పెట్టారా!... అదెలా అవుతుంది? కార్టూన్‌ట్యూన్ అవ్వాలిగాని, కార్ట్యూన్ ఎలా అవుతుందోయ్- ఎలా అవుతుందీ? ఐనా తెలుగు భాషలో సంధులున్నాయిగాని, ఆంగ్లభాషలో ఎక్కడ వున్నాయయ్యా సంధులు?... ఆఁ...

ఒక కార్ట్యూన్‌లో "చలనచిత్ర వచన రచన వ్యాసంగర రంగంపై సంగరంగ రంగరాలు చెయ్యడాలు కొయ్యడాలు" అని ఏదేదో వుంది. ఏమిటది? సైలెన్స్... వెక్కిరించడమా? వేళాకోళమా? నాకు తెలీకడుగుతాను. అర్థమేమిటోయ్ దానికి? అదేమిటి గేయమా? కవిత్వమా? ఏదో చేతికొచ్చినట్టు రాసీడమేనేంటి?... అసలు రాసిన వాడికి అర్థమైందాని?... సైలెన్స్... అన్నాతమ్ముడు, వద్దంటే పెళ్లి, సిపాయి కూతురు, ఆడపెత్తనం- అన్న సినిమాల మీద సమీక్షలున్నాయి. ఆ సినిమాలు బాగులేవుట. అలా బాగులేవని రాసినవాడు, తనూ తర్వాత సినిమాలు రాశాడుట గదా, అవి బాగున్నాయా అని? ఒకరు రాసినవి బాగులేవని నువ్వు అన్నప్పుడు నువ్వు బాగా రాస్తావని మేము అనుకోవాలి గదా. ఆఁ... సీతాకళ్యాణం, సంపూర్ణ రామాయణం... బాగున్నాయి. బాగానే రాశాడు. ఐనా, అందులోని ప్రజ్ఞ ఏముంది? వాల్మీకి రాసినవి. మరి తమరు రాసిన బుల్లెట్టు, జాకెట్టు- ఓహో జాకీయా... సర్లెండి.. అవేం బాగున్నాయి?.... ఎందుకు బాగా నడవలేదూ? చెప్పండి తమరు! శ్రీ కృష్ణావతారం అని ఓ సినిమా వస్తే వెళ్లాను- తీరావెళ్తే సాంఘికం! కృష్ణుడి అవతారగాథే మో అనుకుంటే, సాంఘికమా? ఈ ముళ్లపూడి రమణగారు రాసిందేట అదీనూ. ఎవరికీ నచ్చలేదే ఈ చిత్రం? 'ముత్యాలముగ్గు' బాగానే ఆడిందట. అదేదో ముగ్గుల కథ అయివుంటుంది. ముగ్గులూ గట్రా గుమ్మాలముందు ఎలాపెట్టాలి- అని రాసి వుంటాడు- ఆడవాళ్లు చూసివుంటారు.

అందాల రాముడు, బుద్ధిమంతుడు, గోరంతదీపం ఇలాంటి సినిమాలు కూడా రాశాట్ట. అన్నీ సాంఘికాలే. పౌరాణికాలు రాస్తే బాగుంటాయి. ఎంచేత? అవి తమ కథలు కావు. ఈయన కథల్లి ఈతనెవరూ- బాపు... గాంధీగారి పేరుపెట్టుకున్నట్టున్నాడు.... మారుపేరు. అతను సినిమా రూపం ఇచ్చాట్ట. వంకర టింకర గీతలతో బొమ్మలు వేసే అతను, సినిమాలు తియ్యడం ఏమిటి బాబ్జీ?... సీతాకళ్యాణము, సంపూర్ణ రామాయణము- మహత్తరము. మరి తక్కిన సాంఘికాలన్నీ కూడా అలావుండాలి కదా... మనం ఒకర్ని విమర్శించినప్పుడు, మనం అంతకంటే గొప్పవాళ్ళం అనుకున్నప్పుడు, మనం చేసింది అంత గొప్పగా వుండాలి కదా... అదీ విషయం... అందువల్ల- ఈ పుస్తకాన్ని నేను విమర్శించాను గనక, నేను ఇంతకంటే బాగా రాయాలన్నమాట... సైలెన్స్.... నాకెందుకూ.... నేను సినిమాలే చూడను..... చూడందానికి రాయడం ఏమిటి... సైలెన్స్....

**ఇలా సాగిందా మాస్టారి ఉపన్యాసం. ఇందులో వచ్చిన హ్యూమరంతా- రమణగారి ప్రేరణే కదా...**

---

# పేరులేని రాజేశ్వరరావు "సం"గీతా రహస్యాలు

"**సం**గీత దర్శకుడు రాజేశ్వరరావు గారిని భరించడం కష్టం" అనేవారు నిర్మాతలు. ఏంలేదు- అనుకున్న మ్యూజిక్ సిటింగ్స్‌కి వేళకి రారు. రికార్డింగుకీ అంతే. అది నిర్మాతల బాధ. సాలూరివారి బాధేమిటంటే ప్రొడక్షన్ విధానంలో అనుకూలత కనిపించకపోతే, ఆయన మానేసి వెళ్ళిపోతారు. ఆయన్ని ఎవరైనా సంగీతంలో 'శాసించి'నట్టు అనిపించినా, వెళ్ళిపోయేవారు. చాలా మూడీ. ఆయన మూడ్‌నిబట్టి దర్శక నిర్మాతలు వెళితే పర్వాలేదు. లేకపోతే వాకౌట్ చేసేవారు.

'నమ్మినబంటు' చిత్రానికి ముందు రాజేశ్వరరావే సంగీత దర్శకుడు. 'చెంగు చెంగునా' అన్నపాట ఆయన రికార్డ్ చేసినదే. ఆ తర్వాత వేణు వచ్చారు. పేరు వేణుదే వేశారు. ఎన్.టి.ఆర్. 'సీతారామకల్యాణం' చిత్రానికి 'కానరార...' అన్నపాటనీ, తర్వాత వచ్చే దండకాన్నీ రాజేశ్వరరావుగారే చేశారు. 'రాజేశ్వరరావు గారు




ఏ రాగాన్ని కచ్చితంగా ఉంచరు. ఎక్కడో దగ్గర ఏదో రకంగా మిక్స్ చేస్తారు- అందుకోసం శ్రావ్యత కోసం కానీ ఏ మాత్రం సంకర పరచకుండా, శుద్ధ శంకరాభరణంలో 'కానరార' పాట చేశాడు" అని చెప్పారు- 'సంగీత గేయధార' సాయికృష్ణ యాచేంద్ర. 'సీతారామకల్యాణం'లో తక్కిన పాటలన్నీ గాలిపెంచల నరసింహారావు స్వరపరిచారు. ఆయన పేరే వేశారు.

మళ్ళీ 'దాన వీర శూర కర్ణ'కి తొలిదశలో రాజేశ్వరరావే సంగీతం. టైటిల్స్ మీద వచ్చే "ఏ



తల్లి నిను కన్నదో, నేను నీ తల్లి నయినానురా" అన్న పాటకి స్వరకర్త రాజేశ్వరరావే. అందులోని పద్యాలు కూడా ఆయనే సెట్ చేశారు గాని, రికార్డు కాలేదు. 'ఏ తల్లి నిను కన్నదో' మాత్రం రాజేశ్వరరావు రికార్డు చేశారు. తర్వాత పెండ్యాల గారు వచ్చారు, ఆయన పేరే వేశారు.

'మాయాబజార్' పాటల సంగతి అందరికీ తెలిసిందే.

-ఆర్కే

## కొంటెకొశ్చెన్లు - తుంటరి జవాబులు




టి.నవీన్‌కుమార్, వారాసిగూడ, సికింద్రాబాద్

ప్ర : 'భయం భక్తి ఉండొద్దూ' అని పెద్దాళ్ళు తిడుతూ ఉంటారు. అవి రెండూ ఒకేసారి ఎలా ఉంటాయి?

జ : రామ్‌గోపాల్ వర్మ హారర్ సినిమాలు ఆడే థియేటర్ల కెళ్లి చూడండి. ఆంజనేయ దండకం చదువుకుంటూ సిన్మా చూసే వాళ్ళు చాలా మంది కనిపిస్తారు. భయం, భక్తి ఒకేచోట వుండడం అంటే అదే!

ఎమ్.సి. సత్యం - దిల్‌సుఖ్‌నగర్, హైద్రాబాద్

ప్ర: మొన్నామధ్య వాటర్ టాంక్ వెళుతుంటే నీళ్ళు పొయ్యమని అడిగాం. 'యూస్లెస్ వాటర్' అన్నాడు. అందరం వద్దన్నాం. 'పిచ్చివాళ్ళలారా' అంటూ వెళ్ళిపోయాడు. మాకేం అర్థం కాలేదు... మీకేమైనా అయిందా?

జ : అయింది. 'యూస్లెస్ వాటర్' అంటే 'తక్కువగా వాడండి' (యూజ్ + లెస్) అనీ అర్థం.

చిల్కా రమేష్‌బాబు - గోరంట్ల

ప్ర: ఈ మధ్య నా వాచీ సరిగ్గా ఏడూ పది దగ్గర ఆగిపోయింది. ఎంత మంది కిచ్చినా రిపేరు చెయ్యలేకపోతున్నారు. ఏంచేతంటారు?

జ : దాని 'ఏడుపది' ఏడ్చి ఊరుకుందని మీరు ఊరుకోండి.

## ఈ రూటేవేరు




Swim tree = ఈత చెట్టు

Shame buds = సిగ్గు మొగ్గలు

Cat buds = పిల్లి మొగ్గలు

- మహేంద్రాడచలం, టెక్కలి.



## పేరు - రిపేరు




మా యింటికి రండి - మా బాపు బొమ్మకు పెళ్లంట

ఒట్టేసి చెబుతున్నా - నువ్వే... నువ్వే - నువ్వే కావాలి

మనసులో మాట - చెప్పాలని వుంది

- శ్రీ, ఆచంట.

## చిలిపి లిపి




Me నప though say = మినపదోసె

- టియల్ ప్రసాద్, విశాఖపట్నం

YJNT = వైజయంతి

- వి.వి.యస్.మహలక్ష్మి, చీపురుపల్లి

C come = సిరా

- మామిడి మునిశ్రీలత, పూణే

## డబుల్ రోల్




ఏరా..! ఆ బియ్యంలో రాళ్లు 'ఏరా'వా!?

**- వై.క్రాంతిసాగర్, ఏలూరు.**

స్కూటర్ 'కీ' ఎక్కడ పెట్టావురా అంటే అలా చూస్తావేరా 'మంకీ'

**- దేవులపల్లి రామమూర్తి, విజయవాడ.**

'మా అమ్మ కాలు' విరగడం వల్ల నేను షాపులో కూర్చోలేకపోవడంతో 'మా అమ్మకాలు' బాగా పడిపోయాయిరా.

**- కో.నా.వెం.ఆంజనేయులు, ఉక్కునగరం.**

## చిలిపి కవిత



నీ ఇంట్లో పవరు పోతే
ఫ్యూజును చెక్ చేయవు
కంప్లైంట్ ఇవ్వవు
ప్రక్కవాడి ఇంటివైపు
పరుగులెత్తి చూస్తావు
వాడింట్లో పవరుంటే
నీకది పెద్ద షాకు
వాడింట్లోనూ పోతే
అదోక ఆనందం నీకు

**-టి.యల్.ప్రసాద్, విశాఖపట్నం.**

## పేరడీ పేరేడ్



ఆ: బట్టలుతక గలవా ఓ గడసరి పట్లు దులపగలవా
బట్టలుతికి ఆ కొళాయి దగ్గర అంట్లు తోమగలవా
ఓ గడసరి అంట్లు తోమగలవా
అ: బట్టలుతకగలనే ఓ కంచుకి పట్లు దులప గలనే
ఓ కంచుకి అంట్లు తోమగలనే
ఆ: గరిక పీకగలవా ఓ గడసరి పరుపులెత్తగలవా
పేడ పట్టుకొని గోడలపై నువు పిడకలెట్టగలవా
ఓ గడసరి పిడకలెట్టగలవా
అ: గరిక పీకగలనే ఓ కంచుకి పరుపు లెత్తగలనే
పేడ పిసికి ఎదురింటి గోడపై పిడకలెట్టగలనే
ఓ కంచుకి పిడకలెట్టగలనే
ఆ: ఓ..... హోయ్... మురుగు కాలువను ముక్కుమూయకా
కడిగి చూపగలవా ఓ గడసరి కడిగి చూపగలవా
అ: మురుగు కాలువను పరమ నాణ్యముగ కడిగి చూపగలనే
ఓ కంచుకి కడిగి చూపగలనే
ఓ కంచుకి కంపు నోపగలనే ॥బట్టలు॥
అ: ఓ..... హోయ్..... ప్రశ్నలేల
నను కుక్కలాగ నీ వెంట తిప్పుకోవా
ఓ కంచుకి వెంట తిప్పుకోవా
ఆ: మనసు తెలుసుకొని
కాళ్ళు పిసికితే మనువునాడనిస్తా
ఓ గడసరి మనువునాడనిస్తా
ఓ గడసరి కుక్క బతుకు నిస్తా

**- తాళాభక్తుల లక్ష్మీప్రసాద్, విశాఖపట్నం.**

("చెంచులక్ష్మి" చిత్రంలో 'చెట్టులెక్కగలవా' పాటకు పేరడీగా)

## షార్ట్‌కట్స్



| | |
|---|---|
| సత్యవాడ రిషి | = సరి |
| గంగుల మన్మథరావు | = గమ |
| పట్నాల దక్షిణామూర్తి | = పద |
| నిమ్మగడ్డ సత్యం | = నిస |

**- తాళాభక్తుల లక్ష్మీప్రసాద్, విశాఖపట్నం**



# 'స్వర చక్రవర్తి' శ్రీ సి.ఆర్.సుబ్బరామన్



ఎం.ఎల్. వసంత కుమారి

(మద్రాసు సినీమ్యూజీషియన్స్ ట్రస్టువారు 1970లో ప్రచురించిన ప్రత్యేక సంచిక కోసం ప్రముఖ గాయని కీ.శే. ఎం.ఎల్. వసంత కుమారి గారు రాసిన తమిళ వ్యాసానికి స్వేచ్ఛానువాదం)

ఈ వ్యాసం రాయమని కోరి నాకు ఈ అవకాశం ఇచ్చిన మిత్రులందరికీ ఎంతో ఆనందంగా కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను. కీర్తిశేషులు శ్రీ సుబ్బరామన్ గురించి నాకు తెలిసినంత మేరకు తెలియజేస్తాను. ఆయన ప్రస్తుతం మనమధ్య సజీవులై ఉంటే ఈ వ్యాసం రాయడానికి మరెంతో సంతోషంగా ఉండేది. ఆయన లేకపోవడం కళాకారులయిన మన అందరికీ తీరని కొరతే. శ్రీ సుబ్బరామన్ గారు సంగీత ప్రపంచంలో జీవించింది కొంతకాలమే. దాదాపు ఐదారేళ్ళు ఉండవచ్చుననుకుంటాను. ఆ ఐదారేళ్ళూ ఆయనతో పనిచేసే అదృష్టం లభించింది.

1943 నుంచీ నేను శాస్త్రీయ సంగీతం కచేరీలు చేస్తున్నాను. కాని 1948లో కీర్తిశేషులు ఎం.కె.త్యాగరాజ భాగవతార్ గారు తీసిన 'రాజముక్తి' తమిళ చలనచిత్రంలో మొదటిసారి నేపథ్యగానం చేశాను. మానాన్నగారు పాతకాలపు కర్ణాటక సంగీత విద్వాంసులు. అప్పట్లో కచేరీలలో శాస్త్రీయ సంగీతం పాడుతున్న నేను సినిమాలలో పాడితే నా సంగీతం పాడయిపోతుందని మా నాన్నగారు ఎంతో భయపడ్డారు. అయితే కర్ణాటక సంగీత నిపుణులైన కీర్తిశేషులు ఆలత్తూర్ సుబ్బయ్యర్ గారు (ప్రముఖ కర్ణాటక సంగీత విద్వాంసులైన ఆలత్తూర్ సోదరులలో ఒకరు) చలన చిత్రాలలో పాడడం వల్ల సంగీతం పాడై పోదనీ ఇంకా ప్రజాదరణ పెరుగుతుందనీ మా నాన్నగారికి నచ్చజెప్పారు. నేను పాడనున్న పాటకు శ్రీ సుబ్బరామన్ సంగీత దర్శకులనీ ఆయన సంగీత జ్ఞానం అపూర్వమైనదనీ అటువంటి వారి సంగీత దర్శకత్వంలో పాడటం ఎంతో గౌరవప్రదమైనదనీ సుబ్బయ్య గారు చెప్పారు. దీన్ని బట్టి కర్ణాటక సంగీత కోవిదులైన సుబ్బయ్య గారికి సుబ్బరామన్ గారిపట్ల ఎంత గౌరవమో తెలుస్తుంది.

అలాగే నా గురుదేవులు శ్రీ బి.ఎన్.బాలసుబ్రహ్మణ్యం గారికి కూడా శ్రీ సుబ్బరామన్ గురించి సదభిప్రాయం ఉండేది. శ్రీ జి.ఎన్.బి. గారు నటించిన 'ఉదయణన్' అనే చిత్రానికి శ్రీ సుబ్బరామన్ గారే సంగీత దర్శకులు. ఆ చిత్రంలో శ్రీ సుబ్బరామన్ గారు తమ చేత పాడించిన ప్రతి పాటనూ మా గురువు గారు తరచు పాడుతూ ఉండేవారు. ఆ పాట వరసల మేలిమి గురించి నాకు ఎన్నిసార్లో చెప్పారు. శ్రీ సుబ్బరామన్ గారు స్వరపరచిన ప్రతిపాటలోనూ ఏదో ఒక విశేషం ఉంటుంది. ఆయా చలన చిత్రాలలోని సన్నివేశాలకు అనుగుణంగానే ఆ పాటలు ఉండేవి.

శ్రీ సుబ్బరామన్ గారు కర్ణాటక సంగీత రీతులలో స్వరపరచిన పాటలు ఆ రోజుల్లో ఎంతో ప్రాచుర్యం పొందాయి. ఉదాహరణకు 'మణమగళ్' అనే చిత్రంలో నేనూ శ్రీమతి పి.లీలగారు పాడిన 'ఎల్లాం ఇన్బమయం' అనే (సింహేంద్ర మధ్యమం రాగంలో స్వరపరచిన) పాట ఎంతో ప్రజాదరణ పొందింది. నేటికీ ఆ పాటకు ఆదరణ కొనసాగుతూ ఉంది. ప్రముఖ హాస్యనటులు శ్రీ ఎన్.ఎస్.కృష్ణన్ గారు నిర్మించిన ఆ 'మణమగళ్' చిత్రం కోసం శ్రీ సుబ్బరామన్ గారు స్వరపరచిన ప్రతి పాటా మరపురానిదే. ఏవో కొన్ని తప్ప మిగిలిన పాటలన్నీ కర్ణాటక సంగీత పద్ధతిలోనే సాగాయి. శ్రీ సుబ్బరామన్ గారు సంగీత దర్శకత్వం వహించిన ఎన్నో చిత్రాలలో నేను నేపథ్యగానం చేశాను. ఇప్పుడు విన్నా ఆ పాటలు సంగీత ప్రియులకు కొత్తగానూ ఆమోదయోగ్యంగానూ ఉండడం శ్రీ సుబ్బరామన్ గారి సంగీతంలోని విశేష లక్షణమని చెప్పాలి.

శ్రీ సుబ్బరామన్ గారికి కర్ణాటక సంగీతంలో ఎంతో జ్ఞానమూ యోగ్యతా ఉన్నట్లే హిందుస్తానీ సంగీతంలోనూ ఆసక్తి ప్రావీణ్యమూ ఉండేవి. అలాగే పాశ్చాత్య పద్ధతిలోనూ ఆయన సంగీతం సమకూర్చగలిగేవారు. పర్షియన్ సంగీతం, జపాన్ సంగీతం, ఆఫ్రికా లయ వాద్యాలు - ఇలా వివిధ దేశాల సంగీత పద్ధతుల గురించిన విశేషజ్ఞానం ఉండేది ఆయనకు. గ్రామ్‌ఫోన్ రికార్డులుగా వెలువడిన సంగీతాన్ని, రేడియోలో వచ్చే సంగీత కార్యక్రమాలనూ వింటూ ఉండేవారు. దీన్ని బట్టి ఆయన సంగీతప్రియత్వం ఎటువంటిదో తెలుసుకోవచ్చు. జానపద సంగీతంలోనూ ఆయనకు అభినివేశం ఉండేది.

వీటన్నిటికీ ప్రాతిపదిక ఏమిటంటే - శ్రీ సుబ్బరామన్ గారి అద్వితీయమైన స్వరజ్ఞానం. ఆయన గొప్ప స్వరజ్ఞాని. అందుకే ఈ రచనకు 'స్వరచక్రవర్తి' అనే పేరు పెట్టాను. ఈ పేరు సార్థకమైనదనే అనుకొంటున్నాను. ఏ పాట అయినా అది ఏ దేశానికి చెందినదయినా ఆయన విన్న వెంటనే వడివడిగా స్వరాలు చెప్పేస్తూ ఉండేవారు. రోడ్డు మీద వినిపించే కార్ హారన్‌కూ స్వరం చెప్పేవారు. తలుపు మూసినపుడు వినిపించే చప్పుడుకూ స్వరం చెప్పేవారు. పక్షుల

కిలకిలారావాలకు స్వరాలు చకచకా చెప్పేసేవారు. శ్రీ సుబ్బరామన్ గారి ఈ అద్భుత స్వరజ్ఞానం చూచి మా గురువు గారు శ్రీ జి.ఎన్.బి. ఆశ్చర్యపడిన సందర్భాలూ ఉన్నాయి.

శ్రీ సుబ్బరామన్ గారి లయజ్ఞానమూ గొప్పదే. తమ తొలి రోజులలో హిస్ మాస్టర్స్ వాయిస్ కంపెనీలో శ్రీ చిన్నయ్య గారనే సంగీతవేత్తతో తమకున్న సాన్నిహిత్యం వల్లే తమకు లయజ్ఞానం అబ్బిందని శ్రీ సుబ్బరామన్ గారు అంటూ ఉండేవారు.

ఉత్తర భారత పద్ధతిలోనూ అందంగా సంగీతం సమకూర్చగలగడం శ్రీ సుబ్బరామన్ గారి ప్రత్యేకత. దక్షిణాదిలో నిర్మించిన కొన్ని హిందీ చిత్రాలకూ శ్రీ సుబ్బరామన్ గారు సంగీతం సమకూర్చారు. అప్పుడు పాటల కోకిల లతా మంగేష్కర్ గారు శ్రీ సుబ్బరామన్ గారి పాటలు పాడడానికి వచ్చారు. లత గారు శ్రీ సుబ్బరామన్ గారి అద్భుత సంగీత ప్రావీణ్యాన్ని ఎంతో ప్రశంసించారు.

శ్రీ సుబ్బరామన్ గారిది పసిపిల్లల మనస్తత్త్వం. ఎవరయినా బాగా పాడితే వెంటనే తమ సంతోషం వ్యక్తం చేసేవారు. తామొక పెద్ద సంగీతవేత్త అనే గర్వం ఆయనలో మచ్చుకయినా కనిపించేది కాదు. ఎవరి పాట అయినా నచ్చకపోతే లోపాలెన్నేవారు కాదు. ఊరుకొనేవారు. ఆయన స్నేహశీలి. భోజన ప్రియులు. సుగంధ ద్రవ్యాలంటే ఆయనకు ఎంతో ఇష్టం.

ఆయన సంగీత దర్శకత్వంలోని మరొక విషయం చెప్పడం మరచిపోయాను. అదీ చెప్పేస్తాను. ఆయన చలనచిత్రాలకు సంగీత దర్శకత్వం నిర్వహిస్తున్నపుడు - పాటలకు వరసలు కడుతున్నపుడు - ఆ పాటపాడనున్న గాయనీ గాయకులను దృష్టిలో పెట్టుకొనేవారు. ఆ గాయకుల గళంలో ఎలాంటి సంగతులు పలుకుతాయి, ఏ శ్రుతి వారికి అనువుగా ఉంటుంది అని ఆలోచించేవారు. పాడేవారిని వరస ఇబ్బంది పెట్టకుండా చూసేవారు. పాడేటప్పుడు ఎంతో ప్రోత్సహించేవారు. కొందరి గాత్రాలలో హిందుస్తానీ సంగీతం బాగా పలుకుతుంది. మరికొందరి గాత్రాలలో కర్ణాటక సంగీతం ఇంపుగా వినిపిస్తుంది. కొందరు ఏ పద్ధతయినా బాగా పాడగలరు. శ్రీ సుబ్బరామన్ గారు ఇవన్నీ గ్రహించి ఆయా గాయకుల గాత్ర ధర్మానికి తగ్గట్టు పాటలు రూపొందించడంలో నిపుణులు.

ఆయన ఖర్చుకు వెనకాడేవారు కాదు. ఇతరులకు సాయపడటం ఆయన సహజలక్షణం. ఆయనది అపూర్వమైన మేధస్సు. అటువంటి మేధావికి భగవంతుడు తగిన ఆయుస్సు ఇవ్వకపోవడం దురదృష్టకరం. ఈ రోజు చలనచిత్ర సంగీత రంగంలో ప్రముఖ స్థానం వహిస్తున్న శ్రీ ఎం.ఎస్.విశ్వనాథన్ గారి సంగీతంలోని మేలిమిని చూస్తే శ్రీ సుబ్బరామన్ గారి గొప్పతనమేమిటో అర్థమవుతుంది. ఎందుకంటే శ్రీ విశ్వనాథన్ గారు శ్రీ సుబ్బరామన్ గారితో ఎన్నో ఏళ్ళు పనిచేశారు. అలాగే శ్రీ టి.కె.రామమూర్తి, శ్రీ గోవర్ధనం వంటి సంగీత నిపుణులూ, శ్రీ సుబ్బరామన్ గారి దగ్గర పనిచేసినవారే.

శ్రీ సుబ్బరామన్ గారి గురించి ఎంతయినా చెప్పవచ్చు. నాకు తెలిసినంతవరకు ఈ రచన చేశాను. ఇందులో తప్పులు ఏవయినా ఉంటే పాఠకులు నన్ను క్షమించాలి.

## ఆగిపోయిన మలయానిలం అనిల్ బిశ్వాస్



- సినీసంగీతంలో ఆర్కెస్ట్రా విధానాన్ని ప్రవేశపెట్టిన ఘనత ఆయనదే!
- ముకేశ్, తలత్ మెహమూద్ వంటి మధురగాయకులను పరిచయం చేసిన కీర్తి ఆయనదే!
- సి.రామచంద్ర వంటి మేటి సంగీతదర్శకులచే 'అన్న'గా సంభావించబడి సినిమా సంగీతానికి భీష్మపితామహుడన్న ఖ్యాతి ఆయనదే!

ప్రఖ్యాత సంగీతదర్శకులు అనిల్‌బిశ్వాస్ మే 31న అమరలోకాలకు తరలి వెళ్లిపోయారు. ఢిల్లీలో కన్నుమూసిన 89 ఏళ్ల ఆయనకు ఇద్దరు కుమారులు, ఒక కుమార్తె ఉన్నారు. 1914 లో తూర్పు బెంగాల్‌లోని బారీసాల్ గ్రామంలో జన్మించిన అనిల్ బిశ్వాస్ స్వాతంత్ర్యపోరాటంలో పాల్గొన్నారు. ఆయన కళాపిపాస ఆయనను కలకత్తాకు నడిపించింది. సుప్రసిద్ధ బెంగాలీ కవి కాజీ నూరుల్ హసన్‌తో, రంగమహల్ నాటకశాలతోను కలిసి ఆయన పనిచేశారు.

రంగస్థలంలో సంపాదించిన అనుభవంతో ఆయన 1934లో బొంబాయి సినిమారంగానికి చేరుకున్నారు. ఆ మరుసటి ఏడాదే ఆయనకు ఛాన్సు వచ్చింది. 'ధరమ్ కీ దేవీ' అనే సినిమాకు సంగీతదర్శకత్వం వచ్చే అవకాశం వచ్చింది. బెంగాల్ జానపద సంగీతాన్ని ఆయన హిందీ సినిమాలలో వినిపించి ప్రశంసలు అందుకున్నారు.

చలనచిత్రసంగీతానికి ఎన్నో కొత్తపోకడలు నేర్పారు. కొత్త గొంతుకలను అందించారు. నేపథ్యసంగీతం సమకూర్చడంలో కానీ, ఆర్కెస్ట్రా నుపయోగించడంలో గానీ అనేక ప్రయోగాలు చేశారాయన. 'పహలీ నజర్' (1945) లో ముకేశ్‌కు తొలి అవకాశం ఇచ్చి 'దిల్ జల్‌తాహై జల్‌నే దో' పాడించారు. 'ఆర్జూ' (1949) లో తలత్‌కు తొలిఅవకాశం ఇచ్చి 'యే దిల్ ముఝే ఐసీ జగహ్ లే చల్ జహా కోయీ న హో' పాడించారు.



తలత్ మెహమూద్, అనిల్‌బిశ్వాస్ భార్య, అనిల్ బిశ్వాస్, నౌషాద్, లతా మంగేష్కర్

అనేక సినిమాలకు సంగీత దర్శకత్వం వహించిన తర్వాత 1965 లో ఆలిండియా రేడియో లో డైరెక్టర్ ఆఫ్ నేషనల్ ఆర్కెస్ట్రాగా చేరారు. తరువతా చీఫ్ ప్రొడ్యూసర్ ఆఫ్ లైట్ మ్యూజిక్ కూడా అయారు. వాద్యబృందాల సృష్టిలో ఆయన పాత్ర ఎంతో గణనీయమైనది.

ఎన్నో విజయవంతమైన సినిమాలకు గొప్ప సంగీతాన్ని అందించిన అనిల్ బిశ్వాస్ గురించి మరిన్ని వివరాలు 'హాసం' సంచిక నెంబరు 19 (1-15 జూన్ 2002) లో చూడవచ్చు. ఆయన సంగీతం సమకూర్చిన 'కిస్మత్' (1942) సినిమా కలకత్తాలో మూడేళ్లపాటు వరుసగా ప్రదర్శించబడింది.

వెరైటీ పిక్చర్స్‌లో ప్రొడక్షన్ విభాగానికి ఆధిపత్యం వహించిన అనిల్‌దా కు ఇతరరంగాలలో కూడా స్నేహితులున్నారు. ఫయాజ్ అహ్మద్ ఫయాజ్, అఖ్తర్ బీ, రాజ్‌కుమారీ వంటి ప్రముఖులు వారిలో కొందరు.

అనిల్ బిశ్వాస్ సోదరి పరుల్ వేణుగాన విద్వాంసుడు పన్నాలాల్ ఘోష్‌ను వివాహమాడారు. ఆయన ఒక కుమారుడు ఉత్పల్ బిశ్వాస్ అమితాబ్ నటించిన 'షెహన్‌షా', 'మై ఆజాద్ హూ' సినిమాలకు సంగీతదర్శకత్వం వహించారు. ఆయనకు 'అమార్ ఉత్పల్' అనే మ్యూజిక్ గ్రూప్ ఉంది. ఇంకో కుమారుడు అమిత్ బిశ్వాస్‌కు బొంబాయిలో ఓ డిజిటల్ స్టూడియో ఉంది.

అనిల్ బిశ్వాస్ మరణంతో సినీసంగీత చరిత్రలో ఒక శకం అంతరించినట్టుగానే చెప్పవచ్చు.

- కమ్యూనికేటర్ ఫీచర్స్



# బాపు విశ్వరూపం

14

ప్రబంధాలకు బాపు వేసిన ముఖచిత్రాల తర్వాత ముచ్చటించుకోవలసినది - సాంఘిక నవలల కవరు పేజీల గురించి! పాకెట్ సైజు కవరుపేజీ అంటే చోటు చాలా తక్కువనే చెప్పుకోవాలి. ఆ తక్కువ చోటులోనే ఎంతో రమ్యంగా, ఎంతో నూతనంగా, ఎంతో వైవిధ్యంగా బొమ్మలు వేశారు బాపు. ఈ బొమ్మలలో జామెట్రీని ఎలా వాడుకున్నారో చూడండి.

























# పలుకూరి వెంకటరమణ

**(1900)**

పరమేశ్వరుణ్ణి చేరుకోవడానికి సంగీతం ఒక మార్గం...

అయితే అంత సశాస్త్రీయంగా సంగీతం నేర్చుకుంటే తప్ప....

పాడ్డానికి వీల్లేదు అంటే!....

ఎందుకులేదూ... అసలు దేవుడికి కావాల్సింది... వాయస్సూ... నాయస్సూ కాదు... మనస్సు!!

అక్కణ్ణించే పుట్టింది భజన సాంప్రదాయం...

కొంతమందికి భక్తి ఉంటుంది!... పాడదామనీ ఉంటుంది గొంతు బాగోదు... బాగోదన్న ఫీలింగు.....

అదే పదిమంది పాడుతోంటే తనూ గొంతు కలిపేస్తే అదో తృప్తి.. అదే భజన....

"గోవింద బోలో హరి గోపాల్ బోలో

రాధారమణ హరి గోపాల్ బోలో...." అంటూ పదిమంది పాడుతోంటే గొంతు కలిపిన ప్రతీవాడూ ఘంటసాలే.....

పైగా.. భజన చేసేవాళ్ళకి భక్త్యావేశం ఉండాలి తప్ప....

మార్దవం.. సున్నితత్వం... కుదర్దు!...

అంచేతే 'కృష్ణభక్తి'లో.. గట్టిగా పాడుతూ గెంతులేస్తూ తన్మయమై పోతుంటారు.... వాళ్ళ మధ్య కృష్ణుడు కూడా నృత్యం చేస్తూ ఉంటాడని నా నమ్మకం....

భజన సాంప్రదాయం ఆంధ్రదేశంలో చాలా ప్రాచుర్యం సంపాదించుకుంది. ఇలా భజన చెయ్యడానికి వీలుగా ఉండే పాటలు రాసిన మహానుభావుడొకాయన ఉన్నారు. ఆయనే పలుకూరి వెంకటరమణ...

1900 ఆ ప్రాంతంవాడు... విజయనగరం స్వస్థలం.

తల్లి మంగమాంబ... తండ్రి వేంకటరామార్యులు....

పుట్టిన పిల్లాడికి తమ ఇలవేలుపైన వెంకటరమణ మూర్తి పేరెట్టుకున్నారు.

ఇంటిపేరైతే పలుకూరేగానీ.....

పిల్లాడికి మాటా పలుకూ లేదు....

బెంగపడి పోయారు తల్లితండ్రులు.... వెంకటేశ్వరస్వామికి మొక్కుకున్నారు... ముడుపులు కట్టారు....

మాటొచ్చింది!... గానీ మాధుర్యం లేదు.. ఏదో శుద్ధ మొద్దు బుద్ధావతరం!!

ఎదుగుతున్నాడు... లోకజ్ఞానం లేదు!.....లేదూ అంటే ఏదీ అంటల్లేదు... అలా అనిజెప్పి... యోగివంటివాడా అంటే అదీ లేదు.... వేళకి తిండం... వేళగాని వేళల్లో తిరగడం.... ఏదో ఓ వేళకొచ్చి పడుకోవడం...

ప్రపంచంతో సంబంధం ఉన్నట్టూఉంటుంది- ఉన్నట్టూ ఉండదు!... అదో మాలోకం...

వెర్రివాడికింద జమకట్టారు... జనం....

ఏళ్ళొస్తున్నా... తల్లే ముద్దలు కలిపి నోట్లోపెట్టాలి... తల్లే జోకొట్టి బజ్జోపెట్టా.....

తండ్రి స్నానం చేయించాలి!... బట్టలు కట్టాలి!!

లేకలేక పుట్టిన ఒక్క కొడుకు ఇల్లా అయిపోయాడేమా అని తల్లితండ్రులు కుంగిపోయారు.

మరి ఆ జగన్నాటక సూత్రధారి ఏ ఆట ఆడించబోతున్నాడో!!

ఒకరోజు ఏదో సందర్భం వచ్చీ.... వెంకటరమణనీ... ఆదిభట్ల నారాయణ దాసుగారికి పరిచయం చేసాడు!! తండ్రి.

దాసుగారు వెంకటరమణని ఎగాదిగా చూసీ!.. వీడిలో ఏదో వర్చస్సుంది అని తల మీద చెయ్యెట్టి దీవించారు! ఏం వర్చస్సో... అప్పుడే పాతికేళ్లొచ్చాయ్... ఏదీ అబ్బలేదు అని వాపోయాడు తండ్రి....

వెంకటరమణమూర్తి గుడి చుట్టూ పొర్లుదండాలు పెట్టించూ అన్నారు... దాసుగారు!!

సంకటకాలే వెంకటరమణ!! ఇంక వాడు తప్ప మరి వేరే దిక్కేవుందీ!...

నారాయణదాసుగారి మాట పుచ్చుకుని... వెంకటేశ్వరస్వామి వారి ఆలయానికెళ్ళి! దీపారాధన చేసీ!!

కుర్రాడితో పొర్లుదండాలు పెట్టించాడు!!

తనచుట్టూ తాను తిరుగుతూ గుడి చుట్టూ తిరుగుతున్నాడు!

శరీరం భూమిని స్పృశిస్తోంది!!

ఆత్మ భూమిని స్పృశిస్తోంది!!

సముద్ర వసనే దేవీ పర్వతస్తనమండలే

విష్ణు పత్ని ర్నమస్తుభ్యం పాద స్పర్శం క్షమస్వమే

అన్నాడు తండ్రి.

వెంకటరమణ... అలసిపోయి... ఆగిపోయాడు!!

కాస్సేపటికి లేచీ!.. మెల్లిగా రాగాలాపన చేసాడు....

రాగం... మెట్టిమెల్లిగ పెద్దదౌతోంది!!

రాగం పాటయింది!...తల్లీతండ్రి... ఆశ్యర్యం!!

జనం పోగయ్యారు!...

పాడుతున్నాడు వెంకటేశ్వరుడిమీద... వెంకటరమణ...

నవ్వుకున్నాడు ఏడుకొండలవాడు!!

తృప్తిపడ్డారు.... ఆదిభట్లవారు....

వేంకటేశ్వరుడి కృపవల్ల... అత్యంతాశ్చర్యకరంగ సంగీతం వచ్చేసింది వెంకటరమణకి... పలుకూరి వెంకటరమణకి!

పలుకు ఊరింది!!

పలుకూరైంది!.... ఇంటిపేరు సార్ధకమైంది!!

ఈ సంగతి తానే స్వయంగా రాసుకున్నాడు.. వెంకటరమణ

బాల్యం నించీ అయోమయంగా ఉంటూ ఏం మాట్లాడుతున్నానో తెలీనినాకు.... 1925 వ సంవత్సరం ఆంగీరస వైశాఖ శుక్ల ఏకాదశి మొదలు ఏతత్కాల పర్యంతము వెలువడిన కొన్ని కీర్తనలు - భజన కావించుకొనుటకు అనుకూలంగా రాయటం సంభవించింది.. ఇదంతా పరమేశ్వరుడి లీల....

అలాగ ఈయన రాసిన కృతుల్ని ఆదిభట్లనారాయణదాసుగారూ, బొట్టు విశ్వనాథ శాస్త్రిగారూ పరిశీలించి...కొన్నింటిని దిద్ది... సరిచూసిపెట్టి...ఎంతో ప్రోత్సహించినట్టు రచయితే స్వయంగా చెప్పుకున్నాడు.

కృతుల్ని...పుస్తకంగా వేసీ!...భక్తులకి ఉచితంగా పంచిపెడ్తూ ఉండేవాడు....

ఈ కీర్తనల సంఖ్య మొత్తం ముఫైమూడు... అన్నింటికీ రాగతాళ నిర్దేశం ఉంది....నవరోజు, యదుకులకాంభోజి, జంజోటి, తోడి, ధన్యాసి, కేదారగౌళ, శంకరాభరణం, మోహన, యమునకళ్యాణి, బేహగ్ రాగాల్లో రాయడం జరిగింది!!

వెంకటేశ్వరస్వామికి కృతజ్ఞతతో -భక్తి పూర్వకంగా ధ్యానించడం ఇందులోని వస్తువు...

బృందావన గోవిందయని నిను
ప్రస్తుతిజేయుచు బ్రోవలాడెదను
సందడి నొసగెడిగో -విందుభజనల
సద్భక్తిలో-సల్పుచు -నిల్పుచు
డెందెంబునగల -ద్వంద్వరిపుల్లెల్ల
బంధలైపరువులెత్తుచు నుండగ
గోవింద, గోవింద, గోవింద యని
నిన్నానందాబ్ధిన నయమున తేల్చెద!



ఇలాగ...మూకం కరోతి వాచలం (మూగ వాడు అకస్మాత్తుగా అద్భుత ప్రసంగాలు చెయ్యడం)

పంగుం లంఘయితే గిరి (కుంటివాడు కొండ నెక్కెయ్యడం)

ఆ పరమేశ్వరుని కృపవల్లె సాధ్యం - అని నిరూపించి

ఆజన్మాంతం వెంకటేశ్వరుడి కొల్చుకుంటూ... పిల్చుకుంటూ.... జన్మసార్థకం చేసుకున్న వాగ్గేయకారుడు....పలుకూరి వెంకటరమణ.

-తనికెళ్ళ భరణి

(డా॥ సి.విజయలక్ష్మిగారు రచించిన 'ఆంధ్రప్రదేశ్ సంస్థానాలు-సంగీతవాఙ్మయం' చదివి, స్పందించి)

ఈ వ్యాసంపై అభిప్రాయాన్ని శ్రీ తనికెళ్ళ భరణికి తెలియజేయ దలచుకునే వారు

**తనికెళ్ళ భరణి,**
**కేరాఫ్: "హాసం", 502, శ్రీబాలాజీ నిలయం, 13-1-212,**
**మోతీనగర్, హైదరాబాదు - 500 018**
**అడ్రసుకు ఉత్తరాలు పంపాలి.**

# ఘంటసాల క్విజ్

**మొదటి బహుమతి : రూ. 250/-**
**రెండవ బహుమతి : రూ. 200/-**
**మూడవ బహుమతి : రూ. 150/-**
**} మరియు ఘంటసాల కలర్ ఫోటో**

## క్విజ్ నెం-4

1. ఘంటసాల సంగీత దర్శకత్వంలో రేలంగి స్వయంగా పాడిన పాట పల్లవి?
జ: ..............................
2. ఘంటసాల సంగీత దర్శకత్వంలో మాధవపెద్ది సత్యం పాడి, అభినయించిన పాట పల్లవి?
జ: ..............................
3. అత్తా-కోడళ్లపై ఘంటసాల గానం చేసిన ఓ ప్రైవేటు గీతం పల్లవి?
జ: ..............................
4. రమణారెడ్డి,హరనాథ్,గుమ్మడి,కాంతారావు,అక్కినేని నాగేశ్వర రావులకు ఘంటసాల పాడిన ఒకే ఒక చిత్రం ?
జ: ..............................
5. ఘంటసాల గానం చేసిన పుష్పవిలాపం రచయిత?
జ: ..............................

పంపినవారి పేరు : ______________________________

చిరునామా : ______________________________

______________________________

క్విజ్ రూపకల్పన, సమర్పణ, నిర్వహణ
డా॥ కె.వి.రావు,
వ్యవస్థాపకులు,
పద్మశ్రీ ఘంటసాల గానసభ ట్రస్ట్,
28, 1-1-79, ఆర్టీసీ క్రాస్‌రోడ్స్,
హైదరాబాద్ - 500 020.



**నిబంధనలు:**

ఎ) పోటీలో పాల్గొనగోరేవారు పక్కన ప్రచురించిన కూపన్ మాత్రమే నింపి కవరులో పంపాలి. కూపన్ కాకుండా మరే విధంగా పంపినా ఆ ఎంట్రీ స్వీకరించబడదు.

బి) కవరుపై **'ఘంటసాల క్విజ్'** అంటూ పేర్కొనటం మరచిపోకూడదు.

సి) ప్రకటించిన బహుమతులను నగదుగా గాని, ఆడియో క్యాసెట్లుగా గాని, సీడీలుగా గాని విజేతలకు 'పద్మశ్రీ ఘంటసాల గానసభ - హైదరాబాద్' వారిచే నేరుగా పంపటం జరుగుతుంది.

డి) ఏ బహుమతి కైనా ఒకరు కన్నా ఎక్కువగా విజేతలుంటే తుది నిర్ణయం 'పద్మశ్రీ ఘంటసాల గాన సభ' వారిదే!

ఇ) ధారావాహికంగా కొనసాగే ఈ క్విజ్ పోటీలలో ఏ కేటగిరీలోనైనా వరసగా 5 సార్లు విజేతగా ఎన్నికైనవారికి ఓ ప్రముఖవ్యక్తి ద్వారా హైదరాబాద్‌లో మరొక ఆకర్షణీయమైన బహుమతిని అందజేయటం జరుగుతుంది.

**కూపన్‌లు 30-6-2003 లోగా చేరాలి**

**కూపన్‌లు పంపవలసిన అడ్రసు**
'హాసం- హాస్య సంగీత పత్రిక'
502, శ్రీ బాలాజీ నిలయం, 13-1-212,
మోతీనగర్, హైదరాబాద్-500 018.

# బృందావనంలో ప్రే'మాయ'ణం

**-జయంతి కిరణ్మయి**

సత్యం బాబాయి క్లబ్బులో హోరాహోరీగా వాదోపవాదాలు వినిపిస్తున్నాయి. ఎప్పుడూ మర్యాదగా, గంభీరంగా కనిపించే ఆ క్లబ్బు మెంబర్లు ఆ రోజు రెచ్చిపోయి వాదించుకుంటున్నారు.

అంతకు ముందురోజే పక్కనున్న థియేటర్లో తెలుగు ప్రజల కోరికమీద 'దైవశక్తి' సినిమా నాలుగోసారి వేశారు. అందులో దుష్టశక్తులు కంప్యూటర్ గ్రాఫిక్స్ సాయంతో భయోత్పాతాలు కల్పించడం, చివరికి హీరోయిన్ దైవశక్తితో ఆ దుష్టశక్తులను వెళ్ళకొట్టడం కథాంశం.

'అసలు దయ్యాలు, భూతాలు లేవు, అదంతా డ్రామా' అని శ్రీధర్ గ్రూపు, 'ఉన్నాయి లేకపోతే ఇన్ని కథలు ఇంత మంది భక్తులూ ఎలా ఉంటారు' అని ప్రసాద్ గ్రూపు వాదించుకుంటున్నారు.

'ఊరికే ఉన్నాయంటే కాదు. చూపించాలి. దయ్యాన్ని చూపించక పోయినా, కనీసం దయ్యాన్ని చూసిన వాళ్ళని ఎవరినైనా చూపించండి చూద్దాం' ఛాలెంజ్ చేశాడు శ్రీధర్.

'ఎందుకు లేరు? మా చిన్నమావయ్య తోడల్లుడి తమ్ముడి క్లోజ్ ఫ్రెండ్ వాళ్ళ కజిను చూశాట్ట వాళ్ళ ఊళ్ళో చింత చెట్టు మీద రాత్రి సెకండ్ షో నించి వస్తూ'.

'గాడిద గుడ్డేం కాదూ? ఆ చీకట్లో ఏ పిల్లినో చూసి భయపడి ఉంటాడు. అవునూ సత్యం బాబాయి మాట్లాడ్డేం? బాబాయ్, నువ్వు చెప్పు దయ్యాలున్నాయంటావా?'

'దయ్యాల మాటేమోకానీ, చనిపోయినవాళ్ళ ప్రభావం మాత్రం వాళ్ళు తిరిగిన పరిసరాల మీద ఉంటుందనే అనిపిస్తుందిరా అబ్బాయి, మా సాగర్ కథ వింటే'.

అంటూ మిస్సమ్మలో ఎన్.టి.ఆర్‌లా సిగరెట్టు వెలిగించి నర్దుక్కుచున్నాడు నత్యం బాబాయ్ 'బృందావనం' కథ చెప్పడానికి.



డిటెక్టివ్ కథలు రాసే ఆర్.వి.సాగర్ మీకు తెలుసుగా.... ఆర్ అంటే రక్తంకాదులే, వాడు అద్భుతమైన డిటెక్టివ్ కథలు రాస్తాడు. ప్రతి పది పేజీలకీ ఓ శవం, పాతిక పేజీలకోసారి దొంగల డెన్లో బంధించబడే హీరో, ఎడం చేతికి మూడు వేళ్ళే ఉండే విలన్లూ, మ్యావ్, మ్యావ్ అంటూ పిల్లి భాషలో మాట్లాడే బ్లాక్ క్యాట్ గాంగులూ, అన్నిటితో థ్రిల్లింగ్‌గా సాగిపోతుంటాయి వాడి నవలలు.

వాడికీ, వాడి మేనత్త సుందరికీ ఎప్పుడూ గొడవ జరుగుతూ ఉండేది.

'శ్రీరంగం సుందరీదేవి' మీకు తెలుసనుకుంటాను. పాతికేళ్ళ క్రితం ఆవిడ పుస్తకం లేని బుక్‌షాపు ఉండేది కాదు. ప్రేమ కథలు చదివే వాళ్ళందరూ ఆవిడ వుస్తకాల కోనం కాచుకుకూచునే వాళ్ళు.

సాగర్‌కి డిటెక్టివ్ రైటర్‌గా కాస్త పేరు వచ్చినప్పట్నించే ఇద్దరికీ గొడవ జరుగుతూ ఉండేది. సుందరి రాసేదంతా కలల్లోనే తప్ప, నిజ జీవితంలో అలా ఎప్పుడూ జరగదనీ మా వాడు వాదించేవాడు. వాడు రాసేది బీభత్సం అనీ, అంత భయంకరంగా రాసేది సాహిత్యమే కాదనీ ఆవిడ వాదన.

చిన్నప్పుడు తనని ఎత్తుకు తిప్పేదనీ, అడిగినప్పుడల్లా చాక్లేట్లు కొనుక్కుందుకు డబ్బులిచ్చేదన్న కృతజ్ఞత కూడా లేకుండా వీడు ఆవిడ రచనలని ఏకేసే వాడు.

ఆవిడ పోతూ, పోతూ సాగర్ పేర్న నాలుగు లక్షలు, ఊరికి దూరంగా 'బృందావనం' అనే పేరుతో తను కట్టించుకున్న ఓ కాటేజీ రాసింది.



కానీ, ఓ కండిషన్ పెట్టింది. సాగర్ ఆ కాటేజీలో ఆరు నెలలు ఉంటేనే ఆ డబ్బూ, ఆ కాటేజీ వాడికి చెందుతాయి.

సాగర్ తన పుస్తకాల మీద బాగానే సంపాయిస్తున్నా, డబ్బు చేదు కాదుగా. అందుకే ఆ విల్లు చదివిన వారం రోజుల్లో ఆ కాటేజీకి కాపరం మార్చేశాడు.

తోట చుట్టూ వెదురుతో కట్టిన దడి, అది కనిపించకుండా ఆ దడి చుట్టూ అల్లుకున్న విరగబూసిన బోగన్ విల్లా తీగలు ఓ మూలగా పెద్ద పున్నాగ చెట్టు తెల్లారుఝామునే తెల్లటి పూలతో వాకిలంతా ముగ్గులేసి మంచు తెరలని తొలగించుకుని తొంగిచూసే తెలికిరణాల కోసం ఇంటిని ముస్తాబు చేస్తూ ఉంటుంది.

అలా సుఖంగా ఆ ఇంట్లో ఉంటూ వారం తిరిగేసరికే తను మొదలు పెట్టిన కొత్త నవల పూర్తి చేయబోతుండగా-

ఆ రోజు హీరో పొద్దున లైబ్రరీలో కూచుని పుస్తకం చదువుతున్నాడు. బయట చిన్నగా అడుగుల చప్పుడు వినిపించింది. వెంటనే చప్పుడు చెయ్యకుండా టేబుల్ డ్రాలోంచి పిస్టల్ తీసి వేగంగా అడుగులు వేస్తూ తలుపు దగ్గరకి చేరాడు. నిదానంగా, చాలా నిదానంగా బయట ఎవరో తలుపు మీద చెయ్యివేశారు. అతను ఒక్క క్షణం గట్టిగా ఊపిరి పీల్చుకుని, పిస్టల్ ఎడం చేత్తో పట్టుకుని కుడిచేత్తో తలుపు తెరిచాడు.

ఎదురుగా ఓ అందమైన ఆడపిల్ల పెద్దపెద్ద కళ్ళతో ఆశ్చర్యంగా అతనివైపే చూస్తోంది. అతను చప్పున పిస్టల్ జేబులోకి తోసేశాడు. ఆమె చిరునవ్వుతో 'నన్ను గుర్తు పట్టలేదా?' అంది....,

..... రాస్తున్న సాగర్ ఒక్క క్షణం ఆగాడు. కళ్ళు నులుముకుని తను రాసింది మళ్ళీ చదివాడు. ఈ అమ్మాయెవరు? తన కథలోకి ఎలా వచ్చింది? ఆశ్చర్యంగా తన నోట్సు తీసి చూసుకున్నాడు. అది సరిగ్గానే ఉంది. అతను తలుపు తియ్యగానే ఒక ఆగంతకుడు రక్తసిక్తమైన ఒంటితో అతని చేతుల్లో వాలిపోయి, 'అమ్మను రక్షించు... రక్షించు... ఎర్రతేలు గ్యాంగు వాళ్ళు ఈ నెల పదమూడున...' అంటూ మాట పూర్తి చెయ్యకుండా కన్ను మూస్తాడు. మరి ఈ అమ్మాయెవరు? అనుకుంటూ ఆ పేజీ చింపేసి, మళ్ళీ ఫెయిర్ చెయ్యడం మొదలుపెట్టాడు.

అసలు సాగర్‌కి తన కథల్లో హీరోయిన్లు ఉండటం ఇష్టం లేదు. ఖూలు వెలికి దొంగల్ని పట్టుకునే టైమంతా అనవసరంగా వీళ్లతో ప్రేమ కలాపాల్లో పాడు చేస్తారు. పైగా సరిగ్గా దొంగల గ్యాంగు పట్టుబడే సమయానికే బాస్ చేతిలో కిడ్‌నాప్ అయిపోయి హీరోని ఇబ్బంది పెడుతూ ఉంటారు.

అలాంటిది తన కథలోకి అమ్మాయెలా వచ్చిందోనని ఆశ్చర్యపోతూ మళ్ళీ కథరాయడం కొనసాగించాడు.

అలా ఓ పది నిమిషాలు గడిచేసరికి బయట కుక్కపిల్ల టామీ గొడవ చెయ్యడం మొదలుపెట్టింది. టామీ గొడవతో పాటు ఇష్, ఇష్... అంటూ ఇంకో ఆడగొంతు విన్పించడంతో లేచి కిటికీలోంచి తొంగిచూశాడు. గుమ్మం దగ్గర ఒక అమ్మాయి నుంచుని ఉంది చేతిలో ఓ బొచ్చు కుక్కపిల్లతో (పేరు ట్వీటీ అని తర్వాత తెలిసింది) ప్రపంచంలో ఉన్న వస్తువులన్నీ తను నాకి చూడడానికే తయారయ్యాయన్న నమ్మకంగల టామీ ఆ బొచ్చుకుక్క కోసం ఆ అమ్మాయి మీదకి దూకుతోంది. సాగర్ పక్కనే ఉన్న పేపర్ వేయిట్ గురిచూసి విసిరాడు. దాంతో టామీ వెనక్కి తిరిగి వెళ్ళిపోయింది.

'అక్కడే వుండండి ఇపుడే వస్తాను' అంటూ చుట్టు తిరిగి వెళ్ళి తలుపు తీసాడు. ఎదురుగా ఓ అందమైన అమ్మాయి.

పొందిగ్గా పరికిణీ ఓణీల్లో, కాళ్ళకి పట్టాలు, చేతుల నిండా గాజులు, చెవులకి జూకాలు, దొనగింజలాంటి బొట్టు, కళ్ళకు కాటుక, వదులుగా పొడుగ్గా ఉన్న జడ, తలలో కనకాంబరాల మాల, ఆత్రంగా తనవైపు చూస్తున్న ఆ అమ్మాయి వైపు ప్రశ్నార్థకంగా చూశాడు.



"సుందరీ దేవిగారు ఇక్కడే కథలూ అవీ రాసేవారు కదండీ" అంది ఆ అమ్మాయి.

"అవును"

"అబ్బ! మీ తోట చాలా బావుందండి. ఒక్కసారి ఈ ఇల్లు కూడా చూడొచ్చునాండీ" అంటూ చొరవగా లోపలికొచ్చేసింది.

'రండి చూద్దురుగాని, ఇంతకీ మీకు మా అత్తయ్య నవలలు నచ్చుతాయా?" అన్నాడు సాగర్.

'అయ్యో! నచ్చుతాయా అంటూ అంత తేలిగ్గా అడుగుతారేంటండీ బాబూ? ఆవిడ కథలు, నవలలు ఒక్కటి కూడా వదిలేదాన్ని కాదు. ఇంతకీ మీరెవరు?'

"నేనావిడ మేనల్లుడిని లెండి. నా పేరు ఆర్.వి.సాగర్' అన్నాడు.

"అలాగా, నాపేరు నర్మద. ఇంతకీ మీరేం చేస్తుంటారు?"

'నేను డిటెక్టివ్ నవలలు అవీ రాస్తుంటాను' అన్నాడు కొంచెం కోపంగా.

'ఓ... నేను... నేను... సారీ అండీ. నేను కొంచెం వాస్తవానికి దగ్గరగా ఉండే పుస్తకాలే చదువుతాను' అందామె మొహం అదోలాపెట్టి.

'అంటే మీ ఉద్దేశ్యం మా అత్తయ్య పుస్తకాలు వాస్తవికంగా ఉంటాయనా?'

'అదే ఆవిడ గొప్పతనం. ఎన్ని కథలు, అన్ని నిజంగా జరుగుతున్నట్టే అనిపిస్తాయి. ఈ ఇల్లే చూడండి. అచ్చు ఆవిడ కథల్లో ఇల్లులాగే లేదూ? ఆతోట, ఆ పున్నాగచెట్టు, కొబ్బరిచెట్లు, అన్నీ ఆవిడ కథల్లో వచ్చేవే'.

ఆ అమ్మాయిని చూసినప్పట్నించీ ఆలోచిస్తున్నాడు సాగర్ బాగా తెలిసిన మనిషిలా ఉందేనని. సడన్‌గా ఇప్పుడే తోచిందతనికి ఆ అమ్మాయి అచ్చం తన మేనత్త నవలల్లో కథానాయికలా ఉందని.

ఇంతలో ఆ అమ్మాయి అంది' మీరు అచ్చం సుందరీదేవి గారి నవలల్లో హీరోలా ఉన్నారు'.

'నేనా?' హడిలిపోతూ అడిగాడు సాగర్.

'అవునండీ మీరే, ఆ ఒడ్డు, పొడుగు, ఎన్నిసార్లు వెనక్కి దువ్వినా మొహం మీద పడే ఉంగరాల జుట్టు, ఇంట్లో కూడా మడత నలగని బట్టలు, మాటి మాటికి బిగుసుకునే దవడ కండరం.'

'తన ఉంగరాల జుట్టుని, పొద్దున్నే గడ్డం గీసుకుని స్నానం చేసేసినందుకు తనని, వద్దన్నా పైజమా లాల్చీలు ఇస్త్రీ చేసే పనిమనిషి సీతమ్మనీ అందర్నీ తిట్టుకున్నాడు. మాటి మాటికీ ఆ హీరోలకెందుకు దవడ కండరం బిగుసుకుంటుందో కానీ, తనకి మాత్రం ఈ అమ్మాయి ఎప్పుడు వెళ్తుందా, తనెప్పుడు కథ పూర్తి చేద్దామా అనే ఆలోచనతోనే బిగుసుకుంటోందని చెప్పలేక ఏడవలేక నవ్వుతూ నుంచున్నాడు.

ఆ అమ్మాయి సాగర్‌తో 'మీరు చాలా అదృష్టవంతులండీ, సుందరిగారు మీ మేనత్తకావడం నిజంగా చాలా గొప్ప అదృష్టం' అంటూ బయల్దేరింది.

'అమ్మయ్య!' అనుకుని ఆమెని సాగనంపడానికి గేటువరకూ వెళ్ళాడు సాగర్.

'చూడండీ నర్మదగారూ, నిజ జీవితానికీ, కథలకీ చాలా దూరం, జీవితం కథా కాదు, కథ జీవితమూ కాదు. అందునా మా అత్తయ్య నవలలు అస్సలు జీవితం కాదు. ఓ అమ్మాయి అబ్బాయి ఏదో చిన్న ఆక్సిడెంట్‌తో కలుసుకోవడం, ఇద్దరూ ఒకే ఇంట్లో కొన్నాళ్ళు ఉండాల్సి రావడం, దాంతో వాళ్ళ మధ్య ప్రేమ పుట్టడం... ఇదంతా నిజంగా జరగదు... అరే చూసుకోండి....'

అతని మాటలు పూర్తికాకుండానే అతని వైపు చూస్తూ నడుస్తున్న నర్మద కాలు ఓ రాయిమీద పడి, పాదం మెలిక పడి కుప్పలా కూలిపోయింది. చూస్తుండగానే పాదం ఇంతలావున వాచిపోయింది. కదలలేక అవస్థ పడుతున్న నర్మదని రెండు చేతులతో ఎత్తుకుని ఇంట్లోకి తీసుకొచ్చి, గెస్టురూంలో మంచం మీద పడుకోపెట్టాడు.

ఏమైందంటూ పరుగెత్తుకొచ్చిన పనివాడు రామయ్యని డాక్టరు కోసం ఫోన్ చెయ్యమని చెప్పి, తను ఆ పాదానికి ఐసు పెడ్తూ కూర్చున్నాడు. వాపు కాస్త తగ్గుమొహం పట్టిందని అన్పించాక తలెత్తి నర్మద వైపు చూశాడు. ఆ అమ్మాయి ఆరాధనగా అతన్నే చూస్తోంది. ఆ అమ్మాయి కళ్ళలోకి చూడ్డానికి భయం వేసి డాక్టర్ కోసం చూసే నెపంతో బయటకి వచ్చేశాడు.

ఆ వచ్చిన డాక్టరు ఆ అమ్మాయి కాలు చూసి 'హెయిర్‌లైన్ ఫ్రాక్చరే! ఓ వారంలో తగ్గిపోతుంది. కానీ ఈ వారం మాత్రం కాలు కింద పెట్టకూడదు. నేను రోజూ వచ్చి బ్యాండేజి వేస్తాన్లు' అంటూ బయటకు వెళ్ళాడు.

'కానీ డాక్టర్' అంటూ ఆయన వెనకే బయటకొచ్చిన సాగర్ భుజం తడుతూ, 'ఏం ఫర్లేదోయ్ ఆ అమ్మాయి వాళ్ళు ఈ మధ్య కొత్తగా ఈ ఊరొచ్చారు. మేనమామ, తను... ఇద్దరే ఉంటారు. అతనితో నేను మాట్లాడతాను. ఆ అమ్మాయి ఇక్కడే కొన్ని రోజుల పాటు, మళ్ళీ మాట్లాడితే కొన్నివారాల పాటు ఉంటుంది. నువ్వేం వర్రీ అవ్వకు' అంటూ సాగిపోయాడు.

వర్రీ అవ్వద్దా? అని జుట్టు చెరుపుకోబోయి, మళ్ళీ ఆపేసుకుని లోపలికి వెళ్ళాడు. లోపల నర్మద టాబ్లెట్ నోట్లో వేసుకుంటే సీతమ్మ నోటికి నీళ్ళు అందిస్తోంది. దెబ్బ కాలికి తగిలితే, చేత్తో గ్లాసు పట్టుకోవడానికి ఇబ్బందేమిటో అడగకుండా లైబ్రరీకి వెళ్ళిపోయాడు.

వారం రోజుల తర్వాత.... నర్మద పిలుస్తోందంటూ సీతమ్మ రావడంతో లోపలికి వెళ్ళాడు.

'పిలిచారట' అన్నాడు ఆమె ఎదురుగా కూచుంటూ.

"అవును. మీరు చెప్పకపోయినా, మీ మనసు పడే మూగ వేదన నాకు అర్థమయింది. రోజూ మీరు అరవిరిసిన గులాబీని నా గుమ్మంలో ఉంచడం, దోసిట దూసిన మల్లెలతో పాటు మీ హృదయాన్ని కూడా నాకు అర్పించడం నాకు తెలుసు. పున్నాగ పూలతో మీ ప్రేమనంతా రంగరించి, నా పాదాల మీద ఉంచిన క్షణమే నేను మీ పాదదాసినై పోయాను. మీరు చెప్పకపోయినా, నా వైపు చూసినప్పుడల్లా మీ కళ్ళలోని మూగబాధ మీ మనసులోని భావాలని నాకు ఎప్పటికప్పుడు తెలియజేస్తూనే ఉంది." అంది నర్మద. నిజమే!



సాగర్ అవన్నీ చేస్తున్నాడు. ఎందుకు చేస్తున్నాడో అతనికే తెలియదు. మేనత్త ఆత్మ పరిసరాలలో తిరుగుతూ అతనిచేత ఈ పనులు చేయిస్తోందని నమ్మసాగాడు. ఆ ప్రభావంలో నుండి బయట పడాలని తెగ ప్రయత్నిస్తున్నాడు కూడా.

'అలాగా? అయితే నన్ను క్షమించండి' అనబోయి, ఆమె మాటలు ఇంకా పూర్తికాలేదని ఆగిపోయాడు.

'కానీ, మీరు నన్ను మన్నించాలి, ఇంతకాలం ఈ నిజం మీకు చెప్పకుండా దాచినందుకు. ఇప్పుడు నేను చెప్పబోయే నిజం మీ మనస్సునెంత గాయపర్చుస్తుందో నాకు తెలుసు. అయినా చెప్పక తప్పదు. నా మనసంతా మీరే నిండి ఉన్నారు. కానీ, నేను మీదాన్ని కాలేను. నా ఒక్కొక్కమాట ఒకో బాణంలా మీ గుండెని తూట్లు పొడుస్తుందని నాకు తెలుసు. కానీ , ఇది మీకు చెప్పితీరాలి. నాకు ఇదివరకే పెళ్ళి.... పెళ్ళి.."

'పెళ్ళి నిశ్చయం అయిపోయిందా?' సంతోషం స్వరంలో వినిపించకుండా ఉండేందుకు సాగర్ చాలా కష్టపడాల్సి వచ్చింది.

'అవును. మా మావయ్య ఉన్నాడే, తనతోటే నా పెళ్ళి చిన్నప్పుడే నిశ్చయం అయిపోయింది. ఆక్సిడెంట్‌లో చనిపోతూ అమ్మ, నాన్న మావయ్యతో ఒట్టు వేయించుకున్నారు నన్ను పెళ్ళిచేసుకుంటానని. ఇన్నాళ్ళూ నేను హాస్టల్లో ఉండి చదువుకున్నాను. పోయిన్నెల ఈ ఊరొచ్చాను. వచ్చే నెలే మా పెళ్ళి. నన్ను మన్నించండి. నా హృదయం మీదే అయినా, అమ్మ కిచ్చిన మాట తప్పలేను.....'

'ఔనౌను. అన్నలు తప్పకూడదు. అమ్మకిచ్చిన మాట తప్పడమే!? అందులోను మరణశయ్యమీద ఇచ్చిన మాట. మీరు మీ మావయ్యనే పెళ్ళి చేసుకోండి'. అంటూ హడావిడిగా బయటకి వచ్చి, గబగబా రోడ్డుమీదకు వెళ్ళిపోయాడు తన ఆనందం ఆ అమ్మాయికి కనిపించ కూడదని.

ఓ గంట అలా తిరిగి, కొత్త కథకి ప్లాట్ కూడా ఆలోచించేసుకుని సంతోషంగా ఇంటికి వచ్చాడు సాగర్.

హాల్లో సిగరెట్ తాగుతూ, శూన్యంలోకి చూస్తూ కూచున్న వ్యక్తిని చూడగానే 'హలో సార్ నమస్కారం. మీరే నర్మద మామయ్య అనుకుంటాను. నా పేరు సాగర్' అంటూ పరిచయం చేసుకున్నాడు.

"నేను చంద్రశేఖర్‌ని. నర్మద నాకంతా చెప్పింది. ఇది విధి విలాసం సాగర్‌గారూ. ప్రేమ ఎప్పుడు ఎలా పుడుతుందో ఎవరు చెప్పగలరు? నన్ను చూడండి చిన్నప్పట్నించీ నర్మదనే భార్యగా ఊహించుకున్నాను. తనని హాస్టల్లో ఉంచి చదివించాను. వచ్చేనెల తనని పెళ్ళి చేసుకుని ఆమెరికా తీసుకువెళ్ళాలని అన్ని ఏర్పాట్లు చేసుకున్నాను.ఈ లోపలే ఈ ప్రమాదం జరిగిపోయింది."

'ఫర్వాలేదు లెండి. మీ ఇద్దరికీ పెళ్ళిచేసి, ఇద్దరు ప్రేమికులను కలిపానన్న సంతృప్తితో సంతోషంగా నా భావి జీవితాన్ని గడిపేస్తాను. మీరు ఏమీ ఆలోచించకుండా నర్మద దగ్గరకి వెళ్ళి పెళ్ళి విషయం మాట్లాడండి' విషాదంతో కూడిన చిరునవ్వుతో సాగర్‌ని భుజం పట్టుకుని నర్మద గదివైపు తోశాడతను.

తన గదిలో నర్మద తలదించుకుని విషాదాన్ని అనుభవిస్తోంది. సాగర్‌ని చూడగానే 'జీవితం ఎంత విషాదమయం సాగర్‌గారూ, మావయ్యకి అంతా చెప్పేశాను. తన బాధ చూస్తుంటే నాకు జీవితం మీదే విరక్తి కలుగుతోంది' అంది.

'నాకూ అంతే. జీవితం మీదే విరక్తి కలుగుతోంది' ఇంకా విషాదంగా అన్నాడు సాగర్.

ఆమె నిట్టూర్పులు విడుస్తూ, చంద్రశేఖర్ బాధని తన బాధలా అనుభవిస్తున్న సాగర్ ఔన్నత్యానికి మురిసిపోతూ అతని వైపు ఆరాధన నిండిన కళ్ళతో చూస్తోంది.

విధి తనపట్ల ఆడిన ఈ వింత నాటకాన్ని భరించలేక, కాసేపు సిగరెట్ తాగుదామని బయటకి తోటలోకి వచ్చాడు సాగర్. ఒక్క దమ్ము లాగాడో లేదో చంద్రశేఖర్ వచ్చి చనువుగా అతని చేతిలోంచి సిగరెట్ లాక్కుని అవతల పారేశాడు.

'మీకు తెలీదనుకుంటాను నర్మదకి సిగరెట్ తాగే వాళ్ళంటే చాలా అసహ్యం. ఇంకెప్పుడు తాక్కండి' అంటూ కోప్పడ్డాడు. పైగా 'నా కోసం అంత బాధపడకండి సాగర్‌గారూ, ఒక్కసారి నర్మదని మీ చేతుల్లో పెట్టేస్తే నేను నిశ్చింతగా అమెరికా వెళ్ళిపోయి నా వ్యాపారాలు చూసుకుంటాను' అన్నాడు.

'అబ్బే మీరలా మాట్లాడకూడదు. నర్మద తల్లికి మీరిచ్చిన మాట... మాట గుర్తు తెచ్చుకోండి. మనిషన్నాక మాట మీదే నిలబడాలి. మాటని మించిందేమీ లేదు' అన్నాడు కంగారుగా తనేం అన్నాడో తనకే అర్థం కాకపోయినా.

'మీదెంత విశాల హృదయం సాగర్‌బాబూ. నా మాట కోసం మీ ప్రేమని త్యాగం చేస్తారా? అంత త్యాగాన్ని నా మనస్సు భరించలేదు బాబూ. ఇంతకీ మీరు నర్మదని పెళ్ళి చేసుకొమ్మని అడిగారా?

'లేదు. ఇంకా అడగలేదు'

'ఏం? ఎందుకడగలేదు?' కనుబొమ్మలు ముడివేస్తూ అడిగాడు చంద్రశేఖరం.

'అదీ.... అదీ... నర్మద మిమ్మల్నే'... నీళ్ళు నమిలాడు.

'చూడండి. చిన్నప్పట్నించీ నర్మద ఏది కావాలన్నా క్షణాల్లో తెచ్చి ఇచ్చాను. ఇప్పుడు తను మిమ్మల్ని కోరుకుంటోంది. మీరు పెళ్ళికి ఒప్పుకుని తీరాలి. లేకపోతే ఒప్పించడం కూడా నాకు తెలుసు' అన్నాడు కాస్త కోపంగా. మళ్ళీ అంతలోనే సర్దుకుని-

'మీ మనసు నాకు తెలుసు సాగర్ బాబూ మీ నీడలో నర్మద జీవితం మూడు పువ్వులూ, ఆరు కాయలూ అవుతుంది. వెళ్ళండి వెళ్ళి పెళ్ళి విషయం మాట్లాడండి. వెళ్ళండి మీరు చెప్పే శుభవార్త కోసం పెరట్లో జామచెట్టు కింద ఎదురు చూస్తూ ఉంటాను' అన్నాడు విషాదం దిగమింగిన చిరునవ్వుతో.

తన మాట పూర్తికానివ్వకుండా ఆయన మాట్లాడటం మొదలు పెట్టినప్పట్నించీ తల దించుకునీ రాళ్ళనీ, రప్పల్నీ చూస్తున్న సాగర్ దృష్టి ఇందాక ఆయన లాగి విసిరేసిన సగం కాలిన సిగరెట్ మీద పడింది. ఇంక తన జీవితమూ



అలాగే నేలపాలు కాబోతుందని తెలిసినా, వద్దు వద్దనుకుంటూనే ఇంటివైపు వెళ్ళబోయాడు. నర్మద బయట వరండాలో కూర్చుని 'టీ' తాగుతోంది. సాగర్‌ని చూసి, అతనికీ ఓ కప్పు వేడి టీ కలిపింది పక్కనే ఉన్న కెటిల్‌లోంచి.

'వద్దు, వద్దు ఇదే ఆఖరిఛాన్స్ పారిపో...' మనసు చెప్తూనే ఉన్నా... 'నర్మదా నీతో ఓ ముఖ్యమైన విషయం మాట్లాడాలి. మనం...'

అతని నోట్లో మాట పూర్తికాకుండానే టీ కప్పులున్న టేబుల్ టాపు పైకి లేవడం మొదలు పెట్టింది. దాంతో టీ కప్పు పక్కకి ఒరిగి పొగలు కక్కుతున్న టీ అతని కాలిమీద పడింది. ఇవేవి గమనించని టామీ మాత్రం ఎదురుగా నర్మద ఒళ్ళోంచి అప్పుడే కిందకి జారిన 'ట్వీటీ' వెంట పడింది.

అసలు దాన్ని రుచి చూసి అది తినే పదార్థం అవునో కాదో తేల్చుకోవాలని టామీకి దాన్ని చూసిన రోజూనుంచీ మహా కోరిగ్గాఉంది. ఎప్పుడూ అవకాశం దొరకలేదు. ఇవాళ టేబుల్ కింద పడుకుని నిద్రపోతుంటే అనుకోకుండా అవకాశం దొరికింది. అందుకే దాన్ని పట్టుకునే ప్రయత్నంలో పడింది.

ట్వీటీ కూడా చిన్నగా ఉన్నా, మాబాగా పరిగెడుతుంది. అది స్పీడుగా పరిగెత్తి తోటలోకి, తోటలోంచి దడి దూకి రోడ్డు మీదకి పరుగెట్టింది.

వెనక సాగర్ 'టామీ' అని గర్జిస్తున్నా వినకుండా టామీ ట్వీటీ వెంటపడింది. కాలిన కాళ్ళ గురించి అర్జంటుగా చర్చించాలని సాగర్ టామీ వెంట పడ్డాడు. ఇలా ముగ్గురూ చాలా దూరం పరిగెట్టాక ట్వీటీకి ఏం ఆలోచన వచ్చిందో పక్కనే ఉన్న సన్నటి పైపులో దూరింది.

అక్కడే ఆగిన టామీ 'బయటికి రా నిన్ను కొంచెం రుచి చూస్తానంతే' అంటూ పైపులో ట్వీటీకి వినిపించేలా అరుస్తోంది.

కొంచెం ఆలస్యంగా అక్కడికొచ్చిన సాగర్ 'టామీ' అని గట్టిగా పిలిచాడు తన కాళ్ళు - వేడి టీ విషయం తేల్చుకుందామని.

అతని గొంతు వినగానే విశ్వాసంగా చూస్తూ సంతోషంగా వెనక్కి తిరిగిన టామీ కళ్ళలోకి చూడగానే అతని కోపం మంచులా కరిగిపోయింది. అంతేకాదు ఇంతకాలం తనని కమ్మేసిన ఏవో తెరలు తొలగినట్టుగా, మంచు పొరలు విడిపోయినట్టుగా అన్పించింది. ఆ సాయంవెలుగులో విశాలమేన ప్రకృతి ఒడిలో మళ్ళీ తను పాత సాగర్ అయిపోయినట్టు అన్పించింది.

తనకింత సాయం చేసిన టామీని తీసుకుని పట్నం వైపు సంతోషంగా నడక సాగించాడు సాగర్. అలా టామీతో సహా సూర్యాస్తమయంలోకి నడిచి వెళ్ళిపోతూ వాళ్ళ మేనత్త ప్రభావం నుంచీ బయటపడ్డాడు.

అంటూ కథ ముగించాడు సత్యం బాబాయి. 'ఇదంతా నిజంగా జరిగిందనడానికి ప్రత్యక్ష సాక్ష్యంగా ఇప్పటికీ సాగర్ ఎక్కడికి వెళ్ళినా టామీని వెంటపెట్టుకునే వెళ్తాడు. అందుకే ఇదంతా నిజంగా జరిగిందనీ, చనిపోయిన వాళ్ళ ప్రభావం ఆ పరిసరాల మీద ఉంటుందనీ నేను నమ్ముతున్నాను' అన్నాడు.

'మరి తర్వాతెప్పుడూ అతనా కాటేజికి వెళ్ళలేదా? ఎవరో అడిగారు.

'లేదు. పట్నం రాగానే 'నర్మదని పెళ్ళి చేసుకునే హక్కు చంద్రశేఖర్‌కే ఉందనీ, మధ్యలో వచ్చిన తను మధ్యలోనే వెళ్ళిపోవడమే న్యాయమనీ' ఉత్తరం రాసి కొన్నాళ్ళ కోసం ఎవ్వరికీ చెప్పకుండా ఊటి చెక్కేశాడు.

'ఇదిగో ఈ మధ్యే వి.లక్ష్మి రాసిన 'నికుంజ విహారి', 'నాదప్రణయిని', 'ప్రేమదీపిక' పుస్తకాలు మార్కెట్లో కనిపిస్తున్నాయి. బహుశ సాగర్ చెల్లెలు లక్ష్మి ఆ కాటేజీలో ఉంటూ మేనత్త పేరు నిలబెడుతోందనుకుంటాను' అన్నాడు సత్యం బాబాయి తాజాగా ఇంకో సిగరెట్టు వెలిగించుకుంటూ.




# ఫన్ దేహాలు



శంకరనారాయణ గారు ఈ 'ఫన్‌దేహాలు' పుస్తకం ద్వారా ఎంతమందికో 'ఫన్‌డమెంటల్ డౌట్స్'(తెలుగులో 'మూలశంక'లు) పోగొట్టిన 'ఫన్'డమెంటలిస్టు'గా గోచరిస్తారు.

వారి ,"దిశ్లేష'నల్ అండ్ 'గుయ' లే బ్యాంకులో ప్రవేశించి, మీ 'టెన్షన్' యావత్తూ డిపాజిట్ చేసి, 'లైఫ్ ఇంటరెస్ట్' డ్రా చేసుకోవాలని వుందా? మరిహ ఆలశ్యం దేనికి.'ఎంటర్' కొట్టండి!

-ఆడవాళ్లకి పెళ్లయినట్లు తెలిపేది మంగళసూత్రాలు. మగవాళ్లకి నేలచూపులు, కూరలసంచీ!

-ప్రతి పురుషుని విజయం వెనకా ఓ స్త్రీ వుంటుంది. అతని అపజయం వెనుక బయటకి చెప్పుకోలేని ఎందరో స్త్రీలుంటారు.

-పురుషులందు పుణ్యాపురుషులు 'వే'రయా కాదు! 'లే'రయా!

-దేవుడి గుడికి తాళం ఎందుకు?

భజన చేసే చోట తాళం వెయ్యక తప్పదు కదా!

-మోటు కంట్రోల్ కంటే రిమోట్ కంట్రోలే నయం!

-యూరీ గగారిన్‌కి దేవుడు కనిపించి వుంటాడా?

అపార్ట్‌మెంట్ మెట్లు ఎక్కుతుంటేనే కనిపిస్తాడే. ఇక అంతరిక్షంలోకి వెళ్తే కనబడడా?

-వృద్ధాప్యంలో 'హరి' నామస్మరణ, యవ్వనంలో 'మనోహరి' నామస్మరణ

-పొలాల గట్ల తగాదాలన్నీ 'చేను' రియాక్షన్లే!

-నచ్చిన అమ్మాయి రంభలా కనబడక పోవడమే మంచిది. ఆమెలో రంభ లక్షణాలు ఊహించుకుంటే కంటికి నిద్ర పట్టదు.

-మనిషి చేసే పనులు - దాదాపు అన్నీ - చేసేవి 'మర'మనుషులు. పూర్తిగా అన్నీ చేసేవి 'మరు' మనుషులు.

-'అఖిల భారత అప్రజాస్వామ్య పార్టీ' స్థాపించే ఛాన్సు మనకి లేదు. ఇప్పుడున్న పార్టీలన్నీ అలాంటివే!

మీకు ఇంకా నవ్వాలనుందా? 'ఫన్‌దేహాలు' పుస్తక పఠితల జాబితాలో జాయి'నవ్వండి'. మైల్స్ ఆఫ్ స్మైల్స్!

-నిశాపతి



# తెలుగు సినీ గీత కోశం

| నెం. | పాట | చిత్రం పేరు | సం॥ | సంగీత దర్శకుడు | రచన | గానం |
|---|---|---|---|---|---|---|
| 700 | ఆ పొద్దు ఈ పొద్దు ఏ పొద్దురా | మహాకవి క్షేత్రయ్య | 1976 | పి. ఆదినారాయణ రావు | సి.నారాయణరెడ్డి | ఎస్.పి.బాలు, సుశీల |
| 701 | భూతలమున (వెర్స్) | మహాకవి క్షేత్రయ్య | 1976 | పి. ఆదినారాయణ రావు | క్షేత్రయ్య పదం | రామకృష్ణ |
| 702 | చల్లగా నెలకొనవయ్యా | మహాకవి క్షేత్రయ్య | 1976 | పి. ఆదినారాయణ రావు | ఆరుద్ర | రామకృష్ణ |
| 703 | చిన్నప్పుడు రతి కేళికి (వెర్స్) | మహాకవి క్షేత్రయ్య | 1976 | పి. ఆదినారాయణ రావు | రంగాజమ్మ పద్యం | సుశీల |
| 704 | జయ జయ గోపాల బాలా | మహాకవి క్షేత్రయ్య | 1976 | పి. ఆదినారాయణ రావు | ఆరుద్ర | రామకృష్ణ, కోరస్ |
| 705 | మేలుకో కవిరాజా | మహాకవి క్షేత్రయ్య | 1976 | పి. ఆదినారాయణ రావు | సి.నారాయణరెడ్డి | సుశీల, ఎస్.పి.బాలు |
| 706 | శ్రీ మన్మహాదేవా | మహాకవి క్షేత్రయ్య | 1976 | పి. ఆదినారాయణ రావు | ఆరుద్ర | సుశీల, పిఠాపురం, ఆనంద్ |
| 707 | శ్రీ మనని మనశంభోజ (దండకం) | మహాకవి క్షేత్రయ్య | 1976 | పి. ఆదినారాయణ రావు | ఆరుద్ర | ఎస్.పి.బాలు, సుశీల |
| 708 | శ్రీ విజయము (వెర్స్) | మహాకవి క్షేత్రయ్య | 1976 | పి. ఆదినారాయణ రావు | రంగాజమ్మ పద్యం | సుశీల |
| 709 | వదరక పో పో | మహాకవి క్షేత్రయ్య | 1976 | పి. ఆదినారాయణ రావు | క్షేత్రయ్య పదం | రామకృష్ణ |
| 710 | విడజారు గొజ్జంగి | మహాకవి క్షేత్రయ్య | 1976 | పి. ఆదినారాయణ రావు | క్షేత్రయ్య పదం | రామకృష్ణ |
| 711 | ఎంత ముచ్చటైనవాడే | మహాకవి క్షేత్రయ్య | 1976 | పి. ఆదినారాయణ రావు | సి.నారాయణరెడ్డి | ఎస్.పి.బాలు, సుశీల |
| 712 | ఎటువంటి మోహమో గని | మహాకవి క్షేత్రయ్య | 1976 | పి. ఆదినారాయణ రావు | క్షేత్రయ్య పదం | రామకృష్ణ |
| 713 | మెల్లగా మెల్లగా మేను తాకకోయి | మైరావణ | 1964 | ఎస్.రాజేశ్వరరావు | ఆరుద్ర | ఎస్.జానకి, రఘునాధ పాణిగ్రాహి |
| 714 | ముత్యాల కన్నెలము వచ్చేములే | మైరావణ | 1964 | ఎస్.రాజేశ్వరరావు | ఆరుద్ర | ఎస్.జానకి, పార్టీ |
| 715 | నేడు నీ గాధలెన్నో విన్నాను | మైరావణ | 1964 | ఎస్.రాజేశ్వరరావు | ఆరుద్ర | సుశీల |
| 716 | నీవేనా నీవేనా | మైరావణ | 1964 | ఎస్.రాజేశ్వరరావు | సదాశివబ్రహ్మం | సుశీల |
| 717 | నిలవదిపుడు నీ పెదవులపై | మైరావణ | 1964 | ఎస్.రాజేశ్వరరావు | సదాశివబ్రహ్మం | సుశీల |
| 718 | ఓ నిషా సుందరి సుధా మాధురి | మైరావణ | 1964 | ఎస్.రాజేశ్వరరావు | ఆరుద్ర | ఘంటసాల |
| 719 | రామ నామము శ్రీరామ నామము | మైరావణ | 1964 | ఎస్.రాజేశ్వరరావు | ఆరుద్ర | పి.బి.శ్రీనివాస్, కోరస్ |
| 720 | ఏ అందం కావాలంటే ఆ అందం | మైరావణ | 1964 | ఎస్.రాజేశ్వరరావు | ఆరుద్ర | ఎస్.జానకి |
| 721 | కాకాలను పట్టలేము | మమకారం | 1963 | ఘంటసాల | ఎ.వేణుగోపాల్ | రాఘవులు, జమునారాణి, కోరస్ |
| 722 | కలతలు మరచి కష్టం చేద్దాం | మమకారం | 1963 | ఘంటసాల | ఎ.వేణుగోపాల్ | ఘంటసాల, కోరస్ |
| 723 | కన్న తండ్రి ఒడిలో నేడు | మమకారం | 1963 | ఘంటసాల | ఎ.వేణుగోపాల్ | పి.లీల |
| 724 | కన్నుల కలవరం కంటినే చిన్నారి | మమకారం | 1963 | ఘంటసాల | ఎ.వేణుగోపాల్ | పిఠాపురం, జిక్కి |
| 725 | మధురం మధురం మన ప్రణయం | మమకారం | 1963 | ఘంటసాల | ఎ.వేణుగోపాల్ | ఘంటసాల, సుశీల |
| 726 | మదిలో మెదిలే | మమకారం | 1963 | ఘంటసాల | ఎ.వేణుగోపాల్ | జిక్కి, ఎస్.జానకి |
| 727 | నేడు మనకందమైన పరువం | మమకారం | 1963 | ఘంటసాల | ఎ.వేణుగోపాల్ | జిక్కి, ఎస్.జానకి |
| 728 | చిక్కేవురా | మామకు తగ్గ కోడలు | 1969 | ఎస్.రాజేశ్వరరావు | కొసరాజు | ఎల్.ఆర్.ఈశ్వరి, బృందం |
| 729 | హాపీ బర్త్‌డే టూ యూ | మామకు తగ్గ కోడలు | 1969 | ఎస్.రాజేశ్వరరావు | దాశరథి | సుశీల |
| 730 | మనసైన నా రాజా | మామకు తగ్గ కోడలు | 1969 | ఎస్.రాజేశ్వరరావు | దాశరథి | సుశీల, బసవేశ్వర్ |
| 731 | వన్ అండ్ టు ఐ లవ్ యూ | మామకు తగ్గ కోడలు | 1969 | ఎస్.రాజేశ్వరరావు | సి.యస్.రావు | సుశీల |
| 732 | సింగార సింగార | మామకు తగ్గ కోడలు | 1969 | ఎస్.రాజేశ్వరరావు | శ్రీ శ్రీ | సుశీల, కోరస్ |
| 733 | చిన్నారి నా తల్లి | మన సంసారం | 1968 | టి.వి.రాజు | దాశరథి | సుశీల |
| 734 | మణిపురాధీశు | మన సంసారం | 1968 | టి.వి.రాజు | దాశరథి | ఘంటసాల, సుశీల |
| 735 | మై డియర్ వయ్యారి | మన సంసారం | 1968 | టి.వి.రాజు | కొసరాజు | పి.బి.శ్రీనివాస్, ఎల్.ఆర్.ఈశ్వరి |
| 736 | ఓ... గాయపడినా ప్రేమికా | మన సంసారం | 1968 | టి.వి.రాజు | ఆరుద్ర | పి.బి.శ్రీనివాస్, ఎల్.ఆర్.ఈశ్వరి |
| 737 | పతియే నీ దైవమమ్మా | మన సంసారం | 1968 | టి.వి.రాజు | దాశరథి | సుశీల |
| 738 | ఎందుకు పుట్టించేవయ్యా | మన సంసారం | 1968 | టి.వి.రాజు | సి.నారాయణరెడ్డి | ఘంటసాల, జిక్కి, లత, కోరస్ |
| 739 | ఇది మంచి సమయం రారా | మన సంసారం | 1968 | టి.వి.రాజు | - | పి.లీల |
| 740 | ఆవేశం రావాలి | మనసు మాంగల్యం | 1971 | పెండ్యాల | దాశరథి | ఘంటసాల |
| 741 | పో పో ఎంత దూరం పోతావో | మనసు మాంగల్యం | 1971 | పెండ్యాల | ఆత్రేయ | ఎస్.పి.బాలు, జానకి |
| 742 | సన్నని వెన్నెల జలతారు వలె | మనసు మాంగల్యం | 1971 | పెండ్యాల | ఆత్రేయ | ఘంటసాల, సుశీల |
| 743 | ఏ శుభ సమయంలో | మనసు మాంగల్యం | 1971 | పెండ్యాల | దాశరథి | ఘంటసాల, సుశీల |
| 744 | ఎలా వున్నది ఇపుడెలావున్నది | మనసు మాంగల్యం | 1971 | పెండ్యాల | అప్పలాచార్య | పిఠాపురం, స్వర్ణలత |
| 745 | ఎందుకు వచ్చేవో ఎందుకు వెళ్ళావో | మనసు మాంగల్యం | 1971 | పెండ్యాల | ఆత్రేయ | ఘంటసాల |
| 746 | అమ్మలాంటి చల్లనిది | మానవుడు దానవుడు | 1972 | అశ్వత్థామ | దాశరథి | సుశీల |
| 747 | అణువూ అణువున | మానవుడు దానవుడు | 1972 | అశ్వత్థామ | సి.నారాయణరెడ్డి | ఎస్.పి.బాలు, కోరస్ |
| 748 | కంచెకాడ మంచెకాడ | మానవుడు దానవుడు | 1972 | అశ్వత్థామ | సి.నారాయణరెడ్డి | ఎల్.ఆర్.ఈశ్వరి |
| 749 | కొప్పు చూడు కొప్పందం చూడు | మానవుడు దానవుడు | 1972 | అశ్వత్థామ | ఉషశ్రీ | పిఠాపురం, ఎల్.ఆర్.ఈశ్వరి |
| 750 | నిలు నిలు నిలబడు | మానవుడు దానవుడు | 1972 | అశ్వత్థామ | మోదుకూరి జాన్సన్ | సుశీల, ఎల్.ఆర్.ఈశ్వరి, కోరస్ |
| 751 | పచ్చని మన కాపురం | మానవుడు దానవుడు | 1972 | అశ్వత్థామ | సి.నారాయణరెడ్డి | సుశీల |
| 752 | ఎవరు వీరు | మానవుడు దానవుడు | 1972 | అశ్వత్థామ | సి.నారాయణరెడ్డి | ఎస్.పి.బాలు |
| 753 | చెక్కిలి నవ్వింది | మంచికి మరో పేరు | 1976 | ఎస్.రాజేశ్వరరావు | సి.నారాయణరెడ్డి | రామకృష్ణ, సుశీల |
| 754 | జయ జయ రామ హరే | మంచికి మరో పేరు | 1976 | ఎస్.రాజేశ్వరరావు | సి.నారాయణరెడ్డి | ఎస్.పి.బాలు, గ్రూప్ |




| నెం. | పాట | చిత్రం పేరు | సం॥ | సంగీత దర్శకుడు | రచన | గానం |
|---|---|---|---|---|---|---|
| 755 | కళ్ళతో రాసేదే కవిత | మంచికి మరో పేరు | 1976 | ఎస్.రాజేశ్వరరావు | సి.నారాయణరెడ్డి | రామకృష్ణ, సుశీల |
| 756 | విప్పే మొనగాడున్నాడు | మంచికి మరో పేరు | 1976 | ఎస్.రాజేశ్వరరావు | ఆరుద్ర | ఎల్.ఆర్.ఈశ్వరి |
| 757 | విరిసిన ఊహల పందిరిలో | మంచికి మరో పేరు | 1976 | ఎస్.రాజేశ్వరరావు | - | రామకృష్ణ, సుశీల |
| 758 | ఆకలుండదు దాహముండదు | మంచివాడు | 1974 | కె.వి.మహదేవన్ | ఆత్రేయ | ఘంటసాల, సుశీల |
| 759 | అబ్బాయే పుట్టేడు అచ్చము | మంచివాడు | 1974 | కె.వి.మహదేవన్ | ఆత్రేయ | సుశీల |
| 760 | అమ్మాయే పుడుతుంది | మంచివాడు | 1974 | కె.వి.మహదేవన్ | ఆత్రేయ | ఘంటసాల |
| 761 | చిట్టి పాపలు కథలు వింటూ | మంచివాడు | 1974 | కె.వి.మహదేవన్ | ఆత్రేయ | ఘంటసాల, సుశీల |
| 762 | చూస్తా బాగా చూస్తా | మంచివాడు | 1974 | కె.వి.మహదేవన్ | ఆత్రేయ | ఎమ్.రామారావు |
| 763 | మాపటికొస్తావా మరి రేపటికొస్తావా | మంచివాడు | 1974 | కె.వి.మహదేవన్ | సి.నారాయణరెడ్డి | సుశీల |
| 764 | పెట్టి పుట్టిన దానివమ్మా | మంచివాడు | 1974 | కె.వి.మహదేవన్ | ఆత్రేయ | ఘంటసాల |
| 765 | ఈ రేయి కవ్వించింది | మంచివాడు | 1974 | కె.వి.మహదేవన్ | దాశరథి | ఘంటసాల, సుశీల |
| 766 | అంత మరుపే | మాంగల్యానికి మరో ముడి | 1976 | కె.వి.మహదేవన్ | వేటూరి | ఎస్.పి.బాలు, ఎల్.ఆర్.ఈశ్వరి |
| 767 | పిల్లగాలి వీచింది నీ పల్లవి కోసం | మాంగల్యానికి మరో ముడి | 1976 | కె.వి.మహదేవన్ | సి.నారాయణరెడ్డి | ఎస్.పి.బాలు, సుశీల |
| 768 | తాగిన తప్పాయనా | మాంగల్యానికి మరో ముడి | 1976 | కె.వి.మహదేవన్ | వేటూరి | సుశీల |
| 769 | ఈ తీగ పలికిన | మాంగల్యానికి మరో ముడి | 1976 | కె.వి.మహదేవన్ | సి.నారాయణరెడ్డి | ఎస్.పి.బాలు, సుశీల |
| 770 | ఇది కూడా ఒక నవ్వే | మాంగల్యానికి మరో ముడి | 1976 | కె.వి.మహదేవన్ | వేటూరి | సుశీల |
| 771 | అయ్యో మానవుడా | మనిషి రోడ్డున పడ్డాడు | 1976 | శంకర్ - గణేష్ | గోపి | ఎస్.పి.బాలు |
| 772 | దూరము దూరము | మనిషి రోడ్డున పడ్డాడు | 1976 | శంకర్ - గణేష్ | ఆత్రేయ | సుశీల, ఆనంద్ |
| 773 | కోటికి ఒక్కరు పుడతారు | మనిషి రోడ్డున పడ్డాడు | 1976 | శంకర్ - గణేష్ | గోపి | ఎస్.పి.బాలు |
| 774 | మానవుడు | మనిషి రోడ్డున పడ్డాడు | 1976 | శంకర్ - గణేష్ | గోపి | ఎస్.పి.బాలు |
| 775 | లైఫ్ ఎ లాటరీ | మనిషి రోడ్డున పడ్డాడు | 1976 | శంకర్ - గణేష్ | కొసరాజు | ఎస్.పి.బాలు |
| 776 | హలో మైడియర్ రాంగ్ నెంబర్ | మన్మధ లీల | 1976 | చక్రవర్తి | వీటూరి | ఎస్.పి.బాలు, ఎల్.ఆర్.ఈశ్వరి |
| 777 | కుశలమేనా కుర్రదానా | మన్మధ లీల | 1976 | చక్రవర్తి | వీటూరి | ఎస్.పి.బాలు, సుశీల |
| 778 | మన్మధలీల మధురిమ కాదా | మన్మధ లీల | 1976 | చక్రవర్తి | వీటూరి | ఎస్.పి.బాలు |
| 779 | నిన్నొక మేనక | మన్మధ లీల | 1976 | చక్రవర్తి | వీటూరి | ఎస్.పి.బాలు |
| 780 | అనుభవించు రాజా | మనుషులంతా ఒక్కటే | 1976 | ఎస్.రాజేశ్వరరావు | సి.నారాయణరెడ్డి | ఎస్.పి.బాలు |
| 781 | ముత్యాలు వస్తావా | మనుషులంతా ఒక్కటే | 1976 | ఎస్.రాజేశ్వరరావు | కొసరాజు | ఎస్.పి.బాలు, సుశీల |
| 782 | నిన్నే పెళ్ళాడుతా | మనుషులంతా ఒక్కటే | 1976 | ఎస్.రాజేశ్వరరావు | దాసరి | సుశీల |
| 783 | పాండవ వీరులు లేని | మనుషులంతా ఒక్కటే | 1976 | ఎస్.రాజేశ్వరరావు | సి.నారాయణరెడ్డి | దూసి బెనర్జీ |
| 784 | రాముడు అడవుల పాలయినా | మనుషులంతా ఒక్కటే. | 1976 | ఎస్.రాజేశ్వరరావు | ఆత్రేయ | ఎస్.పి.బాలు |
| 785 | తాతా బాగున్నావా | మనుషులంతా ఒక్కటే | 1976 | ఎస్.రాజేశ్వరరావు | సి.నారాయణరెడ్డి | ఎస్.పి.బాలు |
| 786 | ఎవడిదిరా ఈ భూమి | మనుషులంతా ఒక్కటే | 1976 | ఎస్.రాజేశ్వరరావు | సి.నారాయణరెడ్డి | ఎస్.పి.బాలు, సుశీల, కోరస్ |
| 787 | గంగా యమునా తరంగాలలో | మరపురాని కథ | 1967 | టి.చలపతిరావు | కొసరాజు | ఘంటసాల |
| 788 | కళ్యాణమే వైభోగమే | మరపురాని కథ | 1967 | టి.చలపతిరావు | ఆరుద్ర | సుశీల |
| 789 | నిలు నిలు నీకోసం | మరపురాని కథ | 1967 | టి.చలపతిరావు | సి.నారాయణరెడ్డి | సుశీల, జయదేవ్ |
| 790 | నూటికొక్క మనసే కోవెల | మరపురాని కథ | 1967 | టి.చలపతిరావు | ఆరుద్ర | ఘంటసాల |
| 791 | వులికి వులికి చిలిపి నవ్వులొలికే | మరపురాని కథ | 1967 | టి.చలపతిరావు | అప్పలాచార్య | వసంత, బృందం |
| 792 | ఎక్కడో తేలేవే | మరపురాని మనిషి | 1973 | కె.వి.మహదేవన్ | ఆత్రేయ | ఘంటసాల |
| 793 | ఏమి చెప్పను | మరపురాని మనిషి | 1973 | కె.వి.మహదేవన్ | ఆత్రేయ | ఘంటసాల, సుశీల |
| 794 | జామ్ జామ్ ఛలాకి కుర్రోడా | మరపురాని తల్లి | 1972 | కె.వి.మహదేవన్ | కొసరాజు | ఎల్.ఆర్.ఈశ్వరి |
| 795 | కృష్ణా రామా కింద పడ్డావా | మరపురాని తల్లి | 1972 | కె.వి.మహదేవన్ | సి.నారాయణరెడ్డి | ఎస్.పి.బాలు, సుశీల మొ॥ |
| 796 | మిల మిల మెరిసే తొలకరి సొగసే | మరపురాని తల్లి | 1972 | కె.వి.మహదేవన్ | సి.నారాయణరెడ్డి | ఎస్.పి.బాలు, సుశీల |
| 797 | ఓ ప్రేమ దేవత | మరపురాని తల్లి | 1972 | కె.వి.మహదేవన్ | శ్రీశ్రీ | ఘంటసాల |
| 798 | పదహారు కళలతో పెరగాలిరా | మరపురాని తల్లి | 1972 | కె.వి.మహదేవన్ | సి.నారాయణరెడ్డి | సుశీల |
| 799 | పిల్లగాలి ఈలలా | మరపురాని తల్లి | 1972 | కె.వి.మహదేవన్ | సముద్రాల జూ | సుశీల, వసంత |
| 800 | అయ్యయ్యో వాట్ కెన్ ఐ డూ | మారిన మనిషి | 1970 | టి.వి.రాజు | దాశరథి | ఎల్.ఆర్.ఈశ్వరి |
| 801 | చక్కని దొంగాడ | మారిన మనిషి | 1970 | టి.వి.రాజు | కొసరాజు | వసంత |
| 802 | చిన్నవాడా వెళతావా | మారిన మనిషి | 1970 | టి.వి.రాజు | సి.నారాయణరెడ్డి | వసంత |
| 803 | దొంగతనం పనికిరాదు అమ్మడు | మారిన మనిషి | 1970 | టి.వి.రాజు | దాశరథి | ఎస్.పి.బాలు |
| 804 | నువ్వు నాకు తారక మంత్రం | మారిన మనిషి | 1970 | టి.వి.రాజు | రాజశ్రీ | ఎస్.పి.బాలు |
| 805 | పాల కడలికి కడవా | మారిన మనిషి | 1970 | టి.వి.రాజు | దాశరథి | సుశీల, కోరస్ |
| 806 | ఏంచేస్తావే బుల్లెమ్మా | మారిన మనిషి | 1970 | టి.వి.రాజు | దాశరథి | ఎస్.పి.బాలు, జానకి |

సేకరణ: పున్నమరాజు శేషగిరిరావు, విశాఖపట్నం.

వచ్చే సంచికలో మరికొన్ని




# చెంచులక్ష్మి

**చిత్రంలోని పాటలతో పాటు గత సంచికలో పేర్కొన్నట్టుగా... ఆ చిత్రంలో అతి చక్కని అనుభూతిని అందించే కొన్ని స్వరఖండికల గురించి, పద్యాలలో అలౌకికమైన ఆనందాన్ని అందించే ఓ రెండు పద్యాలను గురించి ఈ సంచికలో...**

మందార మకరంద - మాధుర్యమున దేలు
మధుపంబు వోవునే - మదనములకు
నిర్మల మందాకినీ వీచికల దూగు
రాయంచ చనునే - తరంగిణులకు
లలిత రసాల పల్లవ - ఖాదియై చొక్కు
కోయిల చేరునే - కుటజములకు
పూర్ణేందు చంద్రికా - స్ఫురిత చకోరక
మరుగునే సాంద్ర - నీహారములకు
అంబుజోదర దివ్యపాదారవింద - చింతనామృతపాన విశేషమత్త
చిత్తమేరీతి నితరంబు జేరనేర్చు - వినుత గుణశీల మాటలు వేయునేల





పద్యం తెలుగువారికి మాత్రమే లభించిన వరం. అది మన సొత్తు... ఆస్తి! అసలు పద్యాల్లో ఏముంది ఎందుకు చాలామంది పద్యాల గురించి అంతగా చెప్తుంటారు అని అనుకునేవారు ఈ 'మందారమకరంద' పద్యాన్ని విని చూడండి - రసయోగం అంటే ఏమిటో తెలుస్తుంది రససిద్ధి అంటే ఏమిటో అంటే అనుభవంలోకి వస్తుంది. గుండె అట్టడుగు పొరల్లో ఇంకిపోతున్న రసగంగ కళ్ళలోకి ఒక్కసారిగా జిమ్మితే ఎలావుంటుందో తెలిసొస్తుంది. తెలిసిన తెలుగు మాష్టరుంటే ఈ పద్యంలోని ప్రతి పదానికి గల అర్థాన్ని, తాత్పర్యాన్ని అడిగి మరీ తెలుసుకోండి. మన పురాణ గ్రంథాలలో ఎంతటి ఔన్నత్యం ఉన్నదో, ఇవాళ మనం కోల్పోతున్నదేమిటో, మనకు కావలసినదేమిటో అవగాహన కొస్తుంది. తెలుగువాడిగా పుట్టినందుకు గర్వంతో గుండె ఉప్పొంగుతుంది. ఇంతటి వైభవాన్ని ఇన్నాళ్ళూ అందుకోలేకపోయానేమిటి అనే భావనతో మనసు సిగ్గుపడి తన తల దించుకుంటుంది.

ఈ పద్యం బమ్మెర పోతన విరచితమైన శ్రీమద్భాగవతం లోనిది. గాయనిగా సుశీలకు ఈ ఒక్క పద్యం పాడినందుకే పద్మశ్రీ ఇచ్చేయ్యాలి. అంత

గొప్పగా పాడారామె. సుత్తి మెత్తగా ప్రారంభమై రసభావాలను సమశృతిలో సమ్మిళితం చేసుకుంటూ 'ఇంతింతై వటు డింతింతై' అన్నట్టు పతాకస్థాయికి చేర్చటంలో సుశీల గళం, గాన సామర్థ్యం ఎంతగా సహకరించాయో అక్షరాలలోకి అనువదించి చెప్పటం కష్టం. ఇంతటి తాదాత్మ్యత రసజ్ఞ శ్రోతలకు కలుగడానికి అసలు కారకుడు యస్. రాజేశ్వరరావు. బమ్మెరపోతన గనుక బ్రతికుంటే 'పలికెడిది భాగవతమట - పలికించెడి వాడు రామభద్రుడట' అనే పద్య పాదాలకు 'వినిపించెడి వాడు రాజేశ్వరుండట' అని మరో పాదాన్ని కూడా చేర్చి వుండేవాడెమోనని అనిపిస్తుంది.

ముఖ్యంగా... 'కోయిల చేరునే కుటజములకు' అనే పాదం వద్ద 'కో.... ఓ.....ఓ.....యిల' అంటూ పాడించి గుండెలు పిండేశారాయన.

ఇక ఖమాస్ రాగానికి రాజేశ్వరరావుకి ఎంత చక్కటి అనుబంధం ఉందో - ఎందుకే నీకింత తొందరా (మల్లీశ్వరి), పాడమని నన్నడగవలెనా (డాక్టర్ చక్రవర్తి) వంటి పాటల ద్వారా శ్రోతలు గమనించవచ్చు. ఈ 'మందార మకరంద' పద్యం స్వరపరుస్తున్నప్పుడు కూడా ఖమాస్ రాగంలోని మకరందాన్నంతా పిండి పిండి పద్యంలోని అక్షరం అక్షరం కి అద్ది తెలుగుతల్లికి. సరస్వతి మాతకు ఏకకాలంలో స్వరాక్షరార్చన చేశాడాయన. 'అంబుజోదర దివ్య పాదారవింద చింతనామృతపాన విశేష మత్త చిత్త మేరీతి' అని సుశీల గళం ద్వారా వినిపిస్తుంటే ఈ పద్యాన్ని స్వరపరుస్తూ ఆనాడు రాజేశ్వరావుగారు ఎన్నిసార్లు ద్రవించిపోయి ఉంటారోనని ఊహించుకుంటే చాలు- గుండె చెమ్మగిల్లిపోతుంది. కళ్ళు కన్నీటి బావులవుతాయి. 'ఈ పద్యం పూర్తికాకముందే ప్రాణంపోతే ఎంత బావుణ్ణు' అని అనిపిస్తుంది.

"ఎక్కడున్నారు రాజేశ్వరరావుగారూ మీ స్వర మకరందాల మాధుర్యంలో మునిగి తేలిన మా మనసులు కుటజాల్లాంటి పాటల్ని ఇవాళ వినలేకపోతున్నాయి... లలితరసాల పల్లవాల్ని పల్లవుల్లోనే లలిత లలితంగా రుచిచూపించిన రసాలురు రాజేశ్వరరావుగారూ... మళ్ళీ ఎప్పుడు పుడతారు సార్...." అంటూ శూన్యంలోకి చూస్తూ బిగ్గరగా రోదించాలనిపిస్తుంది.

'డాక్టర్ చక్రవర్తి'లోని 'పాడమని నన్నడగవలెనా' పాటలో 'ఈ వీణ మోగక పోయినా నే పాడజాలక పోయినా' అనే వాక్యం వద్ద వచ్చే ట్యూన్‌ని - తర్వాత ఆలాపనతో సహా గుర్తు చేసుకుంటూ ఈ 'మందార మకరంద' పద్యంలోని 'వినుత గుణశీల మాటలు వేయినేల' అనే పాదంతో కలిపి ఆలాపించుకుంటూ ఓ క్షణం పాటు నిశ్శబ్దంగా ఉండిపోయి చూడండి పైన ఉదహరించిన అనుభూతి మీకు కలుగుతుందో కలగదో తెలుస్తుంది.

కావాలంటే యస్.పి.బాలసుబ్రహ్మణ్యంని - ఆయన మ్యూజిక్ ప్రోగ్రాంలలో గాని వ్యక్తిగతంగా గాని కలిసి మాట్లాడే అవకాశం వుంటే ఈ పద్యాన్ని ఒక్కసారి ఆలపించమని అడిగి చూడండి. రాజేశ్వరరావు గారు ఈ పద్యంలో 'కో.....ఓ.....ఓ....యిల' అంటూ స్వరపరచడంలో ఎంతటి గొప్పదనం ఇమిడ్చారో, మన 'తెల్ల కోయిల సుశీల' ఆ పాదాన్ని ఇంకెంత గొప్పగా ఆలపించారో - పద్యంలోని ప్రతి పాదాన్నీ విడమరుస్తూ విశ్లేషిస్తూ, విశదీకరిస్తూ, ఈ తన్మయత్వంతో మమేకమైపోతూ- ఆయన అందించే అనుభూతుల్ని అందుకుని చూడండి. జీవితాంతం వరకు మనల్ని బలోపేతం చేసేలా ఉంటుందా అనుభవం!!

**కంజాక్షునకుగాని కాయంబు కాయమే**
**పవన గుంభిత చర్మ భస్త్రిగాక**
**వైకుంఠు పొగడని వక్త్రంబు, వక్త్రమే**
**ఢమఢమ ధ్వనితోడి ఢక్క గాక**
**హరి పూజనము లేని హస్తంబు హస్తమే**
**తరుశాఖ నిర్మిత దర్విగాక**
**కమలేశు జూడని కన్నులు కన్నులే**
**తన కుడ్యజాల రంధ్రములు గాక**
**చక్రి చింతలేని జన్మంబు జన్మమే - తరళ సలిల బుద్బుదంబు గాక**
**విష్ణుభక్తిలేని విబుధుండు విబుధుడే - పాద యుగముతోడి పశువుగాక!**




ఈ పద్యం కూడా బమ్మెర పోతన విరచితమైన శ్రీమద్భాగవతం నుండి తీసుకున్నదే. నిజానికి ఈ పద్యం సినిమాలో 'మందార మకరంద' పద్యానికి ముందు వస్తుంది. రెండు పద్యాలలోనూ ప్రహ్లాద పాత్రధారి బాబ్జీ చూపిన అభినయం మరపురానిది. లీలావతి పాత్రధారిణి, నిజజీవితంలో కూడా అతని తల్లియైన పుష్పవల్లి, హిరణ్య కశిపుని పాత్రధారి యస్వీరంగారావు సన్నివేశానుగుణంగా ఈ పద్యాల చిత్రీకరణలో కనిపిస్తారు.

ఈ పద్యం భీంప్లాస్ రాగంపై ఆధారపడింది. భీంప్లాస్ రాగంలో రాజేశ్వరరావు స్టాంప్ ఈపద్యం ఆద్యంతం పరుచుకొని కనిపిస్తుంది. ఈ రాగంలో రాజేశ్వరరావు గారు స్వరపరిచిన పాటలను - ఈ పద్యాన్ని కలిపి ఆలపించుకుంటూ ఉంటే రసజ్ఞుడెవరికైనా సరే ఆ ట్రాన్స్ నుంచి ఓపట్టాన రాబుద్ధి పుట్టదు. ఇక పద్య ప్రక్రియ పైన, రాజేశ్వరరావు గారి స్వరరచనపైన, సుశీల గానసామర్థ్యం పైన ఉదహరించిన భావాలనే ఇక్కడ మరోసారి అనుకోవాలి... అంతే!

ఇక కీలకమైన కొన్ని కొన్ని సన్నివేశాలలో కథా సంవిధానం ప్రేక్షకులకు మరింత స్పష్టంగా అర్థమయ్యేలాగ నారదపాత్ర వ్యాఖ్యానిస్తున్నట్టుగా కొన్ని స్వర ఖండికలను జతకలిపారీ చిత్రంలో. దిగువన పేర్కొంటున్నవి అవే: ఈ స్వరఖండికలన్నిటిని ఆరుద్ర రాయగా ఘంటసాల గానం చేశారు.

**కరుణాలవాల ఇది నీదులీల**
**అంతయునువింత**
**పొగడగ నేనెంత ॥కరుణా॥**
**నీ మాయ కానంగలేరు**
**వేయి నేత్రాలు ఉన్నను ఎవరు ॥నీమాయ॥ ॥కరుణా॥**
**పరసతులను చెరబట్టే అంధుడు**
**అతడా సురలోకము పాలించే ఇంద్రుడూ ॥పర॥**
**పదవి మీద ఆశ చేత**
**ప్రభువాయెను పశువు ॥పదవి॥**
**పాపము తననేమి చేసె**
**కడుపులోని శిశువు ॥కరుణా॥**





బిశహరి రాగాన్ని మిశ్రమం చేసుకుంటూ మోహనరాగంలో స్వతంత్ర సంచారం చేసుకుంటూ స్వరపరిచారీ స్వరఖండికని. పాడుకోడానికి అతి సులువుగా ఉండి ఆకట్టుకునే సంగీతం, సాహిత్యం ఈ స్వరఖండికల ప్రత్యేకతలు. అంత్యప్రాసలు వెయ్యటంలో ఆరుద్ర హస్తవాసి అమోఘమయినది. అంధుడు, ఇంద్రుడు, పశువు, శిశువు లాంటి పదాలు మనం వింటున్నవే అయినా లయాత్మకమైన వాక్యాలతో రసభావస్ఫోరకంగా జతగూడే సరికి వాటికో కొత్తదనం చేకూరి ఆరుద్ర నైపుణ్యానికి నిదర్శనాలుగా మారిపోయాయి.

బ్రహ్మ యిచ్చిన వరములు
తెచ్చెను ఖర్మా - యీ ఖర్మా -
దుష్కర్మ నాపుట, బ్రహ్మ విష్ణులా
తరమా - తరమా? ॥బ్రహ్మ॥
తాను తీసిన గోతి లోపల పడునే - తానే ॥తాను॥
తపోశక్తిని - జయించలేరు
దైవమైన - పరదైవమైననూ
కరుణాలవాల - ఇది నీదు లీలా
అంతయునూ - వింతా - పొగడగ నేనెంత?




ఈ స్వరఖండికలో కూడా రాగపరంగా పైన పేర్కొన్న పద్ధతిలోనే స్వరరచన చేశారు రాజేశ్వరరావు. తాను తీసిన గోతి లోపల పడునే తానే దగ్గర వేగం పెంచి తిరిగి కరుణాలవాల అని అందుకునే పద్ధతి 'మరాఠినాట్య సంగీత్' శైలిని అనుసరించారని కొందరు అనుభవజ్ఞుల అభిప్రాయం.

ఏడేడు లోకాల - ఏలికా నీపైన!
పాడగా చాలదొక - నాలుకా... ॥ఏడేడు॥
నీవు తలచిన చాలు - మేరువే అణువు !
నీ చేతిలో గలదు - అందరీ పరువు...
మహిమన్న నీ దేనులే - ఏమైన !
దైవమన నీవేనులే!





తప్పనిసరిగా హిరణ్యకశిపుని స్తుతించవలసిన సందర్భంలో నారద పాత్రధారి చేత తెలివిగా పలికించిన స్వరఖండిక యిది. ఏలికా-నాలుకా/మేరువే అణువు - అందరి పరువు వంటి ప్రయోగాల ద్వారా ఆరుద్ర ఆకర్షించుకుంటే వాటిని ఆవిష్కరించటంలో ఘంటసాల గళం 'గట్టిగా', తియ్యగావుంటూ మధురమైన రసం గుండెల్లోకి పంపే కలకండను గుర్తుకు తెస్తుంది. ఈ స్వరరచనకు ఆధార రాగం బృందావనసారంగ. అక్కడక్కడ కొంత మిశ్రమం కూడ జరిగింది. 'నీ చేతిలో కలదు అందరి పరువు' అవే వాక్యం తరువాత వచ్చే ఆలాపన వినగానే మాయబజార్‌లో 'చూపులు కలసిన శుభవేళ' పాటను స్వరపరిచింది రాజేశ్వరరావేనని అర్థమయిపోతుంది.

శ్రీహరియే - నటన సూత్రధారీ - కాని
ప్రవేశించు - కొత్త పాత్రధారి
నీ వాడించుచున్న నాటకము...
ఇకనుండదు వింతలకే కాటకము ॥ఇది॥
కరుణాలవాల - ఇది నీదు లీల
అంతయును వింత - పొగడగ నేనెంత





స్వర్గలోకంపై హిరణ్యకశిపుని దాడి వలన లక్ష్మీదేవిలోని కళని శ్రీ మహావిష్ణువు ఒక ఫలంలో నిక్షిప్తం చేస్తాడు. దూర్వాస మహాముని శాపం వలన కిరాతకులుగా జన్మించిన సముద్రరాజ దంపతులు ఈ ఫలం ఆరగించటం వలన వారికి లక్ష్మీకళతో చెంచులక్ష్మి జన్మిస్తుంది. నరసింహావతారం దాల్చిన శ్రీమహావిష్ణువు ఉగ్రత చెంచులక్ష్మి స్పర్శవలన తగ్గటంతో నరహరిగా మారి ఆమెను వివాహం చేసుకోవటం - తద్వారా లక్ష్మీదేవి కలతచెంది సంవాదానికి దిగటంతో ఈ ప్రక్షిప్తం మరింత రక్తి కడుతుంది. సదాశివబ్రహ్మం సమకూర్చిన ఈ కథనానికి సూచ్యప్రాయంగా ఈ స్వరఖండికను రాశారు ఆరుద్ర. శ్రీహరియే నటన సూత్రధారి కాని ప్రవేశించు కొత్త పాత్రధారి అంటే చెంచులక్ష్మి జననం. ఇది నీవాడించుచున్న నాటకము అంటే ఆమెతో వివాహం. ఇక నుండదు వింతలకే కాటకం అంటే లక్ష్మీదేవి తన కళతో తానే సంవాదానికి దిగటం. పాటల రచయితలకు కథతో ఆనాడు ఎంతటి అవినాభావ సంబంధముండేదో తెలియటానికి ఈ స్వరఖండిక ఓ మచ్చుతునక. సింధుభైరవి రాగంలో ఈ స్వరఖండికను స్వరపరిచారు రాజేశ్వరరావు.

అధినాధుని పత్ని కూడ - విధికి బానిసే ॥అది॥
జీవపథము మారిపోవునపుడు చిత్రహింసయే
పాలకడలిలోన పుట్టి - వైకుంఠము మెట్టి...... ॥పాల॥
నేలపాలు అయినావా - నేటికి మహలక్ష్మి నేటికి మహలక్ష్మి
కరుణాలవాల - ఇది నీదు లీలా
అంతయును వింత - పొగడగ నేనెంత!





సింహేంద్ర మధ్యమం అనే రాగంలో ఈ స్వరఖండిక స్వరపరచబడింది. యోగము పట్టినప్పుడు ఎవరినైనా సరే లక్ష్మీదేవి సేవించబలసినదేనని ఈ సినిమాలోని ఓ డైలాగుని సమర్థించే స్వరఖండిక ఇది. పాలకడలిలోన పుట్టి నేలపాలు అయినావా నేటికి మహాలక్ష్మి అంటూ ఆరుద్ర చేసిన చమత్కారం గమనీయం.

**కాంత చేతిలోపల - ఏ మంత్రమున్నదో**
**కాంత చేతిలోపల - ఏ మంత్రమున్నదో**
**ఎంత భీకరుండైనా -**
**శాంతమొంది తీరునే...**
**ఇంతి కంటి చూపుకి -**
**ఇనుమైనా కరగునని .**
**అంత ఉగ్రమూర్తివీ -**
**ఇటుల మారినాడవా... ...**
**కరుణాలవాల - ఇది నీదు లీలా**
**అంతయును - వింత పొగడగ నేనెంత....**
**కరుణాలవాలా....**



హిరణ్యకశిపుని వధించిన నృసింహస్వామి ఉగ్రత చెంచులక్ష్మి స్పర్శ వలన తగ్గటం, అతడు ఆమె ప్రేమలో పడడటం పట్ల సమకూర్చిన స్వర ఖండిక యిది. ఏ మంత్రమున్నదో, శాంతమొంది తీరునే, ఇటుల మారినాడవా అనే వాక్యాల దగ్గర గాయకుడిగా ఘంటసాల చూపిన సమతుల్యమైన ప్రజ్ఞ వర్ధమాన గాయకులు గ్రహించవలసినదీ, అనుసరించవలసినదీ! ఈ స్వరఖండిక మోహన రాగం ఆధారంగా స్వరపరచబడినదే అయినా మరాఠీ సంప్రదాయరీతిలో జారుడు గమకాలు ప్రయోగించటం వలన ఆ రాగం వినూత్నంగా వినిపించి వీనులవిందు చేసింది.

కొన్ని కొన్ని సినిమాలు తర్వాతి తరం వారికి తప్పనిసరిగా చూపించి తీరాలి. లేకపోతే ధ్వని కాలుష్యం లో యువతరం కొట్టుకుపోతుంది. పిజ్జాలు, బర్గర్‌లు లాంటివి తినేవారికి అవి కాలక్రమేణా హానిచేస్తాయని చెబుతూ ఇంట్లో కనీసం పెరుగన్నమైనా ఎలా తినిపిస్తామో అలాగే పిల్లల మానసిక ఆరోగ్యం కూడా చాలా ముఖ్యం అని తెలుసుకోవాలి. చెంచులక్ష్మి సినిమాలోని పాటలు, పద్యాలు వినడం - ఆకళింపు చేసుకోవడం - పిల్లలకి పెద్దలకి ఉత్తమ సంస్కారానికి దోహదం చేసే ఒక కాయకల్ప చికిత్స లాంటిది. మన సంస్కృతి సంప్రదాయాలపట్ల గౌరవం పెంపొందేలా మన పిల్లల అభిరుచులు రూపొందాలనుకుంటే ఇటువంటి సినిమాలు సీడీల రూపంలో భద్రపరుచుకుని తర్వాతి తరాలకు చూపిస్తూ వుండాలి. ■

## టెక్నీషియన్సు




| | | |
|---|---|---|
| కథ, మాటలు | : | వి.సదాశివబ్రహ్మం |
| స్క్రీన్‌ప్లే | : | వి.సదాశివబ్రహ్మం, బి.ఏ.సుబ్బారావు, కె.యస్.ప్రకాశరావు |
| పాటలు | : | ఆరుద్ర, కొసరాజు, సదాశివబ్రహ్మం, సముద్రాల |
| నృత్యము | : | వి.జె.శర్మ |
| కళ | : | వాలి |
| ఫోటోగ్రఫీ | : | సి.నాగేశ్వరరావు |
| సౌండ్ | : | ఎ.కృష్ణన్ |
| ప్రొడక్షన్ చీఫ్ | : | బి.సత్యం |
| ప్రొడక్షన్ మేనేజర్ | : | ఐ.నాగేంద్రరావు |
| దుస్తులు | : | బి.నారాయణమూర్తి |
| ఎడిటింగ్ | : | కె.ఎ.మార్తాండ్, హరిబాబు |
| మేకప్ | : | కె.నాగేశ్వరరావు, కె.యస్.చౌదరి |
| పబ్లిసిటి | : | స్టూడియో శర్మ టి.వి.ఎస్. |
| స్టిల్స్ | : | జైహింద్ స్టూడియో |
| అసోసియేట్స్ దర్శకత్వం | : | కె.కుటుంబరావు |
| కెమెరా | : | సింగ్ |
| సంగీతం | : | యస్.హనుమంతరావు |

| | | |
|---|---|---|
| కళ | : | బి.కృష్ణారావు |
| స్టూడియోస్ | : | వాహిని, విజయ, వీనస్ |
| ప్రాసెసింగ్ | : | విజయా లేబరేటరీస్ |
| నృత్యములు | : | ఇ.వి.సరోజ, పి.టి.సరోజ, తంగప్ప, రెడ్డి. |
| ప్లేబాక్ | : | ఘంటసాల, జిక్కి సుశీల, మాధవపెద్ది సత్యం, వైదేహి, పిఠాపురం నాగేశ్వరరావు, శ్రీనివాస్. |
| మ్యూజిక్ | : | యస్.రాజేశ్వరరావు |
| నిర్మాత - దర్శకుడు | : | బి.ఏ.సుబ్బారావు |

## తారాగణం

**శ్రీమతి అంజలీదేవి, ఎ.నాగేశ్వరరావు, రేలంగి, యస్.వి.రంగారావు, శ్రీమతి పుష్పవల్లి, మాస్టర్ బాబ్జీ, గుమ్మడి (గెస్టు ఆర్టిస్టు), శ్రీమతి సంధ్య.** ఎ.ఎల్.నారాయణ, వంగర, ఎ.వి.సుబ్బారావు, కోడేరు వస్తాదు రాజు, శ్రీనివాసన్, శివశ్రీ, నాగభూషణం, నల్లరామమూర్తి, సీతారాం. రెడ్డి (అంజలీ పిక్చర్సు), పి.వి.వి.పంతులు, లక్ష్మయ్య చౌదరి, సుబ్రహ్మణ్య చౌదరి, చిన్న రాఘవులు, కృష్ణయ్య, మల్లేశ్వరి, లక్ష్మి, కమల కుమారి, సుగుణ, కోటేశ్వరరావు, రెడ్డినాయుడు, సత్తిరాజు



స్వర్గీయ ఘంటసాల విగ్రహాన్ని పబ్లిక్ గార్డెన్స్ నుండి తరలించి 09.06.2003న రవీంద్రభారతిలో ప్రతిష్ఠించిన తరుణంలో పాల్గొన్న ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడు, సాంస్కృతిక మరియు పర్యాటక శాఖామంత్రి తలసాని శ్రీనివాసయాదవ్‌తో పాటు డా॥ సి.నారాయణరెడ్డి, యస్.జానకి, యస్.పి.బాలసుబ్రహ్మణ్యం, ఘంటసాల రత్నకుమార్. ఘంటసాల సావిత్రమ్మ






ఆ సందర్భంగా ఏర్పాటైన సాంస్కృతిక కార్యక్రమంలో ఘంటసాల పాడి స్వరపరిచిన పాటలను ఆలపించి సభికులను ఉర్రూతలూగించిన 5 ఏళ్ళ నుండి 17 ఏళ్ళ వయసు గల 32 మంది బాలబాలికలతో పాటు, వారందరినీ తీర్చిదిద్దిన లిటిల్ మ్యుజిషియన్స్ అకాడమీ అధినేత కె.రామాచారి, వీరి ప్రదర్శనకు పులకించి పోయి వేదికపైకి వచ్చి ప్రత్యేకంగా ఫోటో తీయించుకున్న పి.బి. శ్రీనివాస్, యస్.జానకి, యస్.పి.బాలసుబ్రహ్మణ్యం, సంగీత దర్శకులు రాజ్, మాధవపెద్ది సురేష్ మొదలైనవారు

అదే వేదికపై ఘంటసాల రత్నకుమార్ నుండి మెమెంటో అందుకుంటున్న చిన్నారులు ఫోటో తీయించుకుంటున్న సమయంలో ఆ చిన్నారులను ప్రోత్సహించడానికి కెమెరాకు సహకరించిన యస్.పి.బాలు.

